ISSN 2766-0168
అంతర్జాల త్రైమాస పత్రిక
వ్యవస్థాపక సంపాదకులు
కీ.శే. గురజాడ వేంకట అప్పారావు
www.prakasika.org

# ప్రకాశిక

సమగ్ర సాహిత్య, సామాజిక పత్రిక

సంపుటి 5 | సంచిక 1 జనవరి-మార్చి 2025



మమత-సమత-మానవత
www.gurajada.org







సామాన్యజనులకు
ఏ భాష ద్వారా జ్ఞానం
కలుగజేయవలసి
ఉంటుందో
ఆలోచించండి!

~ గిడుగు

నా మాతృభాష
సజీవమైన
తెలుగు

~ గురజాడ





# సంపాదక మండలి






ISSN 2766-0168 | అంతర్జాల త్రైమాస పత్రిక | www.prakasika.org | editor@prakasika.org



# అమ్మ వాడే భాషే అమర భాష

అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవ శుభాకాంక్షలు. బంగ్లాదేశ్ ఏర్పడ్డాక, ఆ దేశంలో అధిక శాతం ప్రజలు మాట్లాడే బెంగాలీ భాషని కూడా అధికార భాషగా ప్రకటించాలని చేసిన ఉద్యమం గుర్తుగా 26 సంవత్సరాల క్రితం 21 ఫిబ్రవరిని అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవంగా ప్రకటించారు. ఇక్కడ గమనించాల్సిం దేమంటే ఒకే మతానికి చెందిన దేశం నుంచి విడిపోయిన ప్రజలు మతపరమైన హక్కుల కోసం కాకుండా, తాము మాట్లాడే భాష ఉనికిని రక్షించుకోవడం కోసం ఉద్యమం చేశారు. మనుషులు పాటించే ఆచార వ్యవహారాలు, అవలంబించే మతాలూ ఊహ తెలిసాక అవగాహనకి వస్తాయి. కానీ, భావ వ్యక్తీకరణకి అవసరమైన భాష అమ్మ ఒడిలోనుంచే, ఇంకా చెప్పాలంటే అమ్మ గర్భంలోనుంచే శిశువుకి అబ్బుతుంది. అభిమన్యుడు పద్మవ్యూహ రహస్యాలు గర్భస్థ శిశువుగా ఉన్నప్పుడే నేర్చుకున్నాడని కదా భారతం చెబుతోంది! ఈ సందర్భంగా గమనించవలసిన ఇంకో విషయం ఏమిటంటే, మన పొరుగు రాష్ట్రాలయిన కేరళ, తమిళ నాడులలో ప్రజలు అవలంబించే మతాలు ఏమైనా దాదాపుగా రాష్ట్ర ప్రజలందరూ వారి రాష్ట్ర భాష మాట్లాడతారు; అది గర్వకారణంగా భావిస్తారు. ఇప్పటికీ కేరళ, తమిళనాడులలో ఆయా భాషలలో వచ్చే దినపత్రికలూ, వారపత్రికలతో సహా సాహిత్య పత్రికలని కొని చదువుతారు. దురదృష్టవశాత్తూ, ఈ పాఠక ప్రాచుర్యం ఉభయ తెలుగు రాష్ట్రాల విషయంలో నిజమని చెప్పలేను.

ప్రాంతీయ భాషలో మాట్లాడడం కన్నా వారి వారి మత భాషలలో మాట్లాడే ప్రజలు ఎక్కువ మందే ఉన్నారు తెలుగు రాష్ట్రాలలో. ఇది తప్పా, ఒప్పా అనేది ఇక్కడ చర్చ కాదు. ఒక దృగ్విషయాన్ని ఆవిష్కరించడమే ఇచటి ఉద్దేశం. భాష వ్యక్తి ఉనికికే కాదు, సమాజపు ఉనికికి కూడా ఆయువుపట్టు. సమాజ, జాతి ఏకీభావనకు భారతీయ భాషల ఆలంబన అవసరం. మిగతా దేశాలలో లేని సంక్లిష్టత భారత దేశంలో ఉన్నది – అది బహుభాషా సౌరభం.

మాతృభాషలో మాట్లాడడం వల్ల బుద్ధి బాగా వికసిస్తుందని, పిల్లలు మాతృభాషలో ప్రాథమిక విద్యనభ్యసిస్తే భవిష్యత్తులో బాగా రాణించగలరని, మాతృభాషలో ప్రావీణ్యం ఉన్న వారు వేరే భాషలు సునాయాసంగా నేర్చుకోగలరని, ఇలా ఎన్నో ప్రయోజనాలు ఉన్నాయని పరిశోధనలలో తేలినట్టు చదువుతున్నాం, వింటున్నాం. ఇవన్నీ ముంజేతి కంకణానికి అద్దం ఎందుకన్న సామెతని గుర్తు చేస్తాయి.

భారత రాజ్యాంగం మాతృభాషలో ప్రాథమిక విద్యా బోధన జరగాలని నిర్దేశించినా, కొన్ని రాష్ట్రాలు ఆంగ్ల మాధ్యమంలో ప్రాథమిక విద్యాబోధనకే మొగ్గు చూపుతున్నాయి. ముఖ్యంగా, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం విషయానికి వస్తే, పరిస్థితి అగమ్యగోచరమనే చెప్పాలి. తెలుగు మాధ్యమంలో బోధించే పాఠశాలలు మరుగవుతుండడం ఒక విపత్కర పరిణామాన్ని సూచిస్తోందని చాలామంది విద్యావేత్తలు, భాషాభిమానులు ఆందోళన చెందుతున్నా, ఆంగ్ల విద్య, ఆంగ్ల మాధ్యమంలో బోధనలో జరిగే చదువు కేవలం ఉన్నత సామాజిక వర్గ పురోగతికి కారణమని చెప్పే ఒక తప్పుడు ప్రచారం జరగడం దురదృష్టకరం; ఇది రాజకీయ కోణంలో ఆలోచించి సమాజాన్ని చీల్చే ప్రయత్నంలో భాగమని కొందరు భావించడం తప్పుకాదేమో అనిపిస్తుంది. తెలుగు మాధ్యమంలో డిగ్రీ వరకూ చదువుకుని, తెలుగు సాహిత్యంలో ఉన్న ఎన్నో అపురూపమైన

పాఠ్యాంశాలని చదువుకుని, ఉన్నత విద్యనభ్యసించి, వేర్వేరు రంగాలలో నిష్ణాతులుగా రూపొంది ప్రపంచంలో వెలుగొందుతున్న వారు ఎంతోమంది ఉన్నారు. ఇంకా చెప్పాలంటే, ఎంతోమంది ప్రవాసులు, వారి వృత్తి ఏదైనాకానీ, తెలుగు సాహిత్యాధ్యయనంతో పాటు రచనా వ్యాసంగాన్ని కూడా అభిరుచిగా ఎంచుకుని కొనసాగిస్తున్నారు.

అన్నీ మనకి అందుబాటులో ఉంటే వాటి విలువ మనకి తెలియదు కదా ! కూటి కోసం, ఉన్నత విద్య, ఆశయాలు నెరవేర్చుకోవడం కోసం ఎంతో మంది గత మూడు, నాలుగు దశాబ్దాలుగా భారత దేశం దాటి వేరువేరు దేశాలకు వలస వెళ్ళడం ఒక చారిత్రక పరిణామం. ఏదో కోల్పోతున్నామేమో అనే బాధ, ఆతృతతోనూ, సహజమైన భాషా సంస్కృతుల పట్ల ఉన్న ప్రేమ, మక్కువ కారణంగా కొంతమంది నాయకత్వంలో తెలుగు సంఘాలు ఏర్పడి, తెలుగు వారు వారి ఆచార వ్యవహారాలని మరవకుండా, పండగలకీ, పబ్బాలకీ కలుస్తూ భాషా సంస్కృతులను పరిరక్షించుకునే ప్రయత్నం చేయడం అభినందనీయం. ఇళ్లలోనో, గుళ్ళలోనో నడిపే తెలుగు బడులకి వారాంతంలో వానలో, ఎండలో, మంచులో, మైళ్ల కొద్దీ ప్రయాణించి పిల్లలని తీసుకువెళ్ళి తెలుగు నేర్పించే ప్రయత్నం చేసే తెలుగు ప్రవాసులు ఎందరో ఉన్నారు. అప్రస్తుతం అనిపిస్తున్నా, సందర్భం కోసం ఒక విషయం చెప్పాలి. మా అమ్మాయి చిన్నప్పుడు ‘బాలభారతి’ అనే పేరుతో సంస్థాగతమైన తెలుగు బడిని అమెరికాలో స్థాపించి సుమారు ఆరు సంవత్సరాలు శ్రీమతి అరుణ గురజాడ, నేను నిర్వహించాము. ఈ సంస్థ ద్వారా శ్రీమతి సావిత్రి గారి హరి కథ, కార్టూనిస్ట్ మల్లిక్ గారి కార్టూన్ workshop (పిల్లల కోసం), గరికిపాటి నరసింహారావు గారి పిల్లలనుద్దేశించిన ఉత్తేజపూరిత ప్రసంగం (నా సూచన మేరకు ఆయన చేసిన ప్రసంగం సామాజిక వ్యాఖ్యానంతో కూడిన ప్రవచనాలకి తొలి అడుగు! ), ఇలా ఎన్నో కార్యక్రమాలు చేసి పిల్లలకి భాష పట్ల అభిరుచిని కలిగించే ప్రయత్నం చేశాము.

కొందరు తలిదండ్రులు పని ఒత్తిడి, అనాసక్తి లాంటి కారణాల వల్ల ఇంట్లో పిల్లలకి తెలుగు భాష పట్ల ఆసక్తి కలిగించలేకపోవడం దురదృష్టకరమయినా, చాలామంది తెలుగు వారు ఇంట్లో తెలుగు మాట్లాడడం వల్ల వారి పిల్లలకి తెలుగు నేర్చుకునే అవకాశం కలిగించారు, కలిగిస్తున్నారు. ఈ సందర్భంగా 'మాతృ భాష' అనే కంటే, 'ఇంటి భాష' అనడం సబబేమో! కానీ, భాషాంతర వివాహాలు ఎక్కువ అవుతున్న ఈ రోజుల్లో ఆంగ్ల భాష అమ్మ భాషగా అలరారుతుండడం గమనించదగ్గ విషయం. భారత దేశంలో కూడా ఈ పరిస్థితి అరుదు కాదు. కాబట్టి, అమ్మ భాష ఏదైనా, బిడ్డ నేర్చే భాష అమ్మ సంస్కారం మీదే ఆధార పడి ఉంటుంది. అందుకే, అమ్మకి మాతృభాష పట్ల మక్కువ చెక్కుచెదరకుండా ఉండాలి.

తెలుగు రాష్ట్రాల విషయానికి, ముఖ్యంగా ఆంధ్ర రాష్ట్రం విషయానికి వస్తే, తెలుగు భాష మనుగడ గురించి ఆందోళన కలగక మానదు. తెలుగు మాధ్యమంలో ప్రాథమిక విద్య స్థాయిలో బోధనకి ప్రభుత్వమే అనానుకూల పరిస్థితి కలిపించడం, కొందరు తల్లిదండ్రులు, మేధావులు అన్నప్రాశన నుండే ఆంగ్లం పట్ల మొగ్గు చూపడం హర్షనీయ పరిణామం కాదు. ఇంతకుముందు సూచనప్రాయంగా చెప్పిన విషయం, ఏమంటే ఏ భాషా మాధ్యమంలో చదివినా, మాతృభాషపై గౌరవం, మక్కువ, మాతృ భాషలో ప్రావీణ్యం, మాతృ భాషలో ఉన్న సాహిత్యాన్ని, సారస్వతాన్నీ అధ్యయనం చేసే అభిరుచి కలిగి ఉండడం చాలా అవసరం. ఈ అవసరాన్ని తలిదండ్రులు, ప్రభుత్వాలు గుర్తించకపోవడం, ఇంకా చెప్పాలంటే, నిర్లక్ష్యం చేయడం, చారిత్రికమైన తప్పిదమవుతుంది.

ఈనాటి సమాజంలో మాట్లాడే అవసరం, రాసే అవసరం అంతగా లేదు. సాంకేతికత, అధునాతన పరికరాల అందుబాటు కారణంగా ఏమి చెప్పాలన్నా, ఏమి రాయాలన్నా మౌఖికంగా కన్నా, పరోక్షంగా డిజిటల్

మాధ్యమాలలో ఏమోజీలనే బొమ్మల రూపంలో తెలియచేయడం సాధారణమయిపోయింది. ఇంకొంత కాలానికి భాషకి బదులు బొమ్మల ద్వారా జరిపే సంభాషణే విరివిగా కొనసాగే అవకాశం ఉంది – ఆదిమ మానవుడిలా!

ఈ పరిస్థితి చక్కపడాలంటే చేయవలసిన పనులు, కార్యక్రమాలు సూచిస్తూ పండంటి భాషకి పదహారు సూత్రాలనో, పన్నెండు సూత్రాలనో కొందరు విద్యావేత్తలు రాసిన వ్యాసాలు చూస్తుంటాం. కానీ, అంకితభావంతో కూడిన కార్యాచరణ లేకపోతే చిత్త శుద్ధి లేని శివ పూజలా, గట్టిమేల్ తలపెట్టని వట్టి మాటల నీటి మూటల్లా ఆలోచనలు అక్షరాలకే పరిమితమవుతాయి.

తెలుగువారికి మాతృభాషకి సంబంధించిన సంకటంతోపాటు, వ్యావహారిక భాషా సంకటం కూడా తోడయింది. నన్నయ నుంచి, నేటి వరకూ, గ్రాంథిక భాషలో రచనలు చేయాలా, లేక వ్యావహారిక భాషలో చేయాలా అన్న చర్చ కొనసాగుతూనే ఉంది. చదివే వారు, రాసేవారూ ఉన్నత సామాజిక వర్గానికి చెందిన వారు ఉన్న కాలంలో వ్యావహారిక భాష నీచభాష అనే భావన నుంచి, సామాన్యులకి సైతం అర్థమయ్యే భాషలా రూపాంతరం చెంది, ఎన్నో కవితా ప్రక్రియలకీ, కథా రూపాలకీ, నవలల ఆవిర్భావానికీ ఆలంబననిచ్చిన గురజాడ, గిడుగుల విశేష కృషి మరువరానిది. పండిత భిషక్కుల భాషా వైద్యం వికటించకముందే తెలుగు భాషను సామాన్య ప్రజల భావ ప్రకటనా పరికరంగా మార్చిన "వ్యవహార భాషా ప్రయోక్త" ద్వయానికి తెలుగు జాతి ఋణపడి ఉంది.

భవదీయుడు

**డాక్టర్ కొవ్వలి గోపాలకృష్ణ**
ప్రధాన సంపాదకులు, ప్రకాశిక

# ముఖచిత్రం



## లోపల



# “నీ” “నా” ప్రేమ

మరాఠీ మూలం : శ్రీమతి మీనా ఖోండ్
తెలుగు సేత : డాక్టర్ అంబల్ల జనార్దన్
88503 49858

“అశు అక్కా ! అహో ఆశ్చర్యం! ఏంటి ఇంత అకస్మాత్తుగా? ” మొనాలి పరుగెత్తుతూ అసావరి వద్దకు వెళ్లింది. ఆమె మొనాలి ని దగ్గరకు తీసుకుంది.

“ నీ ఈ ఆకస్మిక రాక వల్ల నా కెంత ఆశ్చర్యం, ఆనందం కలిగిందో మాటల్లో చెప్పలేనక్కా.”

“నువ్విలా ఆనందంగా ఉండడమే నాకు కావలసింది. నిన్నిలా సంతోషంగా చూడడం నాకు చాలా ఇష్టం.”

“అమ్మా! చూడు, అశుఅక్క వచ్చింది,” మొనాలి ఆనందంగా తమ అమ్మగారిని పిలిచింది.

“అమ్మా అసావరీ ఏమిటి ఇంత ఆకస్మికంగా? అంతా బాగే కదా?” అమ్మ ఆశ్చర్యానందాలతో తన పెద్ద కూతురిని అడిగింది.

“అంతా బాగే అమ్మా ! అందుకే వచ్చాను.”



ఆ నాడు తమ పెద్ద కూతురు ఆకస్మికంగా రావడంతో నాన్న గారు కూడా ఆనందంగా ఉన్నారు. అమ్మగారు ఇష్టంగా శ్రీఖండ్ పూరి, ఆలువడలు మొదలగు అందరికి నచ్చే పదార్థాలు చేశారు. ఇంటివాళ్ళంతా ఎన్నో సుద్దులు చెప్పుకున్నారు. కాస్త విశ్రాంతి కూడా తీసుకున్నారు.

"అమ్మా!" "ఏంటమ్మా అసావరీ?"

"మేమలా తిరిగి వస్తామమ్మా."

"సరే కానీ, తొందరగా రండి."

"అలాగే తొందరగానే వస్తాము. నువ్వేమీ కంగారు పడవద్దు"

"ఎక్కడికెల్దాము అశు అక్కా?"

"పార్కుకి వెళ్దాం. ఆటవిడుపుగా ఉంటుంది.."

> మోనాలీ అతనికి నీపై నిజమైనప్రేమ ఉందా? నీతోనే జీవితం పంచుకోవాలని ఉందా?

వారిద్దరూ పార్క్ లో ఒక బెంచిపై కూర్చున్నారు.

"అక్కా! ఏమైంది? ఏమైనా సమస్యా?"

"ఔను సమస్యే. నీ పెళ్లి గురించి." ఎప్పటిలాగే అసావరి పెదవులపై చిరునవ్వు.

"అశు అక్కా ! అది తప్పు, దేని గురించైనా మాట్లాడు. ఆ విషయం నేను అస్సలు వినదలచు కోలేదు."

"పిచ్చి పిల్లా! ఆ విషయంపై మాట్లాడడానికే నేను వచ్చాను. మోనాలీ! మనిద్దరం అక్కాచెల్లెళ్ళమైనా, మనిద్దరిది స్నేహబంధం. సరే చెప్పు. శేఖర్ ఏమంటున్నాడు?"

"శేఖర్ సిద్ధంగానే ఉన్నాడు. కానీ నాన్న? నాన్నగారిని అడగడానికి శేఖర్ భయపడుతున్నాడు. నాకు కూడా నాన్న గారికి చెప్పడానికి ధైర్యం చాలడం లేదు."

"మోనాలీ అతనికి నీపై నిజమైన ప్రేమ ఉందా? నీతోనే జీవితం పంచుకోవాలని ఉందా? "

"ఔను అశు అక్కా ! అతనికి నాపై నిజమైన ప్రేమ ఉంది. నన్ను పెళ్లి చేసుకోవడానికి సిద్ధంగా ఉన్నాడు." మొనాలి హృదయపూర్వకంగా చెప్పింది.

"కాని నీ సంగతేమిటి? నువ్వేం నిర్ణయించావ్? నువ్వు శేఖర్ ని నిజంగా ప్రేమిస్తున్నావా? అతనితో పెళ్ళి నీకు సమ్మతమేనా? లేక నాన్న గారు చూసిన

సంబంధం చేసుకుని జీవితాంతం ఇష్టంలేని కాపురం చేస్తావా, నాలాగా ?"

"ఏమయింది అశు అక్కా !" మొనాలి స్వరం మందగించింది.

"మోనాలీ ! నాన్న తెచ్చిన సంబంధం నీకు సమ్మతమేనా? అలా చేస్తే జీవితం ఖర్చై పోతుంది. దాంపత్యంలో సారం ఉండదు."

"అశు అక్కా ! అసలు సంగతేమిటి? నిజం చెప్పు."



మల్హార్ మా సంగతి నాన్న గారితో చెప్పాలని మనస్ఫూర్తిగా కోరుకున్నాను. అలా అతను ఒకటి రెండు సార్లు మనింటికి వచ్చాడు.



"అది చెప్పడానికే వచ్చాను. ఇంతవరకు మనసు చంపుకున్నాను. ఇవాళ నీకు అంతా చెబుతాను."

"నేను సంగీతం క్లాసులకు వెళ్లేదాన్ని. అక్కడ మల్హార్ తో పరిచయమయింది. అతను చాల బాగా పాడేవాడు. రాగయుక్తంగా పాడడంలో అతను నిష్ణాతుడు. ఆసక్తికరంగా, అతను నన్ను కూడా తనతో పాడుమనేవాడు. అలా మేము కొన్ని యుగళగీతాలు తయారు చేసుకున్నాము. మాకు ఇష్టమైన పాటలు పాడేప్పుడు మేము ఆ స్వరాల్లో ముద్ద ముద్దగా తడిసిపోయేవాళ్ళం. పాడేప్పుడు మేము రాగరంగుల్లో, భావగంధాల్లో శబ్ద సౌందర్యంలో మునిగిపోయే వాళ్ళం. ఆ సంగీత ప్రయాణం, స్వరాల, ప్రేమ ప్రపంచం. దాంట్లో స్వర్గానందం ఉండేది."

కొన్ని క్షణాలు ఆగి అసావరి కొనసాగించింది.

"మల్హార్ మా సంగతి నాన్న గారితో చెప్పాలని మనస్ఫూర్తిగా కోరుకున్నాను. అలా అతను ఒకటి రెండు సార్లు మనింటికి వచ్చాడు. అతను సంగీతంలో పిహెచ్. డి. చేసాడు. 'అసావరీ! జీవించడానికి నీయొక్క, మరియు నీ స్వరాల తోడు కావాలి'. అతను ఎప్పుడూ అనేవాడు. కానీ మన నాన్నగారితో మాట్లాడడానికి అతనికి ధైర్యం చాలలేదు. మా ప్రేమ విషయం నాన్న గారికి చెప్పాలని నాకు కూడా అనిపించేది, కానీ సాహసించ లేకపోయాను. 'నేనెందుకు నాన్నగారితో మాట్లాడలేకపోయానే' అని నాపై నాకే కోపంగా ఉండేది. ఎప్పుడు చెప్పాలో ఎలా చెప్పాలో అర్థమయింది కాదు."

"తర్వాతేమయింది? అతను ఎవరిని పెళ్లి చేసుకున్నాడు?" అనుకోకుండా మోనాలి అడిగింది.

"అతను పెళ్లి చేసుకోలేదు. కానీ ప్రేమించాడు. ఓ ముఖాముఖిలో అతనన్నాడు. 'నేను ప్రేమించాను, ప్రేమిస్తున్నాను.' తాను ప్రేమించానని ఎలుగెత్తి చాటుతున్నాడు." అసావరి గొంతు జీరబోయింది. కళ్లల్లో నీరు ఉబికాయి.



నా పెళ్లి అఖిల్ తో అయింది. నేను సుఖంగానే ఉన్నాను కానీ జీవితంలోని స్వరాలు సరిగా పలకడంలేదు. నా విఫలప్రేమ గాయం ఇంకా మానలేదు.



"ఎవరిపై? ఎవరిపై అతను ప్రేమ కురిపించాడు?" మొనాలి మెల్లగా ప్రశ్నించింది.

"అతనంటాడు 'సంగీతంపై, సంగీతం పట్ల నాకు ప్రేమ ఉంది. నేను సంగీతాన్ని ప్రేమించాను.' అతను సంగీతంలో పిచ్చివాడయ్యాడు." కళ్ళు తుడుచుకొని అసావరి చెప్పసాగింది. "అప్పుడు అతనికి నాన్నగారి భయముండింది. నేను కూడా సాహసం చేయలేకపోయాను. బహుశ తనపై నా ప్రేమ పట్ల తనకు సందేహం ఉండిందేమో. నేను నా ప్రేమను అతనికి గానీ నాన్న గారికి గానీ చెప్పలేకపోయాను." అసావరి అగింది.

"అంతలో నా పెళ్లి అఖిల్ తో అయింది. నేను సుఖంగానే ఉన్నానుకానీ జీవితంలోని స్వరాలు సరిగా పలకడంలేదు. నా విఫల ప్రేమ గాయం ఇంకా మానలేదు." మోనాలి నిశబ్ధంగా వింటూ ఉంది. "అందుకనే చెబుతున్నానమ్మా వ్యాలెంటైన్ డే వస్తోంది. శేఖర్ కి ఒక ఎర్ర గులాబీ పువ్వు ఇవ్వు. ఆ ఎర్ర గులాబీ, మనసులోని ఎన్నో ఊసులు చెబుతుంది. హృదయంలోని ప్రేమను ప్రకటిస్తుంది. ప్రేమను ఒప్పుకుంటుంది. ఎంత మధురమైన ఊహ అది!"

"అక్కా నువ్వూ!" మోనాలి మొహం సిగ్గుతో ఎరుపెక్కింది.

"ముద్దపప్పూ! నీకై నువ్వు శేఖర్ తో నీ మనసులోని మాట చెప్పు. అతనిపై నీకున్న ప్రేమ అతనికి తెలియనీయ్. ఇదంతా నీకు చెప్పడానికే నేను వచ్చాను. మన ప్రేమ వ్యక్త పరచకుండా ఉండడం వల్ల, మనం మనల్నీ మనం ప్రేమించిన వారినీ, బాధకు గురి చేస్తాం. జీవితాంతం వారి సాన్నిహిత్యం కోల్పోతాం.

చేతులు కాలాక ఆకులు పట్టుకోవడంలో అర్థంలేదు. దాని వల్ల జీవితం, సరిదిద్దుకోలేని మలుపు తిరుగుతుంది."



"నిజమే అక్కా! రెండున్నర అక్షరాల 'ప్రేమ' లో ఎంతో బలం ఉంది. ప్రేమలోనే జీవితంలోని ఆనందం నిండి ఉంది. జీవితానికి సార్థకత కూర్చే విలక్షణ మాయ ప్రేమలో ఉంది. ఆ రెండున్నర అక్షరాలు ఎవరి జోలెలో పడతాయో వారు అదృష్టవంతులు." భావోద్వేగంతో అంది మోనాలి.

"ఓ ప్రేమ పిచ్చిదానా! నీకు ప్రేమ కావాలి కదా? నేను నీ వెన్నంటి ఉంటాను. నేను నాన్నగారికి నచ్చ చెబుతాను. అమ్మగారి గురించి ప్రశ్నయే లేదు."

"అశు అక్కా ! నిజం. తన మనసులోని మాట చెప్పక పోవడంవల్ల స్త్రీ తన మొదటి ప్రేమ నుండి దూరమౌతుంది. ఆ ప్రేమను మనసులో ఉంచుకొని వేరే వారితో కాపురం చేస్తుండవచ్చు. కానీ దానిలో జీవం ఉండదు."మోనాలి అంది.

" కానీ అలా ఉండకూడదు. అది కాకూడదు. ఒక స్త్రీకి తన ప్రథమ ప్రేమను సాధించుకునే వెసులుబాటు ఉండాలి. సరే మేడం! సిద్ధంగా ఉండు. నేను పూలగుచ్చం ఇస్తాను. ఎర్ర గులాబి ఇస్తాను." ఇద్దరూ మనసారా నవ్వుకున్నారు.

"మోనాలీ! ఇవాళ వ్యాలెంటైన్ డే. ప్రేమికులకై ఒక మంచి ప్రేమ దినం. ఇవాళ మనం మన ప్రేమ వ్యక్తం చేయవచ్చు."

ఎంతో సేపు మోనాలి, అసావరి చేతిలో చెయ్యి వేసి అలా చూస్తూ ఉండిపోయింది.

"ధన్యవాదాలు అశు అక్కా, ధన్యవాదాలు. ధన్యవాదాలు వ్యాలంటైన్ డే! ఐ లవ్ యూ!"

మరాఠీ కథ లంకె. https://www.merisaheli.com/short-story-prem-tuze-ni-majhe/#google_vignette





# గ్రామ్యమా ? వాడుక భాషా ?

కీ. శే. విశ్వనాథ సత్యనారాయణ



వాడుకభాషనే కొందరు 'గ్రామ్యభాష' అంటున్నారు. గ్రామ్యభాష అనటం ఎంతవరకు సమంజసమో చూద్దాము. గ్రామీణులైన జనులు వాడుకునేది గ్రామ్యము. గ్రామ్యమనగా అసభ్యమని యర్థము. అందుచేత వారు నగరస్థులు సభలలో వాడే అంత భావగౌరవం కలభాష వాడరు. దానివలన గ్రామ్యం అపరిగ్రాహ్యం కావచ్చును.

మేము మా పత్రికలో వాడే భాష గ్రామ్యభాష అని ఈమధ్య ఎవరో వ్రాశారు హైదరాబాదు 'సుజాత'లో. సజీవమన భాష, ఆ భాష పొందే మార్పులూ ఆ భాష మాట్లాడేందుకు బొడ్డు అయిన ప్రదేశాల్లో సువ్యక్తంగా కనబడతవి. అక్కడ దాన్ని గురించి సానుభూతి వుంటుంది. అట్లాగే ఇంగ్లీషు భాష నేటికాలంలో అసలయిన వాడుకభాష కావాలి అంటే, లండన్ లో కనబడుతుంది. తెనుగు భాష కృష్ణా, గుంటూరు, గోదావరి, విశాఖపట్నం జిల్లాలలో మాట్లాడేది అట్లాంటిది. ఇతర భాషలతో కలిసివుండే ప్రదేశాల్లో ఈ భాష మార్పునందు అంత సానుభూతి వుండదు. బరంపురం, హైదరాబాదు, చిత్తూరు ఇటువంటి యితర భాషా సంపర్కం కలచోట్ల వాళ్ళకి గ్రాంథికభాష నిలబెట్టుకోటమే కష్టం. అందుచేత భాష పొందే మార్పులని కూడా యెక్కడ సంభాళించుకుంటారు? దానిమూలంగా వాళ్ళకి దీనియందు సానుభూతి తక్కువగా వుంటుంది.

అయితే మీచోట్లనే వాడుకభాషని నిరసించేవాళ్ళు వున్నారుగదయ్యా అంటే వున్నారూ! మేము చెప్పింది సామాన్య విషయం. ఉత్సర్గం కాదు అంటాము.

విచారిస్తే, ఈ గ్రామ్యశబ్దం వాడుకభాష యందు ఎందుకు ప్రయోగింపబడుతోందీ అంటే 'యస్త్వపభ్రంశో గ్రామ్యః' అన్న నన్నయ్యగారి సూత్రం వల్ల. తెలుగుకి సంస్కృతం మాతృకగా చేసిన నన్నయ్యగారు తెలుగు వ్యాకరణం వ్రాశేటప్పుడు సంస్కృత మర్యాదలు పాటించారా? కాదు. తెలుగు భాషాస్వభావం వారికి బాగా తెలిసి ఆ మర్యాదలన్నా చేశారా? 'శాస్త్ర మపౌరుషమాద్యం' అన్న నన్నయ్యగారికి తమయందు ఋషిత్వం సిద్ధించిందేమో చూశారా! అట్లాగయితే మనం ఆంధ్రశబ్ద చింతామణి తెరుస్తూనే 'ఓం నమో నన్నయా థర్వణ చిన్నయసూరిభ్యో మహాఋషిభ్యః' అనటం లేదేమి?



అసలు గ్రామ్యం అంటే మన పూర్వుల వుద్దేశం ఏమిటి? మన మేమనుకుంటున్నాము.



సంస్కృత లాక్షణికులు 'కటి గల్లాది' శబ్దాలు గ్రామ్యములన్నారు; కాని 'గచ్ఛతి' అన్నదానికి ఏ అపభ్రంశరూపమో 'గచ్ఛేత్తై' అంటిది తీసుకొని అది గ్రామ్యమనలేదేమి? ఆ, కటి గల్లాది శబ్దాలు మన గ్రంథాల్లో బహుగా ప్రయోగించారే మరి ?

అందాకా యెందుకు ? నర్సభూపాలీయంలో 'కన్నులు', 'చన్నులు' గ్రామ్యాలు అన్నాడు. మరి అవ్వి లేకండా మనకు కావ్యం నడవదే. ఎట్లా ?

అసలు గ్రామ్యం అంటే మన పూర్వుల వుద్దేశం ఏమిటి? మన మేమనుకుంటున్నాము. పూర్వుల వుద్దేశం అసభ్యమైన భాష అని. కొన్ని బజారు మాటలు నలుగురు పెద్ద మనుష్యుల్లో సభలలో మాటాడరానివి వుంటయ్యి. అవీ పూర్వం సంస్కృతంలో కటి గల్లాదు లట్లాంటివి. చన్నులు ఇప్పుడు అట్లాంటిది.

సభలలో మాట్లాడేది సభ్యం. ఈ వాడుకభాష, సభలలో, అది గ్రామ్యం అనేవారు కూడా మాట్లాడుతున్నారు. బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి ఉపన్యాసం రక్తిగా వుంటుంది అంటే యెందుకని? వారు వాడుకభాష ప్రయోగిస్తారు. కాకుధ్వని వాడుక భాషలోనే వున్నది. గ్రాంథికభాషలో కాకువు సాధించుకోవాలి. గ్రాంథికభాషావాది అన్నకొద్దీ కాకువు రమ్యత తెలియనివాడని అర్థం.

ఈ కాకువు గ్రాంథికభాషలో ఇమిడ్చేటందుకు తిక్కన్న పడ్డ కష్టం భగవంతుడికి తెలుసు. అందుకునే భాగవతం అర్థం చెప్పటం కష్టం, భారతం చదవటం కష్టం అనీ అంటారు. భాగవతంలో వేదాంతార్థం పెగలదు. భారతంలో కాకుస్వరం తెలియదు. అది తెలయకనే భారతంలో ఏమున్నదీ అంటారు కొందరు.



కొందరు నన్ను అడిగారు! పద్యాలూ వ్రాస్తావు నువ్వు. వాడుకభాషా వ్రాస్తున్నావు! నీకది యిష్టమా! ఇది యిష్టమా! అని.



కాకువు అంటే భావద్యోతకానికి ఉచ్చారణలో చూపే ఒడుపు. ఒక భాషా సామర్థ్యం ఆ భాషలో కాకుధ్వనిని బట్టి తెలుస్తుంది. ఆ కాకుధ్వనిని గ్రాంథికభాషకన్న వాడుకభాష మిక్కిలిగా ప్రయోగిస్తుంది. వాడుకభాషా అంటే ప్రత్యయాల మార్పు మాత్రమేగా అనుకోవచ్చు. నేటి కొందరు కవుల భాష ప్రత్యయాలు మారిస్తే, వాడుకభాష కన్న అమితకనా కష్టం అవుతుంది. ఏ శ్రీనాథుడి కవిత్వమో ప్రత్యయాలు మారిస్తే దానికి గ్రామ్యత్వం సిద్ధించదు.

సంస్కారం పొందిన హృదయం, వాక్కూ కలవాడు వ్రాసినా మాట్లాడినా భాషకి కొంత గౌరవం వుంటుంది. గౌరవంగల శబ్దాలు వాడతాడు. సంస్కారరహితమైన హృదయమూ, వాక్కూ కలవాళ్ళ గ్రాంథికభాషలో వుండే ప్రత్యయాలు చివర కలిపినా, అది అట్లాగే వుంటుంది.

ఈ వాడుకభాష యెందుకు వద్దూ! అని అడిగితే పండితులు చెప్పే కారణాలు ఏమిటంటే ఇందులో శబ్దాలు ఇష్టం వచ్చినట్లుగా మారుతున్నవి. ఆ మార్పుకు హద్దు లేదు. అందువల్ల గ్రాంథికభాష మారిపోతుంది అని. మార్పుకు హద్దు లేదూ అంటే హద్దు వున్నది. గోడని ఎవ్వరూ 'గేడ' అనరు. 'చూడటం' 'చూట్టం' అవుతుంది. ఒక్కరితకు యాభై రూపాలు వ్రాసిన వ్యాకరణం ఈమాత్రం చెయ్యలేదూ!

కొందరు నన్ను అడిగారు! పద్యాలూ వ్రాస్తావు నువ్వు. వాడుకభాషా వ్రాస్తున్నావు! నీకది యిష్టమా! ఇది యిష్టమా! అని. రెండూ ఇష్టమేనన్నా! దానికి ఒప్పుకోరు. ఒప్పుకోక 'ఆ! అది ఎట్లా!' అంటారు. వారన్నది నాకు తెలియటం లేదు.

బ్రహ్మశ్రీ ఆచంట సాంఖ్యాయనశర్మగారు మన దేశానికి భీష్ములవంటివారు. వారు అన్నారుగదా! 'ఈ క్రొత్త భాష వల్ల భారత భాగవతాలు మూలపడతవి' అని. ఈ భాష వల్లనే అట్లా జరిగేటట్టయితే అది యిదివరకే జరగాలి. బొబ్బిలి పాటలు, కాకమ్మ కథలు, రామదాసు కీర్తనలు, కొంతదాకా త్యాగయ్య కృతులూ ఇవన్నీ వాడుకభాషలోనే వ్రాయబడ్డవి. అవీ అచ్చుపడ్డవి. దానివల్ల భారత భాగవతాలకు వచ్చిన నష్టం లేదు అన్నా.



**ఈ భాష చదివితే పిల్లలు పాడయి పోతారూ అన్నారు. ఈయూనివర్సిటీ వారూ గవర్నమెంటువారూ పెట్టే గ్రాంథికనామక గ్రంథాలవల్ల**



అయితే భారత భాగవతాలు ఈ భాషలో వ్రాయవచ్చునా? అని అడిగేరు. నేను కాదు అన్నాను. వాడుకభాషకి అంత సామర్థ్యం లేదు. నేడు రామాయణం ఈ భాషలో వ్రాయాలని కాదు. ఈ భాషలో వ్రాసినా, ఆ భాషలో వ్రాస్తే, ఏ అందం వచ్చిందో, ఆ అందం రాదు. ఆ రెంటి తారతమ్యానికి బొబ్బిలి కథని రంగారాయ విజయంతో పోల్చి చూస్తే తెలుస్తుంది.

ఈభాషచదివితేపిల్లలుపాడయిపోతారూఅన్నారు.ఈయూనివర్శిటీవారూ గవర్నమెంటువారూ పెట్టే గ్రాంథికనామక గ్రంథాలవల్ల పాడవుతారేగాని, శక్తిగల జీవంగల నుడికారం ప్రయోగించిన వాడుకభాషా గ్రంథాలు చదివితే చెడిపోరు అంటాను.

భాష స్వభావం తెలుసుకోకండా గ్రంథస్థభాషలో వున్న ప్రత్యయాలకి మాత్రమే అగౌరవం కలిపిస్తే, దానివలన భాషకి చాలా నష్టం వుంది. పిల్లలకి అటువంటి భాష నేర్పరాదు. ఆ భాష తగినంత జీవంగల భాష అయివుండాలి. నిర్జీవమైతే గ్రాంథికభాష అయినా పిల్లలకు నేర్పకూడదు. గ్రాంథికభాష అన్న పేరుతో తప్పురూపాలు కోటానకోట్లుగా వున్న భాష (ఇప్పటి స్కూళ్ళల్లో పెట్టే పుస్తకాల భాష) వాళ్ళకి నేర్పరాదు. సామాన్యంగా పిల్లలచేత నేడు స్కూళ్ళల్లో చదివించే నవలలూ అవీ్వని, కుఱ్రవాడికి భాషలో వుండే శక్తిని తెలియనియ్యటం లేదు. భాష శక్తి కారకంలోనూ కాకువులోనూ హృదయోద్వేగం ప్రకటించే మాటల్లోనూ వుంటుంది. ఆ శక్తి తిక్కన రచనలో సమృద్ధిగా వుంది. కొందరి

కవులల్లో అది కనపడనే కనపడదు.



భాష ప్రవాహిని. మారుతూ వుంటుంది. కనుక మారే భాషని పట్టుకోటానికి వీలులేదు అని భాషావాదుల తర్కం.



'వచ్చుచున్నది', 'వస్తున్నది', 'వస్తోంది' అన్న రూపాల దగ్గర కాదు తగాదా. బాహుళ్యం మీద, భాషాస్వభావం మీద. ఈ రూపాలన్నీ కూడా వాడికి తెలియవలసిందే. అవి వాడేచోట్లు వేరుగా వుంటవి. పసిపిల్లలకి చెప్పే చిన్ని చిన్ని కథల్లో 'వస్తోంది' అని వాడవచ్చు. ఇంకేదైనా అయితే 'వస్తున్నది' అనవచ్చు. 'వచ్చుచున్నది' గ్రాంథికభాషారూపం తెలిసేటందుకు.

మన భాషలోకి యితర దేశ్యాలు యధేష్టంగా ప్రయోగించవచ్చు. 'ఫీలు' కూడా భాషలోకి వచ్చింది. 'సప్లయి' మొదలైనవి శబ్దరత్నాకరంలోనే వున్నవి. 'వస్తాడు' అన్న నింద్యగ్రామ్యం. ఇది యెట్లా వుందంటే, దొరగారితో కలిసి, 'టీ' త్రాగవచ్చుకాని పంచముణ్ణి దగ్గరకు రానీయరాదు. మహమ్మదీయుడికి శూద్రమర్యాద వచ్చింది. దొరకి దొరమర్యాదే సిద్ధించింది. మాలవాడికి ?

అనింద్య గ్రామ్యమైనది 'కఱకంఠుడు' ఎందుచేత ? అనుశాసకుడికి పూర్వం వ్రాశాడు ఏకవో ఆ మాట. కవులందరూ వ్రాసేవరకు ఈ అనుశాసకుడు ఆగరాదూ! అనింద్యగ్రామ్యాలు అన్నీ తెలిసేవిగా! ఎవరో కొందరు పండితులు 'ఇది గ్రామ్యం, వద్దు' అంటే ప్రతివాడున్నూ 'ఛీ! యిది గ్రామ్యం' అనేవారికన్న పదిరెట్లు ఎక్కువగా!

'అన్నాడు ధర్మరాజు' అన్న వాక్యం వుంటే 'అది గ్రామ్యంలే' అనటం. బాబూ! అది చాలా గ్రాంథికం! 'ఏకవాక్యంబునందొకానొక్కండు దక్క సర్వపదంబులు క్రమనిరపేక్షంబుగం బ్రయోగింపంజను' అన్నాడయ్యా చిన్నయ్య అంటే, దానికర్థం తెలియదు మళ్ళీ.

భాష ప్రవాహిని. మారుతూ వుంటుంది. కనుక మారే భాషని పట్టుకోటానికి వీలులేదు అని భాషావాదుల తర్కం. దీనికొక పండితులు చక్కని అభ్యంతరం చెప్పారు. ఏమని అంటే, అవును. మారటం స్వభావం. ప్రకృతిలో ఆ దోషం వున్నది. ఆ దోషం తీసివేసేందుకే మేము దాన్ని యిట్లా వుండాలని

నియచ్ఛించాము, దాన్ని సూత్రబద్ధంగా చేశాము అని. ఇది బాగుంది. కాని సూత్రబద్ధం చేయకముదుపు ఆ భాష యొక్క పరిణామానికి, దాని వైశాల్యానికి ఎడమిచ్చి చెయ్యాలా? వద్దా? కుర్రవాణ్ణి అల్లరిచిల్లరగా తిరగనీవద్దు. అయిదయింతరువాత, వాడు ఆడుకోవద్దూ! ఇంట్లో అదేపనిగా కూర్చుంటే గుద్దులెత్తి బోదకాళ్ళు వస్తవి. మనభాషకిదివరకే బోదకాళ్ళు వచ్చినై. కొంచెం కాలు సాగనివ్వాలి.



నిజమైన మాటకి పద్యమూ, గద్యమూ రెండే మార్గాలు. మూడవది పాట. పాట ఏ భాషలోనైనా వుండవచ్చు.



కొందరన్నారు! మార్పు మార్పు అంటావు. మారుపే ప్రధానమా? ఇంకేం కారణాలు అక్కరలేదా? మార్పు కోసమే మార్పా? అని. మార్పు కోసమే మార్పు కాదు. వాడుకభాషలో చెప్పే కొన్ని భావాలు సరిగ్గా తెలియచెయ్యటానికి గ్రాంథికభాషకి సామర్థ్యం చాలదు అని. పూర్వం నన్నయ్యగారు నిబంధించిన నిబంధన చాలకనే భాష యింతగా మారిపోయిందని. కనుక ఆ సామర్థ్యం ఎంతవరకు వుందో, అంతవరకూ వదలిపెట్టవలె నని. అప్పుడు దానికి సూత్రాలు నిర్మించు. ఏ సూత్రాలు దాట డెవ్వడూను.

అట్లా అయితే వాడుకభాషకే సామర్థ్యం చాలదు. వాడుకభాష వాడుకలో వున్న భావాలని మాత్రమే చెపుతుంది. గ్రాంథికభాషలో మనకు వాడుకలో లేని భావాలు చెప్పవలసి వస్తుంది. పైగా గ్రాంథికభాషకి అటువంటి భావాలతోనే యెక్కువ పని వుంటుంది అని అన్నారు. అవును ఆ భాషాసామర్థ్యం ఆ భాషది. ఈ భాషా సామర్థ్యం ఈ భాషది. రెండునూ కావలయుననే నా ఊహ.

నిజమైన మాటకి పద్యమూ, గద్యమూ రెండే మార్గాలు. మూడవది పాట. పాట ఏ భాషలోనైనా వుండవచ్చు. పద్యం గ్రాంథికభాషలో వుండాలి. గద్యం వాడుకభాషలో వుండాలి. పద్యం ఎందుకు గ్రాంథికభాషలో వుండాలి అంటే, ఛందోబద్ధమైన భాషకు పద్యమూ, పద్యానికి ఛందోబద్ధమైన భాషా సరిపోయినవి. ఇదివరకు మనవాళ్ళు సృష్టించి యేర్పరచిన వృత్తభేదాలు గ్రాంథిక భాషాస్వరూపానికి తగిపోతవి. వాడుకభాషలోనే పద్యాలు వ్రాయాలి అంటే, ఆ వృత్తాలు మారాలి. కాదు. ఈ వృత్తాలే ఆ వాడుకభాషలో వ్రాస్తాము

అంటే ఆ వృత్తాలకి ఆ భాష తిరిగిపోయింది. మళ్ళీ అంత ప్రయత్నం చేసిన కవులు ఆ వృత్తాల్లో యీ భాషని వంచితేగాని అంత సాఫీ తిరగదు. అది కాలగర్భంలో వున్న పని.

వచనంలో వాడుకభావాలు చెప్పటానికి వాడుకభాష కుదిరినట్లుగా గ్రాంథిక భాష కుదరదు. వాడుకలో లేని భావాలకు గ్రాంథికభాష కుదరవచ్చు. మిక్కిలి వాడుకలో వుండే భావాలు ఆ భాషలో చెప్పటం పరమ అసహ్యం.



**వస్తోంది, వెళుతోంది ఇటువంటి మాటలు వికారంగా వున్నవనీ అవి కుంటినడక వ్యత్యస్తపు మాటలనీ అంటారు.**



వాడుకభాష వ్రాస్తే కొందరు మా కర్థం కావటం లేదు చదవటం యెట్లాగో తెలియటం లేదు అంటారు. వారు మాట్లాడటంలో వున్న ఒడుపు తెలియక అట్లా అనటం. ఆ ఒడుపే భారతం నిండా వున్నది. వారు భారతం చదివి కూడా అట్లాగే అంటారు.

కొందరు 'దుయ్యబట్టడం' మొదలయినవి ప్రాంతీయాలు, అవి వాడితే యెట్లాగబ్బా అంటారు. ప్రాంతీయాలు గ్రాంథిక భాషలో కొల్లలుగా వాడతారుగా మరి. ప్రాంతీయ శబ్దాలు అని తోసివేయటం గ్రాంథికభాష చేయదు. ఆ విషయంలో గ్రాంథికభాష భాషావైశాల్యం పరిగణించిందన్నమాట. అట్లా తప్పు పట్టుకుంటే వాడుకభాష తన వైశాల్యం సంకుచితపరచుకుంటోంది అని అర్థం. ప్రాంతీయశబ్దాలు భాషాదేవి విస్తారమైన తనువు. అవి తీసేస్తే ఆవిడ గుజ్జు అయిపోతుంది. కావలిస్తే ప్రాంతీయ శబ్దాల పట్టికలు ఇవ్వవచ్చును.

వస్తోంది, వెళుతోంది ఇటువంటి మాటలు వికారంగా వున్నవనీ అవి కుంటినడక వ్యత్యస్తపు మాటలనీ అంటారు. 'వస్తోంది' అన్నమాట 'వస్తున్నది' అని ఉండాలని వారి ఊహ. వాడుకభాషకు కూడా కొన్ని నిబంధనలేర్పరచి, దాన్ని సంస్కరిద్దామని వారి ఉద్దేశం.

ఇదివరకు నన్నయాదుల సంస్కారం వీరు ఒప్పుకోలేదు. ఎందుకనీ, దానికి సామర్థ్యం లేదని. అది వికృతంగా వున్నదనీ. మరి తాము చేయబోయే సంస్కారానికి ఆ దశ పట్టదూ, కొంతవరకే నాయెను.

కొందరు కవులకు అదొక మోస్తరు ఒత్తు అక్షరాలు రాకుండా నీళ్ళవలె సాఫీగా నడుస్తున్న కవిత్వమే కవిత్వమనిపించినట్లు, కొందరికి అందరికీ అర్థమవుతున్న శబ్దాలే యేరి అదొక మోస్తరు సాఫీగా వుండాలని వాడుకభాష.

ఎవడు వాడే భాష వాడు వ్రాస్తాడు. నేను మా 'నందమూరు'లో చిన్నతనంలో నాకు వచ్చిన భాష, నేను చదువుకోగా నాకు వచ్చిన భాషా రెండూ నాలోకలిసి యే పరిణామం పొంది నా నోటివెంట వస్తుందో అది మాట్లాడతాను. అదే వ్రాస్తాను.

**అనేక మారుమూల శబ్దాల్లో క్రొత్తకొత్త రకంగా కూర్చని సమాసాలల్లో తెనాలి రామలింగ కవికి సౌందర్యం కనపడ్డది.**

ఎవరు ఎట్లా వ్రాసినా, ఎట్లా మాట్లాడినా వారి వ్రాతకి వారి మాటకి భిన్నత్వం వుంటుంది. ఆ వ్రాసేవారూ ఆ మాట్లాడేవారూ వ్యక్తిత్వం కలవారైతే అదీ కనపడుతూ వుంటుంది. తను వ్రాస్తోంటో తన ఆత్మ అందులో కనపడుతూ వుంటుంది. ఆ ఆత్మనిబట్టి అతను వాడేశబ్దాలూ వుంటవి. మనకు నచ్చితే అందం. కాకపోతే బాగులేదు అంటాం. ఒకడికి పుల్లకూర ఇష్టమైతే ఒకడికి ఇగురుకూర ఇష్టం. ఇది నా చెవికి మహా అసహ్యంగా వినబడుతోంది అంటే, నా చెవికి చాలా శ్రావ్యంగా వున్నది.

అనేక మారుమూల శబ్దాల్లో క్రొత్తకొత్త రకంగా కూర్చని సమాసాలల్లో తెనాలి రామలింగ కవికి సౌందర్యం కనపడ్డది. అతని ఆత్మలోంచి ఆ కవిత్వం వచ్చింది. అటువంటి మార్గంపోయిన కవి లేడు భాషలో మళ్ళీ. అతన్ని కాదంటానికి మనకు వాక్కు చాలదు.

ఒక కవి అన్నాడు 'నా ఆత్మ యిదిరమ్యం అని నిర్ణయించిన దానికి నువ్వెవరు కాదనేందుకు' అని. ఒకొక్కని స్వభావం వేరయినకొద్దీ అతని శబ్దసముదాయం అని చెప్పే రీతీ భేదిస్తూ వుంటుంది. అతని స్వభావం వల్ల ఆ శబ్దానికి కొత్త వంపు తిరుగుతవి. ఇతరులకు అంతా అది కొత్తగా వుంటుంది. అతని విధానం తెలుసుకోవాలీ అంటే, ఆ అతని మాటలవంపు నాని స్వభావం వల్ల ఆ మాటలకు వచ్చే మార్పూ ఓపికతో తెలుసుకుంటేనేకానీ తెలియదు. అది

అందరికీ తెలిసేటట్టుగా వుండాలి కానీ అందరూ అతన్ని తెలుసుకునేందుకు ప్రయత్నిస్తారా అని అంటే ? అందరూ అతన్ని తెలుసుకునేందుకే ప్రయత్నించాలి.

కవి, వ్రాయసకారుడు ప్రభువు వంటివాడు. వాడి భాష మనకు చదువుకోవాలి. ఆసేతు శీతాచలం ఇంగ్లీషు చదవటంలే! ఎందుకు ? దొర వాడూ! కాని వాడి భావం మనకు తెలిసేటందుకు వాడూ ప్రయత్నం చేస్తాడు.

గమ్యతావిషయమే చెవివల్ల నిర్ణయించాలి అంటే దానికి చివర దొరకదు. 'సహృదయ' శబ్దానికి లక్ష్యం నిర్ణయించాలిసినట్లు. నీ చెవికి అందం తెలియదూ అంటే నీ చెవికి తెలియదు. చివరకు పదిమంది అన్నమాటకు పైచేయి యిస్తే అది ఒక బోర్డులో వున్న మెంబర్లచేత చేతులెత్తించినట్లే. భాషకి కూడా ప్రజాస్వామ్య పద్ధతి సూత్రాలు పట్టించి పాడుచెయ్యటం అవుతుంది.

మారుమూల శబ్దాలు అని యింకో తగాదా. ఇది యింగ్లీషులోంచి 'అబ్సోలీటు' మాటలు అన్నదానిలోంచి తెచ్చుకున్న కొత్త విషయం. ఒక పండితులు అన్నారు గదా ఒక కవి తానొక శబ్దము వాడుకలో నుండగా విననంతసేపు అది ప్రాతశబ్దమనీ; వాడుకలో వినటంతోనే క్రొత్త నవనవలాడు శబ్దమవుతుందనీ అన్నారు. ఆ వాడకం ఒక్కడు వాడినా అవుతుంది. అయితే ఒక చక్కని వాడుకలో ఉన్న మాట కాలకర్మదోషం చేత తను వినకపోతే అంతచక్కని మాట తన భాషలోనుంచి ప్రాతమాట అని మినహాయించుకోటమేనా! అందుకనే శబ్దానికి వాడుతున్నారా! లేదా! అని కాదు. అది సుందరమైనదవునా కాదా అని. ఈ బహుధా నిచారాలన్నీ కట్టిపెడితే – ఏ కవికి, ఏ వ్రాతగాడికి, ఎప్పుడు ఏది రమ్యంగా వుందని తోస్తే అది వ్రాస్తాడు. అది రమ్యం కాదూ అని తోస్తే కాలం తోసేస్తుంది. ఒకప్పుడు రమ్యమైనదాన్ని రమ్యంగా లేదని కాలం అనుకుని వదిలివేస్తే అదే మళ్ళీ కొన్నాళ్ళకు దాన్ని పునరుద్ధరిస్తుంది. అటు జరగదూ! ఈ అనంతకాలంలో, అనంతభాషల్లో, అనంతమార్గాల్లో, కొన్ని మంచివి పోకా, కొన్ని చెడ్డవే నిలవకా, ఎట్లా వుంటుందో యెవ్వరు చెపుతారు!

*గమనిక: జయంతి సంపుటి 1, సంచిక 2 నుండి తీసుకున్న వ్యాసం.*





పాత కథ

# తీవ్రవాద నాయకుడు

కీ. శే. శ్రీ బాలగంగాధర తిలక్

శేషయ్య మున్సిపాలిటీవాళ్ళ రోడ్లన్నీ తిరుగుతూంటాడని చెప్పడానికి అతని పైజామాలు నిదర్శనం.

ఆ రోడ్ల మీద దుమ్ము మాంచి ఒత్తుగా వుండి, అడుగు పెట్టగానే ఝామ్మని రేగిపోవడం మున్సిపాలిటీవారి బుద్ధికుశలతకి నిదర్శనమైనట్టు.

శేషయ్య ఇలా తిరగడంవల్లనే రోడ్లరిగిపోయి, దుమ్ము లేస్తోందని ఒక కౌన్సిలర్ విమర్శకులకి చెప్పిన జవాబు.

పాపం శేషయ్యకి తిరగడమే పని. ఆకలేసినప్పుడల్లా శేషయ్య తిరుగుతూంటాడు. అదేమిటోకాని, రోజూ శేషయ్యకి ఆకలేస్తుంది.

ఎప్పుడూ కడుపునిండా తినడానికి వీలు దొరకదు కాబట్టి ఎప్పుడూ ఆకలేస్తూనే ఉంటుంది. అందుకే ఎప్పుడూ తిరుగుతూంటాడు.

ఆ వూళ్ళో ఉపాధ్యాయులు భూపరిభ్రమణాన్ని శేషయ్యతో పోల్చిచెప్పడం వలన విద్యార్థులకి చటుక్కున అర్థమైపోతోందని ప్రతీతి.



ఇటు శ్రమిక లోకానికీ, అటు ఉద్యోగానికీ సంపాదనకీ నోచుకోని, స్థిరత్వం లేని, ఏమీ చెయ్యలేని, ఎందుకూ పనికిరాని శేషయ్య లాంటి నిరర్థకపుశాల్తీ ఒకటి చిన్నరకం మధ్యతరగతి కుటుంబాలలో బయల్పడుతుంది.

శేషయ్య స్కూలు ఫైనల్ వరకూ చదువుకున్నవాడేనని వదంతి కూడా వుంది. మధ్య

మధ్య ఇంగ్లీషు మాటల్నీ ఉద్యోగపర్వంలో తిక్కన పద్యాల్నీ గబగబా అనేస్తాడనీ, ఒక్కొక్కసారి నిశితంగా తెలివితేటల్ని ప్రదర్శిస్తాడనీ కొందరు చెప్పుకుంటూ ఉంటారు.




అయితే అతనెందుకు వృధాగా ఏ సంపాదనా, ఏ పనీ లేకుండా ఉండిపోయాడు? ఈ ప్రశ్నకి దేశంలోని నిరుద్యోగం మీదా మనస్తత్వాల మీద కొందరు నిపుణుల్ని కమిటీ కింద వేసి, పరిశీలన చేయిస్తే తప్ప సమాధానం దొరకదు.

శేషయ్యకి ఓ విధవ అక్కగారూ, తల్లీ ఉండేవారు. ఇతని సంపాదనా చాతుర్యానికి తట్టుకోలేక తల్లి పరలోకానికి చప్పుడు చెయ్యకుండా వెళ్ళిపోయింది. అంతకన్నా గప్ చిప్ గా అక్కగారు ఒకనాటి రాత్రికి రాత్రి ఎవడితోనో లేచిపోయింది.

ఆరోజున శేషయ్యగారు విచారంగా ఉన్నాడు. అక్కగారు చేసిన అప్రతిష్ట పనికి కాదు – తను కూడా ఆడదైవుంటే ఎవడేనా లేవదీసుకుపోను కదా అని.

ఇప్పుడు శేషయ్య లోఫర్.

ఇదివరకు ఎరిగున్నవాళ్ళూ, పాత స్నేహితులూ, దయాహృదయులూ ఎప్పుడేనా ఏదేనా ఇస్తే తీసుకుంటాడు, తింటాడు, నిద్రపోతాడు. పని లేనిదే తిరుగుతూంటాడు, అర్థం లేకుండా.

అదే కాదు, అతను మంచివాడు కూడా. దొంగతనం చెయ్యడు, తన కివ్వలేదని ఒకణ్ణి నిందించడు, మోసం చెయ్యడు, దబాయించడు. ఆ రోడ్ల మీద అలాగ తిరగనిస్తోన్నందుకు అందరికీ కృతజ్ఞత తెలుపుతూన్నట్టు ఉంటాయి అతని కళ్ళు.

ఇటువంటి పరమ దరిద్రుడి యొక్క అవసరం ఎవరికీ ఉంటుందని మనం కలలో కూడా అనుకోం. అయితే తిరుపతికి మాత్రం ఇతనిలోని గర్భిత శక్తిని – Potential కనిపెట్టే గౌరవం దక్కింది.

ఆ వూళ్ళో వున్న తీవ్రవాద సంస్థ కార్యదర్శి తిరపతి. సమ్మెలూ, నిరసన ప్రదర్శనలూ, ఎర్రజెండాలూ, నల్లజెండాలూ, కొట్లాటలూ, నినాదాలూ ఇవన్నీ తిరపతి కార్యదీక్షా ఫలితాలు. అతడు అశాంతిని రేపుతాడు. మంచులోంచి మంట పుట్టించగలిగిన తీవ్రవాది.

**తిరపతి ఉపన్యాసం గంటన్నరసేపూ విన్నాక, శేషయ్య తల గోక్కుంటూ తాపీగా సర్లెండి. మా మాధవుణ్ణి కలుసుకుని వాడు కూడా మంచిదే అంటే చేరుతానండి.**

ఆకలితో ఉన్నవాడు, ఆస్తిపాస్తులు లేనివాడు, నిరాశ అంచులమీద నడుస్తున్నవాడు – ఈవేళో రేపో కాస్త ట్రెయినింగుతో బ్రహ్మాండమైన తీవ్రవాదిగా సోషలిస్టో, కమ్యూనిస్టో, బోల్షివిస్టో – ఏదో ఒకటి అయిపోయే సావకాశం వుందని తిరపతి దృఢాభిప్రాయం. అందుకే శేషయ్యతో స్నేహం చేశాడు. రోజూ అతనికి ఎన్నో చెప్పేవాడు. ప్రపంచంలో రెండే వర్గాలున్నాయన్నాడు. ఈ రెండింటికీ, పాముకీ, ముంగిసకీ ఉన్న ఆజన్మవైరం లాంటిది ఉంది అన్నాడు.

చారిత్రకంగా ఆధారాలు చూపించాడు. రష్యా – చైనా దేశాలలో ప్రజావిప్లవాన్ని చిత్రించాడు. చివరికి తన భావబీజాలు అతనిలో అంకురస్థితికి వచ్చాయన్న సమయాన, 'మా సంస్థలో – పార్టీలో చేరు శేషయ్యా. నీ హక్కుల కోసం, నీ వేలాది సోదరుల కోసం నడుం కట్టి అగ్రగామివై నడు, నడిపించు' అని ఆవేశంగా హెచ్చరించాడు.

తిరపతి ఉపన్యాసం గంటన్నరసేపూ విన్నాక, శేషయ్య తల గోక్కుంటూ తాపీగా 'సర్లెండి. మా మాధవుణ్ణి కలుసుకుని వాడు కూడా మంచిదే అంటే చేరుతానండి. ఏదో మీరింతగా అడుగుతూంటే...' అంటూ నసిగాడు.

తిరపతి నివ్వెరపోయాడు. ఒక రాజకీయమైన ఆదర్శం కోసం, దేశం కోసం ఇంతగా తను చెపితే, ఇదేదో మొహమాటం అభినయించే శేషయ్యని చూడగానే తిరపతి జన్మకంతటికీ సరిపోయేటంత నిస్పృహ కలిగింది. అందులోనూ శేషయ్య చెప్పిన మాధవుడు ధనవంతుడు. ఆ వూళ్ళోకల్లా ధనవంతుడు. తిరపతి లేచి, శేషయ్య మొహం మీద మొహం పెట్టి గట్టిగా కంఠనాళాలు ఉబ్బేటట్టుగా 'రియేక్షనరీ – పెటీ బూర్జువా' అని అరచి గబగబా

వెళ్ళిపోయాడు. ఆ మాటలలోని అర్ధమూ, నిందా ఏవిటో తెలియకపోయినా తిరపతికి ఎందుకు కోపం వచ్చిందా అని ఆలోచించుకుంటూ ఇంకా తల గోక్కుంటూనే రోడ్డు పట్టాడు శేషయ్య.

మాధవుడి తండ్రికి ఇన్కమ్ టాక్సువాళ్ళ లెక్కల ప్రకారం సాలుకి యాభైవేల రూపాయలు తక్కువ కాకుండా ఆదాయం. ఇదికాక, పన్నులకీ, ప్రభుత్వపు కన్నులకీ దొరకని ఆదాయం ఎవరికి తోచిన రీతిని వాళ్ళు అంచనా వేస్తూంటారు. ఇంత శ్రీమంతుడైన మాధవుడూ, శేషయ్యా స్నేహితులవడానికి కారణం వీళ్ళిద్దరూ ఆ వూరి స్కూల్లో ఫేలతూ, ప్యాసవుతూ ఏడెన్మిదేళ్ళు కలసి చదువుకోవడమూ – కలసి వేరుసెనక్కాయలూ, బటానీలూ కొనుక్కు తినడమూ లాంటి సంఘటనలు. ఇప్పుడిద్దరికీ పాతిక సంవత్సరాల వయస్సు దాటినా, వారి మధ్య అంతరం బాల్యంలోకన్నా ఎక్కువైనా, ఎప్పుడో కాని రోడ్డు మీద తప్ప, కలుసుకోకపోయినా, శేషయ్యకి మాధవుడంటే అభిమానమూ, నమ్మకమూ కూడా.

> మా నాన్న డబ్బులివ్వడురా. కొట్లల్లో, కాఫీ హోటళ్ళలో అప్పులు రెండు వేలు. ఫ్రెండ్సుకి అయిదారు వందలు ఇవ్వాలి.

కారు ఆపుచేసి, మాధవుడు పిలుస్తాడు. శేషయ్య ఓ నిముషం ఆకల్నీ, బాధల్నీ మరచిపోయి, నవ్వుతూ దగ్గరగా వెళతాడు.

'ఏరా శేషూ ! బాగున్నావా' అంటాడు మాధవుడు.

'ఆఁ రోడ్లమీద యిలా చక్కర్లు కొట్టుతున్నాను'

'నీ పనే బాగుందిరా'

'అదేం?'

'మా నాన్న డబ్బులివ్వడురా. కొట్లల్లో, కాఫీ హోటళ్ళలో అప్పులు రెండు వేలు. ఫ్రెండ్సుకి అయిదారు వందలు ఇవ్వాలి. పెట్రోలు బంక్ కి ఆర్నెల్లనుంచి కానీ ఇవ్వలేదు. ఛీ ఛీ ఆత్మహత్య చేసుకోవాలనిపిస్తోందిరా'

శేషయ్య అటువంటి సమయంలో మిత్రుడి మీద నిజంగా జాలిపడేవాడు. 'మీ నాన్నకింత కరుకుతనం పనికిరాదు' అనేవాడు.

'మా నాన్న! రాక్షసుడు. విలన్. రావణాసురుడు. హిరణ్యకశిపుడు' అంటూ తిడుతూ కారు స్టార్టు చేసి వెళ్ళిపోయేవాడు మాధవుడు.

.....నాలుగైదు నెలల అనంతరం శిథిల గృహావశేషమైన ఒక గదివంటిదాంట్లో నిదిరిస్తూన్న శేషయ్యకి తననెవరో పిలుస్తూన్నట్టనిపించి, కళ్ళు నులుముకుని బయటికి వచ్చాడు. మాధవుడు కార్లోంచి అమాంతం దుమికి, శేషయ్యని కావలించుకుని, 'శుభవార్తరా శేషూ' అన్నాడు.

**మాధవుడు కార్లోంచి అమాంతం దుమికి, శేషయ్యని కావలించుకుని, శుభవార్తరా శేషూ అన్నాడు.**

శేషయ్య అర్థమైనట్టు నవ్వి, 'ఎప్పుడురా లగ్నం?' అని అడిగాడు.

'ఛ ఛ – పెళ్ళీ గిళ్ళీ కాదు. నా డియర్ ఫాదర్ చచ్చిపోయాడు. ఈ వేసవికి ఊటీ వెళ్ళాం కదూ. అక్కడ సడన్ గా, హాయిగా కళ్ళు మూశాడు. ఒరేయ్ శేషూ, రాయిలా అలా నిలబడ్డావేం రా? – కంగ్రాచ్యులేషన్సు చెప్పక' అన్నాడు మాధవుడు శేషయ్య భుజాల్ని కుదుపుతూ.

బెదురుగా 'కంగ్రాచ్యులేషన్సు' అన్నాడు శేషయ్య.

'ఇంక పెళ్ళి విషయం చూడు భాయ్. నాలాంటివాడికి పెళ్ళి ఆటంకమే కాని, సుఖం లేదు. నలుగురమ్మాయిలకి ప్రామిస్ యిచ్చి, వేర్వేరుగా లొంగదీసుకున్నాను – పెళ్ళని తెలిస్తే నలుగురూ వచ్చి ఇంటిముందు సత్యాగ్రహం చేస్తారు. వాళ్ళనెలా వదలించుకోవడమా అని బ్రహ్మాండమైన మానసిక పరిశ్రమ చేస్తున్నాను' అని ఓసారి ఆగి, మాధవుడు మళ్ళీ యిలా అన్నాడు.

'ఈ శుభ సమయంలో ఆ బాల్యమిత్రుడివైన నీకు ఎన్నడూ మరచిపోలేని ఒక బహూకృతి – ఒక అనుభవరూపంలో ఇవ్వదలిచాను. రా నాతో కారు ఎక్కు.'

శేషయ్య తన మాసిన గడ్డాన్నీ, పైజామాల్నీ చూసుకుని సందేహిస్తూ, 'ఎందుకూ, ఎక్కడికీ?' అన్నాడు.

'నీకు అవన్నీ అనవసరం. నేను చెప్పినటలు చెయ్యి' ఆజ్ఞాపించాడు మాధవుడు.

శేషయ్య ఏనాడూ మాధవుణ్ణి కాదనలేదు.

కారు సెలూన్ దగ్గరా, రెడీమేడ్ షాపు దగ్గర ఆగి, బయలుదేరేసరికి శేషయ్య రూపం సర్వాంగసుందరంగా అభినవంగా సూట్, బూట్, హేట్ తో దర్శనీయంగా తయారయింది. ఈసారి కారు ఓ పెద్ద హోటల్ ముందు ఆగింది.



**మంచం మీద వాలగానే డన్లోపిల్లో మెత్తని వూపుకి తన్నొక దేవకన్య మెత్తగా మత్తుగా కౌగలించుకుంటూన్నట్టు అనుమానపడి, ఫక్కున నవ్వేశాడు.**



'ఇదిగో శేషూ. రెండవ అంతస్తులో నీకోసం ఎయిర్ కండీషన్డ్ గది ఒకటి తీసుకున్నాను. ఈ మూడు వందలూ నీ దగ్గర ఉంచుకో. నాల్గవరోజు నాటికి నీ దగ్గర పైసా కూడా ఉండకూడదు. ఈ హోటలులో నీకు సర్వసౌఖ్యాల్నీ, భోగాల్నీ ఎప్పుడు కోరినా పళ్ళెంలో పెట్టి అందిస్తారు. హాయిగా, కులాసాగా అనుభవించు' అంటూ మాధవుడు మూడువందల రూపాయల నోట్లు శేషయ్య కోటు జేబులో పెట్టి విష్ చేసి వెళ్ళిపోయాడు.

తెల్లబోయి నుంచున్న శేషయ్యని ఇద్దరు హోటల్ జవాన్లు గౌరవంగా, భక్తి శ్రద్ధలతో నడిపించుకువెళ్ళి లిఫ్ట్ ఎక్కించి రెండవ అంతస్తులో ఒక పెద్ద గదిలో దిగవిడిచారు.

చలువరాయి చప్టాలో, చల్లదనం ఇచ్చే రంగులతో నిగనిగ మెరిసే సామగ్రితో టెలిఫోన్, రేడియోగ్రాములతో వేడి, చల్లని కుళాయిలతో, కిటికీలకి సిల్కు తెరలతో పువ్వుల కుండీలతో ఎవరో సౌఖ్యం అనే భావాన్ని భౌతికంగా తర్జుమా చేసి, నాలుగు గోడలమధ్యా బంధించినట్టనిపించింది శేషయ్యకి.

మంచం మీద వాలగానే డన్లోపిల్లో మెత్తని వూపుకి తన్నొక దేవకన్య మెత్తగా మత్తుగా కౌగలించుకుంటూన్నట్టు అనుమానపడి, ఫక్కున నవ్వేశాడు.

'రోజుకీ గదికి అద్దె ఎంత?' అని అడిగాడు శేషయ్య.

'నలభై రూపాయలు' అన్నాడు బోయ్.

ఉలిక్కిపడి 'నాకు తాగేందు కేదేనా కావాలి. మాంచి మాంచి...' అని పేర్లు

తెలియక తికమకపడ్డాడు శేషయ్య.

రకరకాల పానీయా లతని ముందుకు వచ్చిపడ్డాయి.

'నాకు తినేందు కేదేనా కావాలి' అన్నాడు శేషయ్య.

నానావిధ భక్ష్యాలూ అతని ఎదుట సాక్షాత్కారించాయి.

'అబ్బ, వొళ్ళు నొప్పులుగా వుంది. నిద్ర వస్తోంది' అనుకున్నాడు శేషయ్య తనలో తను.

సాయంత్రం టాక్సీలో పార్కుకీ, ఊరు శివారుకీ థియేటర్ కీ వెళ్ళాడు. ఎక్కడా అతనికి అమితమైన గౌరవం.

ఒక ఓఢ్ర మంగలి వళ్ళు పట్టగా, రేడియో నుండి చక్కని పాట వింటూ కలలు కంటూ నిద్రపోయాడు శేషయ్య.

సాయంత్రం టాక్సీలో పార్కుకీ, ఊరు శివారుకీ థియేటర్ కీ వెళ్ళాడు. ఎక్కడా అతనికి అమితమైన గౌరవం. ఒకచోట జనం గుంపులుగా చేరి, గారడీ ప్రదర్శనాన్ని చూస్తున్నారు. అటువంటి వీధి ప్రదర్శనాలు చూడడం బాగా అలవాటయిన శేషయ్య కారాపి, అక్కడ దిగాడు. ఎవరో అడిగారు.

'అయ్యా తమ రెవరు. ఎక్కడ ఉంటున్నారు?'

'దేవేంద్రా హోటల్, రూమ్ నెంబరు 18' అన్నాడు శేషయ్య.

అంతే. జనం పాయలుగా విచ్చిపోయారు. జనం పీతల్లా ముడుచుకుపోయారు. కొందరు 'సలాం' అన్నారు. కొందరు నమస్కరించారు. పక్కనున్న టీ దుకాణంవాడు గబగబా ఓ కుర్చీ తీసుకువచ్చి వేశాడు. శేషయ్యకి వెర్రి ఆనందమూ, గర్వమూ కలిగాయి.

రాత్రి వెన్నెలలో Roof – garden లో భోంచేశాడు. సగం సగం బట్టల్ని ధరించి, ఉద్రేకపరిచే నాట్యాన్ని చూస్తూ బీరునీ వైన్ నీ తాగాడు. తూలుతూ గదిలోకి వచ్చాడు. కాలింగ్ బెల్ నొక్కాడు.

'చిత్తం' అన్నాడు నౌకరు వచ్చి.

'కావాలి' అన్నాడు శేషయ్య.

'ఏవిటి సార్'

'ఎవరు సార్'

'పిల్లలు'

కాసేపట్లో కృత్రిమమైన నవ్వుల్ని కురిపిస్తూన్న ఒక తైనాతీ వచ్చాడు. ఆల్బమ్ ఒకటి తీసి, చూపించాడు. ఆశగా, ఆబగా అన్ని బొమ్మలూ చూసి ఒక బొమ్మ మీద వేలు పెట్టి 'యిది' అన్నాడు శేషయ్య.

'యాభై రూపాయలు' అన్నాడు తైనాతీ.

'ఆల్ రైట్' అన్నాడు శేషయ్య.



ఎవరో ఒక పెద్ద నిచ్చెన వేసి, ఎత్తుకి మరీ ఎత్తుకి ఎక్కించేసి, ఉన్నట్టుండి దభాల్న కిందకి తోసేసినట్టయింది శేషయ్యకి.



అందానికీ అలంకారానికీ, కృత్రిమత్వానికీ ఆడదానికీ, పశుత్వానికీ ప్రేమకీ మధ్య గల వ్యత్యాసం తెలియని శేషయ్య ఒక అపరిచిత వ్యభిచారిణి కౌగిలిలో సొమ్మసిల్లి నిద్రపోయాడు. మూడురోజులూ ఎన్నడూ ఎరుగని ఆనందాన్నీ తృప్తినీ గర్వాన్నీ అత్యున్నత స్థాయిలో పొందిన శేషయ్యకి తల తిరిగిపోయింది. వివేకం తప్పిపోయింది. అధికారమూ, సౌఖ్యమూ తన జన్మహక్కు అనుకున్నాడు – తనే సౌఖ్యమూ, అధికారమూ అంటే అనుకున్నాడు.

మూడవరోజు రాత్రి పండ్రెండు గంటలకి మూడవ బొమ్మ శేషయ్య గది విడిచి వెళ్ళిపోయింది. నిద్రమత్తులో ఉన్న శేషయ్యకి తెల్లవారగానే తాను గది ఖాళీ చేసి తన పాత తాటాకు ఇంటికి వెళ్ళిపోవాలన్న జ్ఞానం చటుక్కున తేలుకాటు లాగ చుర్రుమంది.

ఎవరో ఒక పెద్ద నిచ్చెన వేసి, ఎత్తుకి మరీ ఎత్తుకి ఎక్కించేసి, ఉన్నట్టుండి దభాల్న కిందకి తోసేసినట్టయింది శేషయ్యకి. అతని బుర్ర తీవ్రంగా పనిచెయ్యడం మొదలుపెట్టింది. భయమూ, బాధా, నిర్వేదమూ కలిగాయి. పళ్ళు బిగించాడు. తల పట్టుకున్నాడు. ఎయిర్ కండిషన్డు గదిలో కూడా అతనికి చెమటలు పట్టాయి. తెల్లారేవరకూ ఆలోచిస్తూ, గది అంతా కలయదొక్కాడు.

ఏడు గంటలకి – ఉదయం – హోటలు విడిచి రోడ్డు మీద అడుగుపెట్టాడు. మాధవుడు నవ్వుతూ ఎదురొచ్చాడు. 'ఏరా, ఎలాగ వుంది?' అన్నాడు.

కోపంగా మాధవుణ్ణి ఆపాదమస్తకం పరీక్షించి 'హుం' అన్నాడు శేషయ్య.

‘ఏమిట్రా ఇదీ’ అన్నాడు మాధవుడు

‘చంపేస్తా’

‘ఎవర్ని’

‘నిన్ను’

‘ఆ...’ అంటూ ఒక్క అడుగు వెనక్కి వేశాడు మాధవుడు.

‘ప్రపంచంలో రెండే రెండు వర్గాలు. ధనికులూ, పేదలూ. వీరి మధ్య ఎప్పుడూ ఎడతెగని వైరం. జాగ్రత్త మాధవ్! ఇంతమంది దరిద్రుల్నీ నిస్సహాయుల్నీ నీచుల్నీ తయారు చేసిన నిన్నూ, నీలాంటివాళ్ళనీ క్షమించేది లేదు. నువ్వంటే నాకు వైరం. పీక దాకా ద్వేషం, అసహ్యం...’ అంటూ గబగబా వెళ్ళిపోయాడు శేషయ్య.

శేషయ్య తిన్నగా తీవ్రవాద సంస్థ కార్యాలయానికి వెళ్ళాడు. అక్కడ కుర్రవాణ్ణి జుట్టు పట్టుకుని ఊపుతూ ఏడీ తిరపతి ఎక్కడ అని గర్జించాడు.

మాధవుడు తెల్లబోయి నుంచున్నాడు. మాధవుణ్ణి చూసి, ప్రత్యుత్థానం చేసేందుకు వచ్చిన హోటల్ మేనేజరు శిలాసదృశుడైపోయాడు.

శేషయ్య తిన్నగా తీవ్రవాద సంస్థ కార్యాలయానికి వెళ్ళాడు. అక్కడ కుర్రవాణ్ణి జుట్టు పట్టుకుని ఊపుతూ ‘ఏడీ తిరపతి ఎక్కడ’ అని గర్జించాడు. కుర్రాడు భయపడి ఓ గది చూపించాడు. శేషయ్య విసురుగా వెళ్ళి, ‘తిరపతీ, నీ సంస్థలో చేరాను. నా పేరు రాసుకో’ అన్నాడు.

తిరపతి గుడ్లప్పగించి చూస్తున్నాడు.

శేషయ్య పిడికిలి బిగించి, గాలిలో వూపాడు. ‘ఈ ధనిక వర్గాన్ని నాశనం చెయ్యడమే నా జీవితాశయం. నల్లుల్లాగ నలిపి పారేస్తాను. విప్లవం నా ధ్యేయం. హింస నా సాధనం. ద్వేషం నా రక్తం’ అని అరిచాడు.

ఆలస్యం చేస్తే తననే చంపేస్తాడేమో అన్నంత తొందరలో గబుక్కున శేషయ్య పేరు రాసేసి సభ్యత్వపు రసీదు శేషయ్యకిచ్చాడు తిరపతి.

‘ఇప్పుడు నేనేం చెయ్యాలి’ – అడిగాడు శేషయ్య.

‘సాయంత్రం మీటింగ్. అక్కడికి రా’ అన్నాడు తిరపతి.

మీటింగులో శేషయ్య ఉపన్యాసం విన్నవాళ్ళు ఒళ్ళు జలదరించి, కంగారు పడిపోయారు. అతనేం చెప్పాడో సరిగా ఎవరికీ తెలియదుకాని, చూపులూ,

మంటలూ, శ్మశానాలూ, గద్దలూ, రక్తమూ మొదలైన భయంకరమైన మాటలు చాలా చాలా వినిపించి, చాలామంది చప్పట్లు కొట్టేశారు.

నాటి నుండీ ఎక్కడ చూసినా శేషయ్య. పోస్టర్లు అంటిస్తూ శేషయ్య, మీటింగులలో శేషయ్య, సమ్మెలలో శేషయ్య...

ఓసారి ఎవడో ఒక ధనవంతుడితో మాట్లాడినందుకు ఒక సభ్యుడిని సాచి లెంపకాయ కొట్టాడు శేషయ్య.

**శేషయ్యముందు తిరపతి నీరసించిపోయి, తక్కువరకపు సంస్కరణవాదిలా అందరికీ కనిపించాడు.**

ఇంకోసారి ఓ సినిమాతార బొమ్మని జేబులో దాచుకున్నందుకు ఒక యువకుణ్ణి వాళ్ళ సంస్థ కార్యాలయం గదిలో పై వాసానికి తాడు కట్టి రాత్రంతా వేలాడదీశాడు శేషయ్య.

శేషయ్య కఠినంగా అయిపోయాడు. నిరంతర ధనిక ద్వేషం ఒక మహావ్రతం కింద కానసాగిస్తున్నాడు. అందుకే మేడల్నీ మోటారు కార్లనీ ఫస్టు క్లాసు రైలు పెట్టెల్నీ కూడా చూడడు. గట్టిగా కళ్ళు మూసేసుకుంటాడు. అందమూ, ఆనందమూ, కళలూ – ఈ మూడూ తీరిక గల ధనవంతులకే కాబట్టి వాటి ప్రసక్తి కూడా రానివ్వడు. ఎప్పుడూ కొరకొరలాడుతూ నడుస్తూన్న కొరకంచులా ఉంటాడు.

శేషయ్యముందు తిరపతి నీరసించిపోయి, తక్కువరకపు సంస్కరణవాదిలా అందరికీ కనిపించాడు.

శేషయ్య చుట్టుపక్కల గ్రామాలన్నింటికీ ప్రధానుడైపోయాడు. కొన్నాళ్ళకి జిల్లా అంతటికీ ఏకైక తీవ్రవాద నాయకుడుగా గుర్తించబడ్డాడు.

శేషయ్య కళ్ళల్లో ద్వేషం స్పిరిట్ లా నీలంగా మండుతూంటుందనీ, యిప్పటికీ అతనికి రాత్రిళ్ళు కలల్లోకి 'హోటల్లో మూడు రోజులూ, మూడు బొమ్మలూ' వచ్చి ఉలిక్కిపడుతూంటాడనీ మాధవుడు అందరితోనూ అంటూంటాడుట!

*గమనిక: భారతి సంపుటి 40 సంచిక 4 1963 నుండి తీసుకున్న కథ.*

కథా పరిచయం



# సశేష సంపూర్ణ విహారం

డాక్టర్ టేకుమళ్ళ వెంకటప్పయ్య
9490400858

జార్ఖండ్ కు చెందిన రమేశ్ కుమార్ సుమన్ అటవీశాఖ అధికారిగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఇటీవలే అడుగుపెట్టారు. రాష్ట్రంలో అడవుల అభివృద్ధి, జీవ వైవిధ్య పార్కుల అభివృద్ధికి సంబంధించి, కేరళ రాష్ట్రంలోని కొచ్చిన్ లో కేంద్రప్రభుత్వం ఏర్పాటు చేసిన శిక్షణా కార్యక్రమానికి వెళ్ళి అక్కడే గుండెపోటుతో ఈ సం. జనవరి నెల 16 వతేదీ కన్నుమూశారు. ఆయన మరణానంతరం ఆయన మృతదేహాన్ని కొచ్చిన్ నుంచి మంగళగిరిలోని ఆయన అద్దె నివాసానికి తీసుకొచ్చేందుకు అధికారులు ఏర్పాట్లు చేశారు. అయితే, అద్దె స్థలంలోకి మృతదేహాన్ని అనుమతించేందుకు యజమాని నిరాకరించాడు. దీంతో మృతదేహాన్ని గుంటూరులోని అటవీశాఖ అతిథిగృహానికి తరలించి, అక్కడే అంత్యక్రియలు నిర్వహించారు. అంత పెద్ద అధికారే ఆవిధంగా దేహయాత్ర చాలించాల్సి వచ్చింది. అద్దె ఇళ్ళే కాదు, స్వంత అపార్ట్మెంట్లు ఉన్న వారు సైతం, ఇలా మృతదేహం తీసుకొని రావడానికి అపార్ట్‌మెంట్ అసోసియేషన్ల నుండి వ్యతిరేకత ఎదురవుతున్నది. స్వంత అపార్ట్మెంట్లో నివసిస్తున్నప్పటికీ, అసోసియేషన్ వారి దయా దాక్షిణ్యాలు లేకపోతే మృతదేహానికి అపార్ట్మెంట్లోకి అనుమతి ఉండదు. రోడ్డు ప్రమాదంలో తిరుచానూరు వాసి విజయవాడలో మరణించినప్పుడు 2016లోను, మదనపల్లెలో ఓ రైతు చనిపోయినా, యిలాంటి దృష్టాంతాలెన్నో మనం వార్తా పత్రికల్లో చదివి మానవత్వమా! నీవెక్కడ? అంటూ వాపోతున్నాం. తప్పు ఎవరిది? ఇంటి యజమానిదా? అద్దెకున్నవారిదా? స్వంత యిల్లు కాకుండా అపార్ట్మెంట్ కొనుక్కున్నవారిదా? అనవసరమైన అపోహలను జనంపై రుద్దినవారిదా? అనుమానాలను ఆచరణల పేరిట రుద్దిన సమాజానిదా? అర్ధం కాని స్థితి.

ఇంత ఉపోద్ఘాతం ఎందుకంటే, సరిగ్గా యిలాంటి నేపథ్యం ఉన్న

కథనంతో కథావిహారిగా పేరొందిన జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తి ముందుకొచ్చారు. కథ పేరు "సశేషం". దీని అర్థం ఇంకా ఉంది, కథ అయిపోలేదు అని అర్థం. ఈ కథ స్వాతి మాసపత్రికలో సెప్టంబరు 2024లో ప్రచురితమై, పాఠకలోకం చేత కంటతడి పెట్టించింది. ఈ కథను ఆసాంతం మనసుపెట్టి చదివితే మనిషి ఎంత అమానుష ప్రపంచంలో బ్రతుకుతున్నాడో విదితమౌతుంది.

**రెండు నెలల క్రితం ఇద్దరు మిత్రులూ ఒక పెళ్ళిలో కలిశాక, మళ్ళీ రాకపోకలు ప్రారంభ మవుతాయి.**

కథలో ప్రధాన పాత్రలు మురళి, మూర్తి, మూర్తి భార్య వసుమతి. మురళి, మూర్తి కలిసి చదువుకున్నవాళ్ళు. కొంతకాలం కలిసున్నా ఉద్యోగరీత్యా విడిపోయి మళ్ళీ కొంతకాలానికి కలుసుకుంటారు. మురళి కుటుంబ బాధ్యతల వలన వివాహం చేసుకోడు. తల్లీ దండ్రీ మౌలాలీలో చిన్న అపార్ట్మెంట్‌లో ఉండగా, తాను దిల్‌సుఖ్‌నగర్‌లో ఒంటరిగా హాస్టల్లో ఉంటూ ఉంటాడు. మూర్తి బ్యాంకులో పదవీ విరమణ తర్వాత, పార్శీగుట్ట దగ్గర అత్తగారిచ్చిన ఒక స్వంత ఇంట్లో మేడ ఇంట్లో కాపురం ఉంటున్నారు. రెండు నెలల క్రితం ఇద్దరు మిత్రులూ ఒక పెళ్ళిలో కలిశాక, మళ్ళీ రాకపోకలు ప్రారంభమవుతాయి. మూర్తి ఖాళీగా ఉండగా, మురళి మాత్రం పరోపకారం ఇదం శరీరం అన్నట్టుగా ఏవో పనులు చేస్తూ ఉంటాడు.

మురళి ఒక రోజు మూర్తి ఇంటికొచ్చి, రోజులు దారుణంగా తయారయాయని, దిల్‌సుఖ్‌నగర్‌లో తాను ఉంటున్న హాస్టల్ ప్రక్కన ఒక అపార్టుమెంటులో ఒకాయన రాత్రిపూట చనిపోతే, బంధువులు రావాలని చెప్పినా కూడా, ఆ అపార్ట్‌మెంట్ వాళ్ళు ఎంత బ్రతిమాలినా శవాన్ని లోపలికి అనుమతించలేదని, కేవలం రెండు మూడు గంటలు మాత్రమే అంత్య క్రియలు చేసుకోవడానికి పగలు సమయంలో మాత్రమే రానిస్తామని చెప్పడం వల్ల, మూర్తి పూనుకొని కష్టపడి ఒక కార్పొరేట్ హాస్పిటల్ వాళ్ళను ఒప్పించి ఒక రాత్రి అక్కడ ఉంచే ఏర్పాటు చేయిస్తాడు. తర్వాత శవాన్ని ఒక్కరోజు ఉదయం అపార్టుమెంటుకు తెచ్చి అంతిమ సంసంస్కారాలు చేశారని సమాజంలో ఇది చాలా అన్యాయమని వాపోతాడు. కొంతసేపటికి, ఈ సంఘటన వల్ల తాను ఒక

క్రొత్త ఉద్యమం చేపట్టానని, హైదరాబాదులో ఉన్న ప్రతి అపార్ట్‌మెంట్‌కూ వెళ్ళి ఆయా అసోషియేషన్ వాళ్ళతో మాట్లాడి, అత్యవసర పరిస్థితుల్లో శవాలు ఉంచడానికి ఒక "నిరీక్షణ గది" ఏర్పాటు చేయమని అభ్యర్థించాలని పూనుకున్నట్టు చెప్తాడు. మంచి ఆలోచన అని మూర్తి, వసు అనగా, ఉద్యమంలో భాగంగా తనతో రమ్మని అడగ్గా ఎలాగూ ఖాళీయే కదా అని మురళితో వెళ్తాడు. "నిరీక్షణ గది" ఏర్పాటు విషయమై కొందరు మొహమ్మీదనే వీల్లేదని చెప్పగా కొంతమంది చూస్తాం, చేస్తాం అంటారు. ఒక పెద్దాయన మాత్రం యిలాంటి గది నిర్మించాలంటే మీరు మొదట మునిసిపాలిటీ వాళ్ళను కలిసి అసలు అపార్ట్‌మెంట్‌లు కట్టేటప్పుడే ప్లాన్‌లోనే యిలాంటి నిరీక్షణ గది ఏర్పాటు చేయించమని సలహా ఇస్తాడు. ఇదంతా చాలా కష్టమైన వ్యవహారమని, వాళ్ళ చుట్టూ ఎవరు తిరుగుతారని అనుకుంటారు.



**మూర్తికి ఏం చెయ్యాలో పాలుపోక ఇంటికి ఫోన్ చేసి వసుమతికి చెప్పగా ఆమె భర్త ఉద్దేశం గ్రహించి మీ ఉద్దేశమే నా ఉద్దేశం. అంటుంది.**



ఒక పదిరోజుల అనంతరం ఒక రోజు సాయంత్రం మురళి నుండి మూర్తికి ఉన్నఫళంగా ఒక కార్పోరేట్ హాస్పిటల్‌కు వచ్చెయ్యమని ఫోన్ వస్తుంది. హడావుడిగా అక్కడికి వెళ్తే, అక్కడ మురళి తండ్రి చనిపోయి ఉంటాడు. ఆసుపత్రి వాళ్ళు శవాన్ని ఎక్కువసేపు ఉంచడానికి వీల్లేదని త్వరగా తీసుకొని వెళ్ళమని గొడవ చేస్తారు. ఓ వైపు అపార్ట్‌మెంట్ వాళ్ళు శవానికి అనుమతిలేదని చెప్తారు. శవాన్ని రాత్రికి అక్కడే ఉంచాలని మురళి హాస్పిటల్ వాళ్ళతో గొడవ పెట్టుకుంటుంటాడు. మార్చురీలకోసం వెదకగా ఎక్కడా ఖాళీలు లేవని చెప్తారు. మురళి తన చెల్లెలు చివరి చూపులకు తప్పనిసరిగా రావాలని చెప్తాడు. మూర్తికి ఏం చెయ్యాలో పాలుపోక ఇంటికి ఫోన్ చేసి వసుమతికి చెప్పగా ఆమె భర్త ఉద్దేశం గ్రహించి "మీ ఉద్దేశమే నా ఉద్దేశం. తీసుకు రండి" అంటుంది. వెంటనే శవాన్ని మూర్తి యింటికి తీసుకొని వెళ్ళి, ఒక్కరోజు చుట్టపక్కాలు అందరూ వచ్చాక దహన సంస్కారాలు జరిపి, భోజనాలు పెట్టగా తిని అందరూ వెళ్ళిపోతారు. మురళి ఏదో ఆలోచిస్తూ ఉండిపోతాడు. వాళ్ళ అమ్మ "పోయినాయన అదృష్టం. ఆ దేవుడే పంపినట్లు మీ ఆలుమగల్ని పంపాడు" అంటుంది.

సుమతి మురళిని ఉద్దేశించి "మీ నిరీక్షణ గృహ ఉద్యమం మీ తల్లిదండ్రులుంటున్న అపార్టుమెంట్ కాంప్లెక్స్ నుంచే మొదలెడితే బాగుండేదయ్యా! ఏ ప్రజా సేవైనా ముందు మన యింటితోనే ప్రారంభించడం మేలు కదూ! ఈ అవసరం నీకు స్ఫురించలేదు" అంటుంది. మురళి ఏమీ మాట్లాడడు. "నేనూ తలతిప్పి మురళి వైపు చూశాను. సశేషంగా ఉన్న తన ఉద్యమం గురించి ఆలోచిస్తున్నట్టు మా ఇద్దర్నీ చూస్తూనే ఉన్నాడు మురళి" అనే వాక్యంతో కథ ముగిస్తాడు విహారి.

అద్దె ఇంట్లో ఉన్నా అపార్ట్‌మెంటులో ఉన్నా ఒక మనిషి చనిపోతే వచ్చే ఇబ్బందులు అన్నీ ఇన్నీ కాదు.

ఈ కథ ద్వారా పాఠకుడు అర్థం చేసుకున్నదేమిటో మళ్ళీ ప్రత్యేకించి చెప్పనక్కరలేదు. అద్దె ఇంట్లో ఉన్నా అపార్ట్‌మెంటులో ఉన్నా ఒక మనిషి చనిపోతే వచ్చే ఇబ్బందులు అన్నీ ఇన్నీ కాదు. అందరూ స్వంత ఇళ్ళను నిర్మించుకోలేరు. నగరాల్లో అసలు కుదరని పని. ఇంటి యజమానితో సమానంగా అద్దెకున్నవారు సైతం హక్కులు కలిగి ఉంటారని చట్టం చెబుతోంది. చట్టాన్ని తుంగలో ద్రొక్కి అమానుషంగా ప్రవర్తిస్తున్నారు యజమానులు. మృతదేహాలకు జరగాల్సిన అంతిమ క్రియలు అడ్డుకోగూడదని మానవహక్కుల సంఘం చెప్తున్నా చెవిటివాడి ముందు శంఖం ఊదినట్టే అవుతోంది. దీనికి పరిష్కారం? మనుషుల్లో మార్పా? లేక అద్దె యిల్లు, అపార్ట్‌మెంట్ వాసులు ఉద్యమించడమా? కాలమే సమాధానం చెప్పాల్సి ఉంది.

కథా శిల్పాన్ని రెండు రకాలుగా విభజన చేసుకోవచ్చు. మొదటిది వాస్తవిక వాద శిల్పం కాగా రెండవది ప్రయోగ వాద కథా శిల్పం. మొదటిది పాఠకుల హృదయాలను చప్పున తాకుతుంది. రెండోది కొంచెం మేధో్శ్రమను కలిగిస్తుంది. వైద్య పరిభాషలో చెప్పాలంటే సూదిమందు వెంటనే రక్తంలో కలిసిపోయి త్వరగా శరీరంలో రుగ్మతను తగ్గిస్తే, హోమియోపతి మందు నిదానంగా జబ్బును తగ్గించినట్లు రెండో రకం కథలుంటాయి. విహారిది వాస్తవిక వాదం. సమస్యను సూటిగా పాఠకుల మీదకు విసరడమే కాక, కథను ఆలోచనాత్మకంగా ముగిస్తాడు. కథ చదివాక పాఠకుల హృదయాల్లో కొంత

ఆలోచనను రేకెత్తిస్తూ "సశేషంగా ఉన్న తన ఉద్యమం గురించి ఆలోచిస్తున్నట్టు, మా ఇద్దర్నీ చూస్తూనే ఉన్నాడు మురళి" అనడంలో ఆ కథకు ముగింపు అంతకంటే ఏముంటుంది? కథ పేరే సశేషం కదా! ఆ శీర్షికకు పూర్తి న్యాయం చేకూర్చినట్లయింది.

కథకు వాస్తవికతను తెచ్చే ప్రధాన అంశం భాషే అని అనుకుంటాను. భావాన్ని వ్యక్తం చేసే మాధ్యమం భాష. దాన్ని ఎలా వ్యక్తం చేయాలో ఆరితేరిన రచయిత వీర విహారి. కథను ఆద్యంతమూ రక్తి గట్టించే భాషా నైపుణ్యం ఉన్న విహారిగారు కథా ప్రారంభంలో "మురళి మాట్లాడుతూ ఉంటే ఏటికిపోటు తగిలించినట్లుంటుంది" అన్నారు. అసలే ఉధృతంగా ప్రవహించే ఏరు, దానికి పోటు వస్తే మరింత విజృంభిస్తుంది. మురళి అలా ఏకధాటిగా మాట్లాడతాడనడం అన్నమాట. అలాగే ఒకచోట "కట్టెవిరిచి పొయ్యిలో పెట్టినట్లు" అనడంలో ఇంకా ఆమాటకు తిరుగులేదు. దానిమీద వాగ్వివాదాలు లేకుండా "నాది ఒకటే మాట, ఇంకేమీ వినను!" అని చెప్పడం. అలాగే "దోసెడు కొంపా, గుప్పెడు బియ్యం", "చిందర వందర గతం", "శవంలేచిన ఇంట్లో వైరాగ్య భాషణ బాగానే విస్తరించింది" లాంటి మాటలు వాడడం ద్వారా కథకుడు ఒకటి రెండు లైన్లలో చెప్పాల్సిన విషయాన్ని ఒకే పదంతో మొత్తం భావాన్ని స్ఫురింపజేయడమే నైపుణ్యం.

ముగింపుగా ఒక చిన్నమాట. కథలన్నింటికీ ఒకే పద్ధతి పనికి రాదు. కొన్నింటికి వస్తు ప్రాధాన్యం ఉంటే మరికొన్నింటిలో మనస్తత్వ చిత్రణ ఉంటుంది. స్థూలంగా విహారిగారి కథల్లో నేను గమనించిందేమిటంటే 1.సంఘటనా ప్రాధాన్యం, 2.సంభాషణా ప్రాధాన్యం, 3.మనస్తత్వ ప్రాధాన్యం 4.వాతావరణ ప్రాధాన్యం. మొదటిది వస్తువుకు, రెండోది రూపంలోని ఒక విభాగం అనుకోవచ్చు, మూడోది పాత్ర చిత్రణకు సంబంధించినది, నాల్గవది స్థలకాల నేపథ్యాలకు సంబంధించినది. ఇవన్నీ కలబోస్తే విహారిగారి కథలు. విహారిగారు మరిన్ని యిలాంటి జీవన సంఘర్షణలకు, జీవిత చిత్రాలకు అద్దం పట్టే కథలు వెలయించాలని కోరుకుంటున్నాను.

*శీర్షిక నిర్వహణ: శ్రీ రాజులపల్లి ప్రతాప్. ✆ 97698 55645*





# వైద్యశాస్త్ర రంగానికి చెందిన 1983 సంవత్సరపు నోబెల్ పొందిన పరిశోధన

డాక్టర్ చాగంటి కృష్ణ కుమారి
✆ 98851 63304

జీవరాశుల చాలా లక్షణాలు వాటికి వంశపారంపర్యంగా వచ్చే జన్యువుల (genes) మీద ఆధారపడతాయి. జీవరాశుల జన్యు లక్షణాలను నిర్ణయించే అణువులు జీవుల జీవకణాల కేంద్రకంలోని క్రోమోసోములలో నిలవవుంటాయి. జన్యువులు, అంటే డిఎన్ఎ లేదా ఆర్ఎన్ఎ లలోని న్యూక్లియోటైడ్స్ శ్రేణులు. ఇవి జీవులలో అనువంశికతను (వంశపారంపర్యతను) నిర్దేశించే ముఖ్యమైన అణు సముదాయాలనీ.ఇవి డీఆక్సీరైబో కేంద్రక ఆమ్లం (Ddeoxyribonucleic acid) (DNA), రైబో కేంద్రక ఆమ్లాలకు (Ribonucleic acid (RNA) చెందిన భాగాలని ఒకసారి గుర్తు చేసుకొందాం .

పటము :






DNA is our genetic "code". Our code is located on our chromosomes inside the nucleus of our cells. One chromosome is made up of many genes One gene has information for one trait.

క్రోమోసోముల మీద నిర్వహించే శాస్త్రీయ అధ్యయనాలని సైటొజెనిటిక్స్ (Cytogenetics) అంటారు. సరికొత్తగా 1930లలో కణ, జన్యు శాస్త్రాలు రెండూ కలసి రూపుదిద్దుకొన్న శాస్త్ర రంగమే సైటొ జెనిటిక్స్. ఈ నూతన శాస్త్రానికి మార్గదర్శకురాలు బార్బారా మెక్లిన్టక్.

ఒక తీగకి పూసలు కూర్చి వున్నట్టుగా క్రోమోసోముల మీద జన్యువులు క్రమబద్ధంగా రేఖీయ మాదిరిలో స్థిరంగా వుంటాయని శాస్త్రలోకం 20 శతాబ్దంలో భావిస్తూ వుంది. క్రోమోసోములో జన్యువు వుండే కచ్చితమైన ప్రదేశము పేరు లోకస్(locus–a physical location of a gene on a chromosome) :1940ల చివర్లలో ఈ పరికల్పనను బార్బారా మెక్లిన్టక్ సవాలు చేసింది .

ఈమె మొక్కజొన్న గింజల రంగుల సైటొజెనిటిక్స్ పై పరిశోధన చేసింది.

హంట్ మోర్గాన్(Thomas Hunt Morgan) కి అనువంశికత లో





క్రోమోసోముల పాత్రపై జరిపిన ఆవిష్కరణలకి 1933లో వైద్యరంగపు నోబెల్ ని అందుకొన్నాడు. హంట్ మోర్గాన్ క్రోమోసోములు తమ జన్యు పదార్థాన్ని పరస్పరం మార్చుకొంటాయని ఊహించి చెప్పాడు. అప్పట్లో తన ప్రతిపాదనను ప్రాయోగికంగా ఋజువుచేయడానికి అవసరమైన పద్ధతులు లేనందున దానిని నిరూపించలేక పోయాడు.

మెక్లిన్టక్ తన సృజనాత్మకతో స్వంతంగా అభివృద్ధి పరచిన సాంకేతిక పద్ధతులను వాడుతూ మోర్గాన్ గారి ప్రతిపాదనకు ప్రాయోగిక ఋజువు చూపగలిగింది .ఈ రోజున సైటోజెనిటిక్స్ లో ఆమె ప్రవేశపెట్టిన సాంకేతిక పద్ధతులను అతి ముఖ్యమైనవిగా చెప్పుకొంటారు.



వైద్యశాస్త్ర రంగానికి చెందిన 1983 సంవత్సరపు నోబెల్ పొందిన పరిశోధన : చోటు మార్చుకొనే జన్యువుల ఆవిష్కరణ: బహుమతి గ్రహీత బార్బారా మెక్లిన్టక్ (Barbara McClintock

క్రోమో సోములపై జన్యువులు స్థిరమైన స్థానాలలో వుండవనీ కొన్ని జన్యువులు క్రోమోసోములో ఒక భాగం నుండి మరొక భాగానికి గెంతుతాయని తన పరిశోధనలో చూపగలిగింది. ఇలా గంతులు వెసే జన్యువులను ఆమె జంపింగ్ జీన్స్ అంది. జీనోమ్ (ఒక జీవి యొక్క మొత్తం జన్యు సమాచారం) కేవలము సమాచారాన్ని తెలిపే నిష్క్రియ మైన డేటా బేస్ మాత్రమే కాదనీ, అది చలించే లక్షణంగల సున్నితమైన వ్యవస్థ అని కనుగొంది. ఈ గతిశీల వ్యవస్థలోని అంశాలు తమలో తాము, అలాగే తమ పరిసరాలతో కూడా సంకర్షణ(interact) కు లోనవుతూ వుంటాయని తెలిపింది .

మెక్లిన్టక్ జంపింగ్ జీన్స్ అని వర్ణించినవి– క్రోమోసోములో తమ చోటు మార్చుకొనే జీన్స్ ని ఇప్పుడు ట్రాన్స్ పోసానులు (transposons) అని వ్యవహరిస్తున్నారు .

మొదట జన్యువులోని లక్ష్య స్థానాల దగ్గరకు వెళ్లగల DNA విభాగాలను బార్బరా మెక్ క్లింటాక్ కనుగొంది . భారతీయ మొక్కజొన్నలో వివిధ రంగుల గింజలతో కూడిన కంకులు ఉన్నాయని అటువంటి వాటిని ప్రదర్శించి చూపింది.



Labelled maize. Barbara McClintock discovered that genes could "jump" by studying generational mutations in maize *Courtesy of Cold Spring Harbor Laboratory. Photo: Jan Eve Olsson*

1932 నాటికే తొమ్మిది మొక్కజొన్నల క్రోమోసోముల పై తన పరిశోధనా పత్రాలను ప్రచురించింది. 1931 PNAS Proceedings of the National Academy of Sciences of the United States of America లో ఒక గ్రాడ్యుయేట్ విద్యార్థి తో కలసి ప్రచురించిన పత్రంలో వారు క్రోమోసోములలో భాగాలు మార్పిడి జరగడాన్ని ప్రదర్శించి చూపారు. ఈ పత్రము జన్యుశాస్త్ర రంగంలో ఒక మైలురాయి గా నిలిచింది. జన్యువుల స్థలమార్పుడులు కోమొసోములలొ వుత్పరివర్తనాలకు (mutations) దారితీస్తాయనీ, అది



A few labelled samples of Barbara McClintock's maize, with microscope Smithsonian Institution. National Museum of American History

మెక్లిన్ టక్ జంపింగ్ జీన్స్ ప్రతిపాదనను ఆనాటి ఆ శాస్త్ర రంగం ఒప్పుకోకపోయినప్పటికీ , ఆమె నైపుణ్యానికీ, కృషికీ జనాలలో మంచి గుర్తింపు వుండేది. అందువల్ల 42ఏండ్ల వయసులోనే ఆమె నేషనల్ అకాడమి ఆఫ్ సైన్స్ స్ కి ఎన్నుకొన్నారు. ఎప్పుడైతే



జన్యుశాస్త్ర అధ్యయనాల సాంకేతిక పద్ధతులు మెరుగయ్యాయ్యో, ఇతర శాస్త్రజ్ఞులు కూడా జంపింగ్ జీన్స్ ఉనికిని నిర్ధారించగలిగారు. మొక్కజొన్నలలో మాత్రమేకాదూ, ఇతర జీవాలలో కూడా ట్రాన్స్ పోసాన్స్ వు న్నాయియా అని తెలుసుకొన్నారు. వాటిని సూక్ష్మజీవులలో (bacteria), సూక్ష్మజీవులను రూపుమాపు సూక్ష్మాతి సూక్ష్మజీవులలో (bacteriophage viruses) , పండ్లఈగలలో (fruit flies) వున్నట్లుగానూ, అంతే కాదు; మానవులలో కూడా ఇవి వున్నాయన్న సంగతిని నిర్ధారించారు. ఈనాడు 50 శాతం మానవ జీనోమ్ ట్రాన్స్పోసానులతో ఏర్పడిందని భావిస్తున్నారు.

మొట్టమొదట గా మెక్లిన్టక్ జంపింగ్ జీన్స్ పై ప్రచురించిన పత్రానికి 35 సంవత్సరాలనంతరం ,PNASలో ప్రచురించిన శాస్త్రీయ పరిశోధనా వివరాల పత్రం ప్రచురణ అయిన 33 సంవత్సరాల తరువాత 1983లో ఆమెకి నోబెల్ బహుమానం లభించింది.



Barbara McClintock in the lab at Cold Spring Harbor, April 1963 National Institutes of Health. Courtesy of the Barbara McClintock Papers, American Philosophical Society. Photographer unknown

References:


1. Morgan TH. Croonian lecture: On the mechanism of heredity. Proc R Soc Lond, B. 1922;94(659):162–197.
2. McClintock B. The origin and behavior of mutable loci in maize. Proc Natl Acad Sci USA. 1950;36(6):344–355. doi: 10.1073/pnas.36.6.344.
3. Fedoroff N. McClintock's challenge in the 21st century. Proc Natl Acad Sci USA. 2012;109:20200–20203
4. McGrayne SB. 2001. in Nobel Prize Women in Science, (Carol Publishing Group, Secaucus, NJ), pp 144–174.
5. Sturtevant AH. The linear arrangement of six sex-linked factors in Drosophila, as shown by their mode of association. J Exp Zool. 1913;14:43–59
6. Creighton HB, McClintock B. A correlation of cytological and genetical crossing-over in Zea Mays. Proc Natl Acad Sci USA. 1931;17(8):492–497. doi: 10.1073/pnas.17.8.492.
7. Fedoroff N. In: The Dynamic Genome: Barbara McClintock's Ideas in the Century of Genetics. Fedoroff N, Botstein D, editors. Woodbury, NY: Cold Spring Harbor Lab Press; 1992. pp. 389–416 8.McClintock B. In: The Discovery and Characterization of Transposable Elements. The Collected Papers of Barbara McClintock. Moore JA, editor. New York: Garland Publishing; 1987. pp. vii–xi

9. Taylor AL. Bacteriophage-induced mutation in E. coli. Proc Natl Acad Sci USA. 1963;50(6):1043–1051.
10. Shapiro JA. Mutations caused by the insertion of genetic material into the galactose operon of Escherichia coli. J Mol Biol. 1969;40(1):93–105.
11. Engels WR, Preston CR. Identifying P factors in Drosophila by means of chromosome breakage hotspots. Cell. 1981;26(3 Pt 1):421–428.
12. Fedoroff NV. About maize transposable elements and development. Cell. 1989;56(2):181–191.
13. Fedoroff N, Wessler S, Shure M. Isolation of the transposable maize controlling elements Ac and Ds. Cell. 1983;35(1):235–242.



# తెలుగు లఘు కవితా ప్రక్రియ
# నానీలు–పర్యవలోకనం

## ప్రత్యేక విభాగం



నిర్వహణ, సమన్వయం, సంపాదకత్వం :

డా. వి. వింధ్యవాసినీ దేవి



# పదాల పొదుపు, లోతైన భావం – నానీలు

సుమారు 28 సంవత్సరాల క్రితం అసంకల్పితంగా మొదలైన నూతన తెలుగు లఘు కవితా ప్రక్రియ "నానీ" ఎంతోమంది సాహితీ వేత్తలని ఆకర్షిస్తూ నిత్యనూతనంగా తెలుగు సాహిత్యరంగంలో విరాజిల్లడం చాలా సంతోషదాయకమైన విషయం. ఈ ప్రక్రియ సృష్టికర్త ఆచార్య గోపి గారిని అభినందించాలి. ఆయన మొదలు పెట్టిన ప్రక్రియని తీసుకుని మార్పులు, చేర్పులతో 'నానీల' ప్రక్రియని సుసంపన్నం చేస్తున్న 'నానీ' అభిమానులకి, ముఖ్యంగా ఆచార్య గోపిగారి శిష్యగణానికి అభినందనలు. దాదాపు మూడు దశాబ్దాలు ఈ ప్రక్రియ తెలుగు సాహితీ రంగంలో నిలదొక్కుకుందంటే కారణం ఆ ప్రక్రియ కవికి ఇచ్చే వెసులుబాటుతోపాటు, అల్పాక్షరాలతో భావ వ్యక్తీకరణకి, భావోద్వేగ ప్రకటనకి అవకాశం కలిగి ఉండడం.

ప్రకాశిక పత్రిక జనవరి – మార్చ్ సంచికలో వేసిన ప్రత్యేక వ్యాసాలలో ఆవిష్కరింపబడిన నానీల అంశాల విస్తృతి చూశాక ఒక నిట్టూర్పు విడవక తప్పలేదు. తెలుగులో పుట్టి, ఇంత ప్రాచుర్యం పొందిన నానీల ప్రక్రియని ఇతర భాషలవారు, భారతీయ భాషలలో గానీ, విదేశీ భాషలలోగానీ, ఎందుకు తీసుకోలేదు ? ఉదాహరణకి జపనీస్ భాషలో పుట్టిన హైకూని ఎన్నో భాషల వారు అనుసరించారు; తెలుగులో కూడా ఒక బలమైన కవితా ప్రక్రియగా గుర్తింపు పొందింది. తెలుగు వారు ఆత్మ సంతృప్తితో బయట ప్రపంచానికి పరిచయం చేసే ఏర్పాటు చేయలేదా, లేక ఇతర భాషలు ఈ ప్రక్రియకి ఒదగవా? అదే కనక కారణం అయితే, నానీ ప్రక్రియ నియమాలలో మార్పులు చేసి ఒక రూపాంతర

ప్రక్రియగా చేయవచ్చునేమో. సాహిత్యం అయినా, సాహితీ ప్రక్రియలైనా భౌగోళికంగా విస్తరించకపోతే వాటి మనుగడకి కాలపరిమితి తక్కువగా ఉండే అవకాశం ఉంది. నానీ అభిమానులు ఈ విషయం గురించి ఆలోచిస్తారని ఆశిస్తాను. ఒక ఆలోచనకి నానీల రూపం ఇచ్చి 20–25 పదాలలో వ్యక్తీకరించడం బలీయమైన అంశం అయినా, ప్రతీ నానీ ఒక చెణుకులా, సూక్తిలా ఉండిపోతుంది. అలాకాక ఒక అంశం మీద కొన్ని నానీలు అనువైన శీర్షిక పెట్టి ఖండికలుగా రాస్తే మరింత ఆదరణ వస్తుందేమో. అలాంటివి కొన్ని వచ్చాయి, ఇంకా రావాలని నా ఆకాంక్ష. ఆచార్య గోపి గారు తన ఇంటర్వ్యూలో చెప్పినట్టు వేమన పద్య నిర్మాణ వ్యూహం నానీలకి స్ఫూర్తినిచ్చినట్లు, వేమన శతకాన్ని నానీల రూపంలో రాసి వేమన భావాలని నానీల రూపంలో సంక్షిప్తీకరిస్తే ఎలా ఉంటుందో నానీ కవులు ఆలోచించాలి.

ఈ సంచికలో ప్రచురించిన చక్కని వ్యాసాలు సాహితీవేత్తలకి వారి పరిశోధనల్లో ఉపయోగ పడతాయని ఆశిస్తాను.

ధన్యవాదాలు
కొవ్వలి గోపాలకృష్ణ
ప్రధాన సంపాదకులు–ప్రకాశిక





# నానీల పితామహుడు ఆచార్య ఎన్. గోపి

"నానీ" ప్రక్రియ సృష్టికర్త డా. ఎన్.గోపి కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత, తెలుగు విశ్వవిద్యాలయం పూర్వ వైస్ చాన్స్లర్ గొప్ప కవి కూడ. 30 కవిత్వ గ్రంథాలు, వేమనపై గొప్ప పరిశోధన, విమర్శ గ్రంథాలు, విదేశీయాత్రా చరిత్ర పుస్తకాలు వగయిరాలతో 60 గ్రంథాల రచయిత. సాహిత్య అకాడమీ పురస్కార కవితాసంపుటి 'కాలాన్ని నిద్రపోనివ్వను' 23 భారతీయ భాషల్లోకి అనువదించబడింది. వీరి Magnum opus దీర్ఘకవిత 'జలగీతం' 14 భాషల్లోకి, 'వృద్ధోపనిషత్' 7 భాషల్లోకి, నానీలు 12 భాషల్లోకి అనువదించబడ్డాయి. పర్షియన్, జర్మన్, చైనీస్, రష్యన్ భాషల్లోకి కూడా గోపి కవిత్వం అనువదించబడింది. గోపి గారికి 100 పురస్కారాలకు పైగా లభించాయి.

# ఆచార్య ఎన్.గోపి గారితో ముఖాముఖి

**ప్రశ్న :** నానీల ఆవిర్భావం జరిగి 27 సంవత్సరాలు అయ్యింది. నానీల ఆవిర్భావం నాటి పరిస్థితుల గురించి మీ నోట వినాలనుంది.

**జవాబు :** ఒకానొక సంవేదనాత్మక స్థితిలో ఉన్నప్పుడు ఎందుకో ఓ రెండు నెలలపాటు నానీల మానసిక స్థితిలో ఉండిపోయాను. ఇది 1996 లో జరిగింది. రాసిన తర్వాత వాటిని పరిశీలిస్తే వాటిలో నేనిప్పుడు లోకానికి చెప్పిన లక్షణాలు కనిపించాయి. ఆ రోజుల్లో నేను తీవ్రమైన జ్వరంలో ఉన్నప్పుడు అప్పటి వార్త పత్రిక సంపాదకులు ఎ.బి.కె ప్రసాద్ గారు నన్ను పరామర్శించడానికి మా ఇంటికి వచ్చారు. ఆయన నా దిండు పక్కన ఉన్న నానీల రాతప్రతిని చూసి 'ఒరే అబ్బాయి నీ తలాపున పెద్ద విప్లవాన్ని పెట్టుకొని పడుకున్నావ్' అంటూ దానిని తనవెంట తీసుకుపోయారు. అంతే! వార్త ఎడిట్ పేజీలో ఇరవై వారాల పాటు ఇరవై నానీల చొప్పున వాటిని ప్రచురించారు. అలా నానీలు లోకమంతా వ్యాపించాయి. ఎటు చూసినా నానీల చర్చే. 1997లో గ్రంథరూపంలో వచ్చాయి. యేడాది పాటు అలుపు లేకుండా వెలువడ్డాయి. ఇంకా సాగిపోయేవే 365 దగ్గర ఆపకపోతే; సంఖ్య 365 మరేం లేదు ఒక సంవత్సరానికి 365 రోజులని.

పశ్చిమ గోదావరి జిల్లాలో కొందరు కవులు నానీలు రాయడం మొదలుపెట్టారు. ఎస్.ఆర్. భల్లం వాటిలో మొదటివాడు. అలా తూర్పు గోదావరి, కృష్ణ, గుంటూరు జిల్లాల్లో. తెలంగాణలోని ఒక్క కరీంనగర్ జిల్లాలోనే యాభై నానీ సంపుటాలు వెలువడ్డాయి.

రైతులవ్యధ, మధ్యతరగతి జీవిత సౌందర్యం స్థానికభాషా పరిమళాలు వగైరాలు వాటిలో నిండి పోయాయి. అచిరకాలంలోనే వంద సంపుటాలు దాటాయి. తెలుగు యూనివర్సిటి ఆడిటోరియంలో నానీల ఎనిమిదవ, దశమ వార్షికోత్సవ సభలు జరిగాయి. నానీ కవులందరూ వాటికి హాజరయ్యారు.

**ప్రశ్న :** నానీల లక్షణాలు తెల్పండి

**జవాబు :** నానీలు చిన్న పద్యాలు. మరీ చిన్నవి కావు. నానీ అతిబిగింపూ అనవసరమైన సడలింపు లేకుండా నేను రూపొందించుకున్న 20 – 25 అక్షరాల విస్తీర్ణం గల చట్రం. అంటే 20 అక్షరాలకు తగ్గవు. 25 ను మించవు. నానీలు అంటే "నావీ, నీవీ వెరసి మనవి" అని అర్థం. నానీలంటే చిన్న పిల్లలని కూడా. చిట్టి పద్యాలు కదా!

నానీల్లో నాలుగు పాదాల నియమాన్ని పాటించాను. వచన కవితల్లోలాగే ఈ విభజనకు హేతుబద్ధత ఏమీలేదు. అయితే నిర్మాణం దృష్ట్యా వీటిలో ఒక పద్ధతిని గమనించవచ్చు. నానీల్లో రెండేసి పాదాలకో భావాంశాన్ని(Unit) గుర్తించవచ్చు. మొదటి రెండు పాదాల్లో ఒక భావాంశం, మలి రెండు పాదాల్లో మరో భావాంశం ఉంటుంది. మొదటి దానికి రెండోది సమర్థకంగానూ వ్యాఖ్యాన ప్రాయంగానో వుంటుంది.

'కుండ ముక్కలైందా
కుమిలిపోకు
మట్టి మరోరూపం కోసం
సిద్ధమౌతుంది.' దీనిలో మొదటి భావాంశానికి రెండో భావాంశం సమర్థకంగా ఉంది.

వేమన పద్యాల్లో ఛందస్సును మినహాయించి చూసినా ఆయన ఏర్పరచుకున్న ఒక నిర్మాణ పథకం(Formula) కనిపిస్తుంది.

ఉప్పుకప్పురంబు ఒక్క పోలికనుండు
చూడచూడ రుచుల జాడవేరు
పురుషులందు పుణ్యపురుషులు వేరయా
విశ్వదాభిరామ వినురవేమ

నాలుగోపాదం కోరస్. దాన్ని వదిలెయ్యండి, అది అన్నిటికి సమానం. మొదటిపాదంలో రెండు వేరు వేరు పదార్థాల సామ్యం ఆధారంగా ఒక సంగతి చెప్తాడు. రెండోపాదంలో గుణవైరుధ్యాలను దృష్టాంతంగా తీసుకొని మొదటి భావాన్ని ఖండిస్తాడు. మూడోపాదంలో రెండు పాదాల్లోని భావవైరుద్యాన్ని సమన్వయం చేసి ఒక లోకసత్యాన్ని పిండుతాడు. ఇది వేమన్న మూస. వేమన

పద్యాల్లో చాలాభాగం ఈ మూసలో వుంటాయి. ఇక ఛందోగమనంలో కూడా సరళతను సాధించి, సూర్యేంద్ర గణాల్లోని వెసులుబాటును(Choice) ని ఉపయోగించుకొని వేమన తన పద్యానికొక దీప్తిని వ్యాప్తిని సంతరించుకున్నాడు. నానీల్లో ఈ వెసులుబాటు చాలా ముఖ్యం. దీనివల్ల భావం దెబ్బతినకుండా కుదిరే వీలుంది. అంటే Changing meter రే గాని Fixed meter కాదని అర్థం.

చిన్నపద్యం గాఢత కోసమే పుట్టింది; సందేహం లేదు. ధారణానుకూలత, అవాంతర ప్రయోజనం, సాంద్రీకరణ దీని ప్రధాన లక్షణం. సాధ్యమైనంత వరకు వ్యర్థ పదాల నిరోధం దీనివల్ల జరుగుతుంది. హాలుని గాథాసప్తశతిలో ఈ సంక్షిప్తీకరణశక్తి కన్పిస్తుంది. గాథలను తెలుగులోకి అనువదించిన రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారు వాటికి చిన్న పద్యాలనే ఎన్నుకున్నారు. (ఆటవెలది, తేటగీతి, కందం) మూలంలోని సాంద్రతను ఆయన తెలుగులోకి పట్టుకొచ్చారు. వ్యంజన భేదాలన్నీ గాథల్లో కనిపిస్తాయి.

ఇటీవల తెలుగులో ప్రచలితంగా వెలువడుతున్న హైకూల్లో ఈ సంక్షిప్తీకరణ పతాకస్థాయికి చేరుకుంది. హైకూల్లో అక్షరాల విస్తీర్ణం 17. దీనిని గాలి నాసరరెడ్డి మాత్రమే పాటించారు. 17 అక్షరాలను పాటించడం కష్టమేమీకాదని శిఖామణి ఉదాహరణ చూపెట్టాడు. (తెలుగులో హైకూ ప్రస్థావనలు, వివిధ, ఆధునిక సాహిత్య వ్యాసాలు)

ఎండిపోయిన కొమ్మ మీద
కాకి ఒంటరిగా కూచుంది
చలికాలపు సాయంత్రం (ఇస్మాయిల్)

ఎండుకొమ్మపై
ఒంటరిగా ఓ కాకి
శిశిర సంధ్య. (నాసరరెడ్డి)

నాసరరెడ్డి ప్రతిభావంతంగా క్లుప్తీకరించాడు. కాని పద్యం స్నాప్ షాట్ గా, స్టిల్ ఫొటోగ్రఫీ గా రూపొందింది దీనిలో జెన్ బౌద్ధం స్ఫూర్తి వస్తే రావొచ్చుగాని సగటు శ్రోతకు దీనిలో కదలిక కనిపించదు.

హైకూల్లో తెలుగు భావం పట్టదు. ఇస్మాయిల్ లాంటి పెద్దకవి కూడా

హైకూ లక్షణాలు పాటించకుండా హైకూలు రాశారు. నానీల్లో అందుకే 20 – 25 అక్షరాల వెసులుబాటును నేను కల్పించు కున్నాను. దానివల్ల భావం దెబ్బతినకుండా ఉంటుందని ఒక ఆశ.

**ప్రశ్న** : జలగీతం లాంటి దీర్ఘకవిత్వంను రచించిన మీరు నానీ అనే ఈ లఘు రూపాన్ని సృష్టించడానికి కారణం ఏమై ఉంటుంది ?

**జవాబు** : యాదృచ్ఛికమే అయినా ఈ ముక్తకాలను రచించడానికి సామాజిక కారణం ఉంది. కాలం మారుతుంది. కొత్తతరం వీటిపట్ల ఆకర్షితులౌతారనే నమ్మకం నాకుండేది. అది నిజమైంది కూడా. సైజువల్ల, భావాంశాల వల్ల, రెండో భావాంశంలో ఉండే చరుపు (Punch) వల్ల వాటికి ఒక ధారణానుకూలత ఏర్పడింది. ఆటవెలదుల్లోని నిర్మాణ పథకం ఇక్కడ పనిచేసింది.

**ప్రశ్న** : అరవై సంవత్సరాల మీ రచనానుభవం నానీల ఆవిర్భావానికి తోడ్పడిందా?

**జవాబు** : నేను ముందే చెప్పినట్టు నానీలను ఇవేవో సరదాకు రాసినవి కావు. ప్రయోగం అని భావించినవీ కావు. అలా రూపొందాయి అంతే. అయితే దాని వెనక బహుళ అధ్యయనంతో పాటు అప్పటికి నలభై పుస్తకాలు రచించిన అనుభవం వూరికే పోతుందా! నానీ రచన కీర్తికి షార్ట్ కట్ కాదు.

**ప్రశ్న** : ఒక కవితా రూపానికి రూపం ముఖ్యమా? అర్థం ముఖ్యమా? నానీల సందర్భంలో వివరించండి?

**జవాబు** : రెండూ ముఖ్యమే. నానీలు దానిని నిరూపించాయి. రూపమే కాకుండా కవితాశక్తి వల్లనే నానీలు రాణించాయి.

**ప్రశ్న** :నానీల పై విశ్వవిద్యాలయ స్థాయిలో పరిశోధనలు జరిగాయా?

**జవాబు** :ఇప్పటి వరకు 560 కి పైగా నానీల సంపుటాలు వెలువడ్డాయి. పుస్తకరూపంలో రాకుండా కనీసం రెండువేల మంది వీటిని రాస్తున్నారు. వీటిలో చాలా సంపుటాలకు నా పర్యవేక్షణ ఉంది. స్థాయి విషయంలో నేనెప్పుడు రాజీ పడలేదు. నానీల ద్వారా కొత్త కవులు ఎందరో విశాలమైన కవితా ప్రపంచంలోకి అడుగుపెట్టారు. అలాగే లబ్ధప్రతిష్టులైన సీనియర్ కవులు కూడా నానీ రచనను సుసంపన్నం చేశారు. దీనికి కారణం నానీ కవిత్వంలోని క్వాలిటియే కారణం అని నేను వినయ పూర్వకంగా భావిస్తున్నాను. హైదరాబాద్ సెంట్రల్

యూనివర్సిటి, ఉస్మానియా యూనివర్సిటిలో జరిగాయని విన్నాను. డా.ఎస్. రఘు అడిగితే వివరంగా చెపుతాడు.

**ప్రశ్న :** నానీలు ఇతర భారతీయ భాషల్లోకి అనువాదం అయ్యాయా ?

**జవాబు :** హిందీలోకి డా.పోలి విజయరాఘవరెడ్డి అద్భుతంగా అనువదించాడు. అది ఢిల్లీలోని హిందీ భవన్లో ఆవిష్కృతం అయ్యింది. విద్వత్ వక్తలందరూ దక్షిణ భారతదేశం ఉత్తర భారతదేశానికి కానుకగా ఇచ్చిన ముక్తక సంపద ఇది అని ప్రశంసించారు. అలాగే నా నానీల రెండో పుస్తకాన్ని ఉస్మానియా హిందీ శాఖాధ్యక్షులు ఆచార్య సత్యనారాయణ అనువాదం చేశారు. అలాగే ఉర్విష్ ఒసాడియా అనే గుజరాతి కవి ఆ భాషలోకి తీసుకెళ్ళారు. అయితే ఉస్మానియా ఇంగ్లీష్ డిపార్ట్ మెంట్ లోని ఆచార్య జయలక్ష్మి 'ది లిటిల్ వన్స్' అని గొప్పగా ట్రాన్స్ లెట్ చేశారు. ఇంకా నానీలు – నన్హే ముక్తక్ మణికా(మరాటీ) సురేశ్ గంగా ఖేడ్ కర్, నానీలు – నవమౌక్తికాః(సంస్కృతం) ప్రొ. ఎం. విజయశ్రీ, నానీగళ్(తమిళం) డా.నలిమెల భాస్కర్, నానీగళ్(కన్నడం) ప్రొ.కె.జి నారాయణ ప్రసాద్, చికిత్ వోర్జియే మినియాచూరి(రష్యన్) ప్రొ. విజయ్ తోతావర్, నన్హీనజ్ మే(ఉర్దూ) ప్రొ. ఫాతిమాబేగం, నానీ కవితాకళ్ (మలయాళం) ఎల్. ఆర్. స్వామి, నన్హేముక్తక్ (పంజాబీ) డా. చందర్ త్రిఖ.

**ప్రశ్న :** వర్తమాన కవులకు మీరిచ్చే సూచనలు, సలహాలు ఏమిటి ?

**జవాబు :** ఏముంది అందరూ చెప్పేదే. పూర్వుల పుస్తకాల్ని బాగా చదవాలి. అధ్యయనం చెయ్యాలి. మా కంటే మీ ముందు ఇంకా గొప్ప ప్రపంచం ఉంది. యువత తెలుగుకు దూరమౌతున్న నేటికాలంలో దానికి ఆకర్షితులు కావడానికి నానీలు తోడ్పడతాయనడంలో సందేహం లేదు. అంతకంటే కావాల్సిందేముంది. చివరగా 'నానీల సుగంధం' రచించిన నువ్వు ఈ ఇంటర్వ్యూ చేసినందుకు ఎంతో ఆనందిస్తున్నాను.

డా. గిన్నారపు ఆదినారాయణ ఆచార్య ఎన్. గోపి గారితో ప్రకాశిక కోసం ప్రత్యేకంగా జరిపిన ముఖా ముఖీ పాఠం. మొబైల్ నంబర్ : 9949532456





# 'నానీల సుగంధా'న్ని ఆస్వాదించడమెలా?

ఆచార్య దార్ల వెంకటేశ్వరరావు
99896 28049

కవిత్వాన్ని అందరూ ఆస్వాదించలేరు. కానీ ఆస్వాదించేవాళ్లు రసహృదయులు, సహృదయులై ఉండాలి. ప్రాచీన కావ్యాల్ని చదవడానికి వ్యాఖ్యానాలు ఉంటాయి. వాటిలో కథకూడా ఉంటుంది. ఆధునిక కవిత్వంలో ముఖ్యంగా వచన కవిత్వంలో కథ ఉండదు. వస్తువు ఉంటుంది. కవి పొందిన భావోద్వేగాన్ని కవిత్వం చేస్తాడు. దాన్ని అర్థం చేసుకోవాలంటే కవిత్వం మీద అభిమానం ఉండాలి. దానిలో వర్ణనలు, భావుకత, వ్యంగ్యం, ప్రతీకలు, భావచిత్రాలు, సందేశం, శైలీరమ్యత వంటివి ఉండాలి. అంతే కాదు, ఆధునిక కవిత్వాన్ని ఆస్వాదించాలంటే, మనం సృజనాత్మకంగా ఆలోచించాలి, మన భావాలను కవి భావాలతో మేళవించాలి. కవిత్వంలోని ప్రతి పాదంలో దాగి ఉన్న అనుభూతిని గ్రహించగలగాలి. కొన్ని సార్లు సమకాలీన, లేదా ఆ కవిత్వం వెలువడిన కాలం నాటి సామాజిక, రాజకీయ, ఆర్థిక, చారిత్రక సంఘటనలు తెలియడం కూడా అవసరమవుతుంది. అందుకే శ్రీశ్రీ ఆధునిక కవిత్వం అర్థం కావాలంటే ఆధునిక జీవితం అర్థం కావాలన్నాడు. ఆధునిక కాలంలో వచనకవిత్వంతో పాటు, పద్య కవిత్వం, రూపపరంగా అనేకమైన పేర్లతో మినీ కవిత్వం విస్తృతంగా వస్తుంది. ప్రాచీన లేదా సంప్రదాయ సాహిత్యంలో చాటువులు, శతక పద్యాలు వంటివి ఛందోబద్ధంగా ఉన్న కవిత్వ రూపాలు. వాటిలో అలంకారం, ధ్వని, రసం, ఛమత్కారం, శ్లేష, వ్యంగ్యం వంటివి సంప్రదాయ పండితుల సహకారంతో అర్థం చేసుకుంటారు. వచన కవిత్వాన్ని అర్థం చేసుకోవడానికి వ్యాఖ్యానాలు వంటివి లేవు. అందువల్ల కవిజీవితం, కవి కాలాదులు, ఆనాటి సామాజిక పరిస్థితులు కవిత్వ అవగాహనకు తోడ్పడే అంశాలుగా కొంతమంది భావిస్తారు. ఆంగ్ల సాహిత్యంలో న్యూ క్రిటిక్స్ ప్రకారం కవి జీవితంతో సంబంధం లేకుండా కవిత్వం అర్థం చేసుకోవాలి. అంతే కాదు మరికొన్ని ధోరణుల ప్రకారం



**కవిత్వం ఉంటే అది ఏ రూపంలో వెలువడినా పాఠకులు దాన్ని ఆదరిస్తారు.**



భాషతో, భావంతో చేసే ప్రయోగాలు కూడా కవిత్వాన్ని అర్థం చేసుకోవడంలో సందిగ్ధతకు కారణమవుతుంది. ఏంబిగ్విటీ (Ambiguity) కూడా ఆధునికకవిత్వంలో ఒకలక్షణంగా భావించేవాళ్లున్నారు. దీన్ని అస్పష్టతాగుణం కవిత్వాస్వాదనకు తోడ్పడుతుందని భావిస్తారు. ఇది కవిత్వాన్ని మరింత బలంగా, సాంద్రంగా చేస్తుందని చెప్తుంటారు. కవిత్వానికి ఎన్నో పొరలను జతచేస్తుంది. పాఠకుడికి విభిన్న అనుభూతులను అందిస్తుంది. పునఃఛాయచిత్రణ (Reinterpretation)కు అవకాశం ఇస్తుంది. ఒకే కవితను వేర్వేరు సందర్భాలలో వేర్వేరు విధాలుగా అర్థం చేసుకునే అవకాశం ఉంటుంది. వచన సాహిత్యం కంటే కవిత్వాన్ని చదివేవాళ్ళు కోరుకునేది కూడా ఇదొక లక్షణం. కవికి సృజనాత్మకత ఎలా అయితే ఉంటుందో పాఠకుడికి కూడా ఆ సృజనాత్మకత ఉంటే కవి భావుకతలోతులు తెలుస్తాయి. ఆధునిక కవిత్వంలో హైకూలు, నానీలు తదితర రూపపరమైన ప్రక్రియల్ని ఆస్వాదించాలంటే కూడా ఇలాగే వాటి లోతుల్ని చూడగలిగే దృష్టిని ప్రదర్శించాలి. కేవలం భౌతికలక్షణాలైన పాదాలు, పంక్తులు వంటివి ఆ రూపాలకు ఒక స్థిరత్వాన్నిచ్చేవే తప్ప, ఆ లక్షణాలతోనే ఆధునిక మినీ కవితారూపాలను చూడకూడదు. ఛందోబద్ధ పద్యంలో కూడా ఒక్కోసారి నాలుగు పాదాలు పూర్తయినప్పటికీ, భావం పూర్తిగా చెప్పడానికి మాలికలుగా రాస్తుంటారు. ఆధునిక మినీ రూపపరమైన కవితల్లో కూడా సిలబల్స్, అక్షరాలు, పంక్తులు, పాదాలు వంటివి అలాంటివే. ఈ భౌతిక రూపపరమైన లక్షణాలను అనువర్తించడం కంటే, భావాన్ని, దాని భావుకతను, గాఢతను, దానిలోని చమత్కారం, వ్యంగ్యం, తత్వాన్ని సృజనాత్మకంగా ఆలోచించగలగాలి. ఈ కోణంలో నానీలను ఎలా ఆస్వాదించాలో డా.గిన్నారపు ఆదినారాయణ రచించిన 'నానీల సుగంధం' సంపుటిలోని కొన్ని నానీలను ఈ వ్యాసంలో విశ్లేషించి చూపే ప్రయత్నం చేస్తాను.

కవిత్వం ఉంటే అది ఏ రూపంలో వెలువడినా పాఠకులు దాన్ని ఆదరిస్తారు. అది పద్యం, వచన కవిత్వం, మినీ కవిత్వం, దీర్ఘ కవిత్వం...ఇలా ఏదైనా కావచ్చు. "ఎన్నాళ్లుగానో / భావాలు నానుతున్నాయి. / ఇవాళ / నానీలై మొలకెత్తాయి."

> పుస్తక రూపంలో రాకుండా దాదాపు వెయ్యి మందికి పైగా కవులు నానీలు రాశారు.

అంటూ డాక్టర్ గిన్నారపు ఆదినారాయణ ఇటీవల వెలువరించిన 'నానీల సుగంధం' నానీల సంపుటి ప్రత్యక్ష ఉదాహరణగా కనిపిస్తుంది. కవికున్న గుణం సమాజంలో ఏదైనా తాను దర్శించిన దానికి అతను మానసికంగా ఎంతో సంఘర్షణపడతాడు. అప్పుడు గాని అది కవిత్వమై బయటికి రాదు. ఆ లక్షణాన్నే 'ఆది' నానీరూపంలో అందంగా చెప్పాడు. నానీల సృష్టికర్త డాక్టర్ ఎన్.గోపి ఈ పుస్తకానికి ముందుమాటలో ఇలా అన్నారు. ''పాతికేళ్ల క్రితం నేను శిల్పీకరించిన నానీల బాటలో సుమారు ఐదువందల సంపుటాలు వచ్చాయి. పుస్తక రూపంలో రాకుండా దాదాపు వెయ్యి మందికి పైగా కవులు నానీలు రాశారు. నాణ్యమైన నానీలలో 'ఆది' వాటిని మరింత సుసంపన్నం చేస్తున్నాడు.'' ఈ మాటలను బట్టి చూసినా ఈ కవిత్వం ఎంత బాగుందోనని ఈ వ్యాఖ్యలే చెబుతున్నాయి. సాధారణంగా ప్రాచీన కవులు చరిత్రను, వారసత్వాన్ని, సంస్కృతినీ కీర్తిస్తుంటే, ఆధునిక కవులు సమకాలీన సమాజంలో ఉన్న సమస్యలను వర్ణిస్తుంటారు. దీన్నే 'ఆది' కూడా పాటించాడు.

**రైతులు - వ్యవసాయ సమస్యల చిత్రణ:**

మనభారతదేశంలోపాలకులువ్యవసాయానికిఅత్యంతప్రాధాన్యాన్నివ్వాలి. కానీ అది జరగడం లేదు. ఆ రైతులకు అందించవలసిన విత్తనాలు, ఎరువులు సరైన సమయంలో అందిస్తే చాలు. పంట నిల్వ ఉంచుకోవడానికి గిడ్డంగులు నిర్మించాలి. అలా చేస్తే అదే వాళ్ళకు ఎంతో సహాయం చేసిన వాళ్ళు అవుతారు. అంతేకాకుండా పండించిన పంటకు తగిన మద్దతు ధర ఇచ్చినా సరిపోతుంది. కానీ, ఇవేమీ చేయకుండా రకరకాలైన ఇబ్బందులకు గురి చేస్తున్నారు. ఇవన్నీ గమనిస్తున్న రైతులు కూడా చైతన్యవంతులై ఉద్యమాలు చేస్తున్నారు. దీనికి ప్రత్యక్ష ఉదాహరణ పంజాబ్ రైతులు చేస్తున్న ఉద్యమం. అభ్యుదయ భావాలున్న ప్రతీకవీ ఈ ఉద్యమాన్ని సమర్థిస్తూ కవిత్వం రాశాడు. దీన్ని సమర్థిస్తూ కవి 'ఆది' కూడా అభివ్యక్తి వైవిధ్యంతో కొన్ని నానీలు రాశాడు.

''రైతు ట్రాక్టర్లు/ఢిల్లీ చేరుకున్నాయి/చలికి/వణుకుమొదలైంది.'' పంజాబ్ లో మొదలైన రైతు ఉద్యమం ఢిల్లీకి చేరిందనడంలో రాష్ట్రాల్లోని

సమస్య రాజధానికి చేరిందని, దానితో పాలకులలో ఆందోళన ఎక్కువైందనేది కవి చక్కగా అభివ్యక్తీకరించాడు. కేవలం పంజాబ్ రైతులు మాత్రమే కాదు; భారతదేశ వ్యాప్తంగా ఉన్న రైతుల పట్ల వాళ్ళ జీవితాన్ని తన నానీల కవిత్వంలో పలికించాడు. రైతు తాను ఉదయం మేల్కొన్నది మొదలు తన జీవితాన్ని ఎలా చాలింపజేయవలసి వస్తుందో అక్కడి వరకు అనేకమైనటువంటి సంఘటనలకు 'ఆది' కవిత్వమయ్యాడు. చలి, వణుకు వంటి పదాలతో మనసుకు తాకే పద చిత్రంలో(vivid imagery) చూపించాడు. వ్యతిరేకత (Contrast) అనుకూలతలను ఒకే కవితలో భిన్న సంఘర్షణల రూపంలో వర్ణించడానికి కవి గొప్ప అభివ్యక్తిని ఎన్నుకున్నాడు. రైతులు కష్టాలతో, చలిని తట్టుకొని పోరాడుతున్నారు. అయితే పాలకులు చలి వల్ల కాదు, ఉద్యమం వల్ల వణుకుతున్నారు. సామాజిక, రాజకీయ సందేశాన్ని చూస్తే, రైతుల ఉద్యమం ఎంత బలంగా, ప్రభావవంతంగా ఉందో ఈ నాలుగు పంక్తుల్లో కవి తెలిపాడు. ఉద్యమం ప్రభుత్వాన్ని ప్రశ్నించగల సామర్థ్యాన్ని, శక్తిని కలిగి ఉందని సూచించాడు.

**ఉదయాన్నే కోడి కూత వేసింది రైతు దినచర్య కళ్ళల్లో మెదిలింది**

దీన్ని మనోవైజ్ఞానిక దృక్పథంతో పరిశీలిస్తే అంతఃప్రమత్తత (Anxiety)ని ఒక్కనానీలోనే అద్భుతంగా కవి ఆది నారాయణ కవిత్వం చేశాడు. ఢిల్లీకి రైతుల ఉద్యమం చేరడం అంటే కేవలం శారీరక ప్రయాణం మాత్రమే కాదు; అది ఒక మానసిక పోరాటం కూడా. రైతుల చలనం వల్ల పాలకులలో కలిగిన భయాన్ని (Psychological Fear) "చలికివణుకుమొదలైంది" అని వ్యక్తీకరించాడు. ఇది పాలకులలో ఉన్న అణచివేత (Repression) బయటపడడం వంటి అభివ్యక్తి.

'ఉదయాన్నే/కోడి కూత వేసింది/ రైతు దినచర్య/కళ్ళల్లో మెదిలింది' అంత కష్టపడినా రైతులను అనేక ఇబ్బందులకు గురి చేస్తున్నారు. వాటి నుండి తప్పించుకోలేని పరిస్థితులు కల్పిస్తున్నారు. రైతుల మానసిక సంఘర్షణ (Psychological Conflict) మరొక నానీలో ఎలా అభివ్యక్తీకరించాడో చూడండి.రైతు తన జీవితాన్ని పద్మవ్యూహంలో చిక్కుకున్న అభిమన్యుడిగా భావించడం అతని ఆత్మ విశ్లేషణ (Self-Analysis).అతను సమస్యల

వాన జోరుగా కురిసింది పంట చూసి రైతు గుండె గండిపడ్డది

చుట్టూ పాకుతున్నాడు కానీ బయటపడలేక పోతున్నాడు.ఇది రైతులో ఉన్న మానసిక బంధనం (Mental Entrapment), అతని లోపలి స్వేచ్ఛ కోసం చేసే ప్రయత్నాలను ప్రతిబింబిస్తుంది. ''నేటి భారతంలో / దళారుల పద్మవ్యూహం/ రైతే/అభిమన్యుడు.''ఎన్ని నష్టాలు వచ్చినా, కష్టాలు ఎదురైనా వ్యవసాయాన్నే నమ్ముకుంటున్నారు. ఇంకా చెప్పాలంటే కవి భావించినట్లు...'పంటను/రైతు నీటితో కాదు/ కన్నీటితో/ పండిస్తున్నాడు' పంట మోసం చేయట్లేదు. వ్యవసాయ పొలమూ మోసగించడం లేదు. అందుకనే కవి 'వరి పంట/ వంగి నేలను ముద్దాడింది/ రైతు కష్టం/యవ్వనమైంది'' అనివర్ణించాడు. అంతే కాదు...''రైతు నేలను/ చెమటతో తడిపాడు/ ప్రపంచం /కడుపు నిండిపోయింది' అని కూడా కవి గుర్తించమంటున్నాడు. కానీ కొన్ని సార్లు ప్రకృతి సృష్టించే బీభత్సం రైతుల్ని అయోమయంలో పడేస్తుంది. అయినా సరే వాటిని తట్టుకొని కూడా నిలబడతారు. జనాన్ని నిలబెడతారంటూ 'రైతులు/ కనిపించే దేవుళ్ళు/తాము వస్తుండె/ప్రపంచం కడుపు నింపుతారు' అన్నాడు కవి. రైతు తనను దేవుడిగా భావించడం అతని ఆత్మబలాన్ని (Self-Esteem) పెంచే ప్రయత్నం. రైతు లోపల అతనికి ఉన్న శూన్యత (Emptiness) ను కూడా ఇక్కడ ప్రతిబింబిస్తుంది. ఇతను తన జీవితం ఇతరులకు సమర్పించి, తన అవసరాలను అణచిపెడుతున్నాడు.

'వాన/జోరుగా కురిసింది/పంట చూసి/రైతు గుండె గండిపడ్డది'. ఈ నానీలో ప్రకృతి పరిణామాలతో రైతు మనస్సు ఎంతగా ప్రభావితమవుతుందో తెలుస్తుంది.వర్షం కురవడం అంటే ప్రకృతిలో తటస్థమైన ఒక సంఘటన; కానీ రైతు దానిని తనపై తట్టిన ఒక దెబ్బగా భావించడం అతని మానసిక దుఃఖాన్ని (Mental Agony) చూపిస్తుంది. ఇలాంటి స్థితిని భావోద్వేగ అస్థిరత (Emotional Instability) అంటారు. ఇదొక పార్శ్వమైతే మధ్య దళారీలు చేసే మోసాల వల్ల జరుగుతున్నదేమిటో చెప్తూ...'పంటలకు /గిరాకీ ఎక్కువే/రైతులకే/గిట్టుబాటు తక్కువ' అన్నాడు కవి. మార్కెట్లో పంటలకు డిమాండ్ ఉన్నా, రైతులకు ఆర్థిక ప్రయోజనం లేకపోవడం అతనిలో

అపరాధ భావనను తెలియజేస్తుంది. రైతు తన కష్టం వ్యర్థమైందని భావిస్తూ ఉన్న మానసిక సంఘర్షణ (Cognitive Dissonance) అభివ్యక్తమయ్యింది. రైతు మానసిక స్థితిలోని అంతఃప్రమత్తత (Anxiety), ఏదో ఒక అపరాధ భావన (Guilt)ను ఒక నానీలో వర్ణించడం కవి లోతైన భావాన్ని అభివ్యక్తీకరించడాన్ని తెలియజేస్తుంది. అలాంటి పరిస్థితుల్లోనే ...'ఎక్కడ చూసినా / రైతు ఆత్మహత్యలే / కలియుగం కాదిది / ఆకలి యుగం'' అనే వాస్తవాన్ని 'రైతు / మట్టితో సహజీవనం / మరణించాక / మట్టి దుప్పటి తోడని కావచ్చు'అని ముగిస్తాడు. రైతు జీవితంలో మట్టితోనే అతనికి ఆశ్రయం, జీవనాధారం. మరణించిన తర్వాత కూడా మట్టితోనే ఉండిపోవడం అనేది రైతు నిస్సహాయ మరణాన్ని తారాస్థాయిలో అభివ్యక్తీకరించాడు కవి.



**పాలకుల నిర్లక్ష్యం, దళారుల మోసాలు, ప్రకృతి చర్యలు... ఇవన్నీ రైతు జీవితంలో పెద్ద సవాళ్లుగా మారాయి.**



పొద్దుటే లేచి రాత్రి వరకు మాత్రమే కాదు, రాత్రిపూట కూడా వ్యవసాయంతోటే తన జీవితాన్ని ముడిపెట్టుకున్న రైతు జీవితాన్ని చదివితే ఆ కష్టాలన్నీ మనకు ఈ నానీల్లో కనిపిస్తాయి. ఈ కవి రైతుకు సంబంధించిన సమస్యలను, జీవితాన్ని అక్కడక్కడ కొన్ని నానీలుగా వర్ణించాడు. వాటిని ఒకక్రమంలో పెడితే నానీల రైతు కావ్యం అనిపిస్తుంది.

పంజాబ్‌లో మొదలైన రైతు ఉద్యమం రాజధాని ఢిల్లీకి చేరుకోవడం వల్ల ఇది కేవలం ఒక ప్రాంతీయ సమస్య కాకుండా, జాతీయ స్థాయికి ఎదిగిందని కవి తెలియజేస్తున్నాడు. ట్రాక్టర్లు అనే పదం సాంకేతికంగా రైతుల శక్తిని, వారి ఉద్యమ పటిమను (strength and resilience) సూచిస్తుంది. 'చలికి వణుకుమొదలైంది' ఇక్కడ చలి అనే పదానికి రెండు రకాల అర్థాలు ఉన్నాయి. భౌతిక అర్థంలో ఢిల్లీలోని హిమ పాతాలను, సేద తిరిగిన వాతావరణాన్నిసూచిస్తుంది. రూపకార్థంలో రైతు ఉద్యమం వల్ల పాలకుల్లో, అధికార యంత్రాంగంలో ఉత్కంఠ, భయాన్నిసూచిస్తుంది.'వణుకుమొదలైంది' అనే పద ప్రయోగం చాలా వ్యంగ్యంగా, గొప్ప భావ ప్రాప్తిని కలిగిస్తుంది. ఉద్యమం ప్రభావంతో కేవలం వాతావరణం మాత్రమే కాదు, పాలకుల హృదయాల్లో కూడా వణుకుపుడుతుందనే సందేశాన్ని అందిస్తుంది. ఇది ఒక

రకంగా శక్తిమంతమైన రాజకీయ వ్యాఖ్యానంగా కూడా కనిపిస్తుంది.




రైతుల జీవితం, వారి సమస్యలు, మరియు ఉద్యమాలను ఎంతో భావోద్వేగంతో, నిజాయితీగా వివరిస్తూ 'ఆది' రాసిన నానీలు హృదయాన్ని తాకుతున్నాయి. ఆది తన కవిత్వం నానీలనే ప్రక్రియను ఎంతో గొప్ప సాధనం వాడుకున్నాడో స్పష్టంగా తెలుస్తోంది. పాలకుల నిర్లక్ష్యం, దళారుల మోసాలు, ప్రకృతి చర్యలు...ఇవన్నీ రైతు జీవితంలో పెద్ద సవాళ్లుగా మారాయి. 'అభిమన్యుడు'తో పోల్చడం చాలా తగిన సూచన. వ్యవసాయం ఒక యుద్ధ రంగం అయితే, రైతు ప్రతిరోజూ ఒక వీరుడిగా ఆ పోరాటం చేస్తున్నాడు. కవి 'ఆది' నానీల ద్వారా రైతు కష్టాలను మాత్రమే కాదు, వారి మహోన్నతతను, జీవితాన్ని పంటతో ముడిపెట్టుకున్న అనుబంధాన్ని, వారి దారుణ పరిస్థితులను బలంగా ప్రతిబింబించాడు.

**కరోనా నేర్పిన పాఠాలు:**

ప్రపంచ వ్యాప్తంగా ఈ శతాబ్దంలో వచ్చిన ఒక మహమ్మారి కరోనా. కరోనా జీవితాల్ని పునర్ మూల్యాంకనం చేసుకునేలా చేసింది. ప్రకృతికి మానవుడికి ఉన్న మధ్య ఉన్న అనుబంధాన్ని వివరించింది. జీవితమెంత క్షణబంగురమో చూపించింది. కొంతమంది కథలు, మరి కొంతమంది నవలలు రాశారు. కవిత్వం అయితే చెప్పలేనంతగా వచ్చింది. ఈ కవి కూడా కరోనా ప్రభావంతో కొన్ని నానీలు రాశాడు. 'కరోనాతో / విద్యాసంస్థల బంద్/ పేరెంట్స్ కు/ ప్రశాంతత బంద్' అని ఒక చమత్కారంగా కుటుంబాలు ఎలా ఉన్నాయో చెప్పాడు కవి. మరొక నానీలో 'రైలు బోగీల్లా/ ఎంతటి చక్కటి లైను/ క్యూ పద్ధతి /కరోనా నేర్పింది'. పౌరుడు స్పందించవలసినప్పుడు మాట్లాడకుండా ఉండే ఒక జడత్వ స్థితిని కవి ఇలా వర్ణిస్తున్నాడు. 'మళ్లీ దేశమంతా / లాక్ డౌన్ నా? / మనం / మాస్కులు ఎప్పుడు తీశామని' అని మామూలు పదాలతో రాసిన ఈ నానీని విశ్లేషించుకుంటే అనేక వాస్తవాలు బయటకొస్తాయి. ఈ నానీ కేవలం కొవిడ్-19కు సంబంధించినది మాత్రమే కాదు. అది మనిషి ఆంతర్యంలో ఉన్న భయాలను, సమాజంలో వ్యాపించిన కపటత్వాన్ని, వ్యక్తుల నిజస్వరూపానికి అడ్డుకట్ట వేసిన మాస్కులను ప్రతిబింబిస్తుంది. మహమ్మారి కారణంగా

వచ్చిన నిర్బంధం, రాజ్య పాలనలో మార్పులు, ప్రజలపై పడిన భారం ఈ నానీలో పరోక్షంగా ప్రతిబింబించాయి. కరోనాతో వచ్చిన లాక్ డౌన్ కేవలం ఆర్థిక, సామాజిక దృక్కోణంలోనే కాదు, దశాబ్దాలుగా మన సమాజం ఒక లాక్ డౌన్ లోనేఉంది. పేదరికం, ఆర్థిక అసమానతలు, అణచివేత, దళారుల ప్రభావం మన సమాజాన్ని నిరంతరలాక్‌డౌన్‌లోనే ఉంచాయి.అది సామాజిక లాక్ డౌన్. ఈ నానీలో దీన్ని స్పృశిస్తున్నాడు కవి.

**కవిత్వం
కవికి జీవనది
బొంతను,
ముంతను
భాగస్వాములను
చేస్తుంది**

మాస్క్ అనేది వ్యక్తి నిజమైన స్వరూపాన్ని దాచి పెట్టే మాస్క్. నిజాలను దాచడం, మన అసమర్థతలను మరుగు చేయడం, సమాజంలో ఆమోదం పొందడానికి మనం ధరించే పాత్రలను ఈ'మాస్క్' ప్రతీకాత్మకంగా చెబుతుంది. ఒక్కోసారి సమాజంలో సమస్యల గురించి పోరాడేవాళ్లు కొంతమందైతే దాని ఫలితాలను పొందేవాళ్ళు ఇంకొకరవుతుంటారని మరొక నానీలో చెప్పాడు. సమస్యల పరిష్కారానికి అందరూ స్పందించకుండా, నిర్వీర్యంగా, మౌనంగా ఉండడాన్ని నిరసిస్తున్నాడు కవి.

**కవి- కవిత్వ రహస్యాలు:**

కవులు కవిత్వం చెబుతూనే, తమ అనుభవాలు కవిత్వం ఎలాగయ్యాయో, ఏది కవిత్వమవుతుందో చెప్పే ప్రయత్నం కూడా చేస్తారు. ఏ కవి కూడా దానికి అతీతం కాదు. పైగా ఈ కవి విశ్వవిద్యాలయంలో పరిశోధన కూడా చేశాడు. కాబట్టి సాహిత్యాన్ని ఒక క్రమ పద్ధతిలో అధ్యయనం చేసిన వ్యక్తి. అందువల్ల కూడా కావ్యశాస్త్ర అంశాలు ముఖ్యమని భావించి బహుశా వాటిని కూడా కవితీకరించాడు. 'కవిత్వం/ కవికి జీవనది/ బొంతను, ముంతను/ భాగస్వాములను చేస్తుంది' కవిత్వం అనేది కవికి జీవన ప్రవాహం, జీవనదిగా అభివర్ణించడం సౌందర్యాత్మకతలోని ప్రధాన అంకురం. నది నిరంతరం ప్రవహిస్తుందని, అలాగే కవిత్వం కూడా కవి మనసులో ఎప్పటికప్పుడు నూతన భావాలను స్రవిస్తుందనే దాన్ని సూచిస్తున్నాడు కవి.

'మనసును/ దండంపై ఆరేశా/ కన్నీటి బొట్లు /కవితలైరాలాయి' "మనసు" అనేది భావోద్వేగాల పుట్ట. దాన్ని "దండెంపై ఆరేయడం" అంటే, మనసును బహిర్గత పరచడం, తన అంతరంగాన్ని బయటపెట్టడం. అది

తన మనసు బరువును, బాధను బయటకు చూపిస్తున్నాడని అర్థం. కవి తనలోని బాధనైనా, సంతోషాన్నైనా బహిర్గతపరిచినప్పుడు మాత్రమే ఒక రిలీఫ్ పొందినట్లు భావిస్తాడు. మనసు భావోద్వేగాలకు కేంద్రం. అది అమూర్తపదార్థం. బయటకు కనబడదు. కానీ, దాని స్పందన మనిషి ముఖంలో కనిపిస్తుంది. 'కన్నీటి బిందువులే కవిత్వంగా మారాయి.'కవిత్వం అనేది కేవలం పదాల ప్రకంపనం కాదు; అది అనుభూతుల ప్రవాహం. కన్నీటి తడి వలన కవిత్వం పుట్టుకొస్తోంది. ఇది "ఆర్ట్ ఫ్రం అగోనీ" (Art from Agony) అనే భావాన్ని సూచిస్తోంది.

పండ్లు బాగా
మాగితేనే
రుచికరం
కవితలు కూడా
అంతే మరి

'పండ్లు బాగా/ మాగితేనే రుచికరం/ కవితలు కూడా /అంతే మరి' దీనిలో ఉపమానం (Simile) పండ్లు మాగడం, కవిత్వ పరిపక్వత మధ్య అందమైన పోలిక. రూపకం (Metaphor)గా పండ్లు, కవిత్వానికి ప్రతీకగా చూపించడం. కవిత్వం అనేది కేవలం పదాల ప్రదర్శన కాదు; అది అనుభూతుల, అనుభవాల, లోతైన ఆలోచనల పరిపక్వత అనే భావగాఢతను తెలియజేస్తుందీ పోలిక.

'కవి మిత్రులు/ సాయంత్రం మాట్లాడేవారు/ ప్రతి మాట కవితై విరబూసేది' కవిత్వం వర్ణించడమనేది నిరంతర సాధనగా, లోక పరిశీలనతో కూడినదిగా, దీనికి తోడు సాహిత్య సువాసన ఉన్నవాళ్ళు తన మిత్రులు కావడం కూడా మంచి కవిత్వం పుట్టడానికి కారణమంటున్నాడు కవి. 'కన్నీటి చుక్కకొక/ కవిత రాలిపడ్తుంది/ హృదయాన్ని/ కట్టిపడేస్తుంది' నిజమైన కవిత్వం హృదయాన్ని కదిలించాలి. తన జీవితంలోని సంఘటనగానీ, సమాజంలో జరిగిన లేదా చూసిన దానికి కవి స్పందించినా కవిత్వానుభవం సాధారణీకరింపబడాలి. అలాంటి అనుభవంలోకి వచ్చిన వాస్తవం కవిత్వమైతే ప్రతి ఒక్కరినీ కదిలించగలుగుతుంది. కవిత్వం ఎలా ఉండాలో, కవిత్వం రాసే ప్రక్రియ ఎలా ఉండాలో దీనిలో చెప్తున్నాడు కవి. కవిత్వం హఠాత్తుగా రాసిన పదబంధాల సమాహారంకాదు. అది ఒక సాధన, ఒక లోతైన ఆత్మీయతకు ప్రతీక. 'కవికి మరోకవి/ అభిమాని/ కవిత్వంలో గాఢత/ గట్టిదైనప్పుడు' కవిత్వంలోని రహస్యాలు తెలిసినవాళ్ళు ఆ కవికి అభిమానులుగా



**మనసును దండంపై ఆరేశా కన్నీటి బొట్లు కవితలేరాలాయి**



మారిపోతారని అనడం ద్వారా నిజమైన కవి కవిత్వానికే విలువను ఇచ్చి, ఆ కవిత్వం రాసిన కవిని అభిమానిస్తాడు. అతని లేదా ఆమె కులం, మతం, ప్రాంతం, భాష వంటి భేదాలేమీ లేకుండా అభిమానులుగా మార్చుకోగలుగుతుంది. అది గాఢమైన ముద్రవేయగలిగే కవికి మాత్రమే సాధ్యమని గుర్తించిన ఈ కవి తన కవిత్వసాధనను ఎలా అభ్యసించాలో కూడా గుర్తెరిగినవాడుగా కనిపిస్తున్నాడు. కవి తన కవిత్వం ద్వారా చీకటిలోని వెలుగును మాత్రమే కాకుండా, వెలుగులోని చీకటిని కూడా ఆవిష్కరిస్తాడనే భావనతో ఈ కింది నానీ వర్ణించాడు కవి. 'కవిత్వం / నిశాచర జీవి/ సూర్య చంద్రులకు కూడా / టార్చి వేసి చూస్తుంది' బహిర్గతంగా కనిపించని అంతరంగాన్ని కూడా పట్టుకోగలిగిన శక్తి కవిత్వానికి ఉందనడంలో 'రవిగాంచనిది కవిగాంచును' అనే లోకోక్తికి నానీరూపంగా కనిపిస్తుంది. ఒక చమత్కారం ఉన్న నానీ. కవి గొప్పతనాన్ని చెప్తూనే, మనిషి అంతరంగాన్ని ఆవిష్కరించేది మంచికవిత్వమనీ, అది కవికి మాత్రమేసాధ్యమంటున్నాడు కవి. నానీకి సహజంగా ఉండే చమత్కారం, సునిశితమైన వ్యంగ్యం ఈ నానీలో కనిపిస్తోంది. ఇంకా కవి-కవిత్వం గురించి లోతైన చర్చ చేయగలిగే నానీలు చాలా రాశాడు. 'చీకటి/ అందర్నీ నిద్రపుచ్చుతుంది/ కవిత్వం/చీకటిని మేల్కొల్పుతుంది' అని కవిత్వం జన చైతన్య కేంద్రంగా ఉండాలంటాడు కవి. సూర్యుడు వెలుగునిచ్చినా, ప్రశాంతమైన స్థితిని వర్ణించడానికి చంద్రుణ్ణి ఉపమానంగా చాలామంది వర్ణిస్తుంటారు. ఈ కవి కూడా 'విశ్వంలో/ కవీ చంద్రుడు ఒక్కడే/ వెలుగు చైతన్యానికై/ వెంపర్లాలాడుతాడు' అని వర్ణించాడు. అజ్ఞానం నుండి విజ్ఞానం వైపు ప్రజలను చైతన్యవంతం చేయాల్సిన బాధ్యత కూడా కవికి ఉంటుందనడం ద్వారా సాహిత్య ప్రయోజనాన్నీ, కవి సామాజిక బాధ్యతను తెలియజేస్తున్నాడు. కవిని వర్ణిస్తూ చెప్పిన మరికొన్ని నానీలు ఈ పుస్తకంలో ఉన్నాయి. 'పేదవాడినై/ కొందర్కి దూరమయ్యా/ కవితలు/ అందర్నీ కలిపాయి' 'కవిత్వానికి/ రాత్రి పగలు ఉండవు/ చీకట్లో పుట్టి /పగల్ను చుట్టేస్తుంది' నానీలు ఎటువంటివో చెబుతూ 'నానీలు/ జీవన సూక్తులు/హృదయాన్ని/ కదిలించే బాణీలు' అనడం ద్వారా నానీల

స్వభావాన్ని చెప్పడమే కాకుండా తన నానీలు కూడా అటువంటివేనని ధ్వనింపజేస్తున్నాడు కవి.




మనం ఆధునిక సమాజంలో ఉన్నామా? ప్రాచీనకాలం నాటి భూస్వామ్య వ్యవస్థలోనే బతుకుతున్నామా? రాచరిక స్వభావాన్ని, భూస్వామ్య భావజాలాన్ని మూఢవిశ్వాసాల్ని వదల్లేకుండా ద్రవాధునిక సమాజంలో జీవిస్తున్నామా? ఈ ప్రశ్నలన్నీ సమాజంలో కనిపిస్తున్న మానవ జీవన విధానాన్ని బట్టి అనిపిస్తోంది. ఒకవైపు నగర జీవనం, శాస్త్రీయత విస్తరిస్తూనే, ఆ పక్కనే గ్రామీణ జానపద స్వభావం మూఢవిశ్వాసాలు సమాంతరంగానే పయనిస్తున్నాయి. ఈ కవి ఈ విషయాలపై ఒక నానీ రాస్తూ ' సైంటిస్టులు / సైన్స్ డే లో / ప్రసంగాల హోరు / శివరాత్రికి / జాగరణ జోరు' అని ఈ సమాజాన్ని మనం ఎలా అర్థం చేసుకోవాలో ఆలోచించమంటున్నాడు. ఇలాంటి నానీలెన్నో డా.గిన్నారపు ఆదినారాయణ తన 'నానీల సుగంధం' నిండా పరుచుకున్నాయి. ఈ మధ్య వచ్చిన నానీల కవితా సంపుటాల్లో ఇది తప్పకుండా చదవాల్సిన ఒక పుస్తకం.

ఒక కావ్యాన్ని చదివినప్పుడు దానిలోని కథ కవిత్వమైన పాఠకుడికి శాశ్వతంగా నిలిచిపోయేలా చేస్తుంది. ఆ భావుకత, అభివ్యక్తి కంటే కథ డామినేట్ చేస్తుంది. కానీ, వచనకవిత్వంలో సాధారణంగా కథ ఉండదు.కవి సంవేదన ఉంటుంది. కవి ప్రతిస్పందన వినిపిస్తుంది. కవి హృదయ స్పందన ముఖ్యమవుతుంది. కవిత్వం సాధారణీకరణ పొందినప్పుడు ఆ కవిత్వంలోని వస్తువు పాఠకుడు కూడా తానే అవుతాడు. అది వచనకవిత్వంలోను,నానీలలోను ఉండే ఒక గుణం. వీటిని చదివిన తర్వాత పాఠకుడికి కలిగే శాశ్వతత్వం లేదా గాఢతను పాఠకుల స్థాయిని బట్టి ఉంటుంది. కవి ప్రతిభావంతుడైనప్పుడు గాఢమైన ముద్రవేయగలిగే నానీలు వర్ణించగలుగుతారు. అవి పాఠకుల స్థాయీ భేదాలను బట్టి వాళ్ళలో గాఢానుభూతి కలుగుతుంది. తెలుగు కవిత్వంలో నానీల గాఢతపై కొన్ని విమర్శలు ఉన్నప్పటికీ, అవి కేవలం పత్రికల్లో స్పేష్ ఫిల్లింగ్ గా మాత్రమే చూడనవసరం లేదనీ, ప్రధాన సాహితీ స్రవంతిలో వాటికి కూడా ముఖ్యమైన స్థానమే లభిస్తుందని చెప్పడానికి ఈ 'నానీల సుగంధం'

నానీల కవితాసంపుటి కొంతవరకు ఉపయోగపడుతుందని చెప్పొచ్చు. డా.ఎన్.గోపి గారు రాసిన నానీలు మాత్రమే కాకుండా, ఆ ప్రక్రియను అందుకొని నానీలు రచించిన వారి గ్రంథాన్ని పరిశీలిస్తే బాగుంటుందనే ఆలోచనతో ఈ వ్యాసాన్ని రాసేప్రయత్నం చేశాను. ఆధునిక వచన కవిత్వం ఒక మానసిక యాత్ర వంటిది. కవి చూపించే దృశ్యాల్ని, భావాల్ని పాఠకుడు కూడా అనుభవిస్తే కవిత్వాన్ని పూర్తిగా ఆస్వాదించగలుగుతారు. ఒక్కమాటతో చెప్పాలంటే కవి చూసే చూపుతో చూడడం, కవి గుండెతో వినడం, కవి కలంతో ఆలోచించడం అవసరం. అవే లక్షణాలు నానీలను అర్థం చేసుకోవడంలోను ఉంటాయి. ఇది తెలిస్తే నానీలను ఆస్వాదించగలుగుతాం.





"నానీలు రాయడం పైపైన చూసినప్పుడు తేలికగా కనిపిస్తుంది కానీ నిజానికది చాలా కష్టమని నా అభిప్రాయం. అక్షర సంపదంతా మన అరచేతుల్లో పుష్కలంగా ఉండి, దానినంతా వినియోగించుకోగల స్వేచ్ఛ ఉన్నప్పుడు మనం కవితా సౌధాలను ఎంతెత్తునైనా కట్టవచ్చు. కానీ ఇక్కడ సంపద పరిమితం. ఈ పరిమితాక్షర సంపదతో అపరిమితమైన భావసంపన్నులు కావాలి కవులు"

– ఓల్గా

# రాణి నానీ

బి. రాణి లీలావతి
✆ 8500100829



పదును తేలింది
నిఖార్సైన వ్యక్తిత్వం
బ్రతుకు బాధల
కొలిమిలో !

కాలం చేతి
పేముబెత్తం దెబ్బలకు
తేలిన వాతలే
ఈ కన్నీటి కష్టాలు !

చిరునవ్వు
మొగ్గ తొడిగింది
కక్షలు,కార్పణ్యాలను
కాలంతోనే పాతేస్తూ !

పగ సెగలపై
ప్రేమ చినుకులు కురిపించి
ద్వేషాన్ని గెల్చింది
దయ !

అంతస్థుల తూనికలో
తూగలేక తేలికై
తేలిపోయింది
స్నేహ బంధం !

హోదాల, విభేదాల
నలిగిన స్నేహం
రంగులు మారుస్తుంది
ఊసరవెల్లై



# తెలుగు కవిత్వ చరిత్రలో ఇరవై ఎనిమిదేళ్ల నానీల ప్రస్థానం

డాక్టర్ ఎస్.రఘు
9848208533

ఆధునిక కవిత్వం అనే మాట ఒక కొత్త పాతల మేలు కలయిక గల వైవిధ్య పదబంధంగా స్వీకరించాలి. ఆధునిక కవిత్వం మొదటిదశలో వస్తువు, అభివ్యక్తుల మేలుకలయికే సాహిత్యాన్ని కొత్త మలుపులోకి తీసుకెళ్ళింది. రెండవదశలో 80వ దశకం విభిన్న వైవిధ్యాన్ని సంతరించుకుని వినూత్న శిల్ప ప్రయోగాలతో, వాదాలతో అత్యాధునికతలోకి ప్రయాణించింది. బలమైన తాత్త్విక సిద్ధాంత పునాదుల్లోంచి ఉద్భవించిన ఉద్యమచైతన్యం, అస్తిత్వపోరాటం, వైయక్తిక వేదనా వాదాల ప్రభావాలు, రూప విన్యాసాలతో కవిత్వం ప్రక్రియాపరంగా కొత్తదారులను అన్వేషించింది. ఈ అన్వేషణలో లఘుకవితా ప్రక్రియలకు ఒక ప్రత్యేకమైన స్థానం ఉంది. అలాంటి విశిష్టమైన స్థాయిని పొందిన కవితా ప్రక్రియే 'నానీలు'. ఆధునిక కవిత్వంలో విశిష్టస్థానాన్ని సంపాదించుకున్న డా.ఎన్.గోపి తన సృజనాత్మక పరిణామక్రమంలో భాగంగా నానీల ప్రక్రియకు సృష్టికర్తయ్యారు. వర్తమాన తెలుగు కవిత్వంలో నానీలు ఎటువంటి ఆర్భాటాలు లేకుండా ఉద్భవించి, సహజంగా ఎదిగి, ఉద్యమస్థాయిలో వ్యాప్తి చెందాయి. "కొన్ని ముఖ్యమైన పరిణామాలు గుర్తించలేనంత నిశ్శబ్దంగా జరిగి స్థిరపడతాయి. తెలుగు సాహిత్యంలో నానీలు ఒక ప్రక్రియగా స్థిరపడటం అటువంటిదే" అని ప్రముఖ విమర్శకులు ఎన్. వేణుగోపాల్ గుర్తించారు. ఏదో ఒక రాయి విసిరినట్టుగా కాకుండా వడిసెలలో పెట్టి విసిరిన రాయి లక్ష్యాన్ని ఛేదించినట్టుగా నానీలు రూపుదిద్దుకున్నాయి. ప్రధాన వచన కవితా స్రవంతిలో భాగంగా సామూహిక సాంస్కృతిక అభివ్యక్తి చైతన్యానికి ప్రతీకగా నానీలు పరిణామం చెందాయి. ప్రాముఖ్యం గల కవిత్వ ఉపనదిలా ప్రవహిస్తూ, సాహిత్య జీవనదిలో నానీల ప్రక్రియ నిరంతరం చిట్టిపడవలా కదులుతూ ఆకర్షిస్తుంది.

తెలుగు కవిత్వంలో నానీలు ఆవిర్భావం యాదృచ్ఛికంగా జరిగిన సృజనాత్మక క్రియ. ఎన్. గోపిగారి ఉద్వేగభరితమైన స్థితిలోని నిరంతర సంవేదనాత్మక జీవన దుఃఖంలోంచి అలవోకగా మొదలైన నాలుగు పాదాలు 'నానీలు' అనే నామకరణం చేసుకున్నాయి. 1997 'వార్త' దినపత్రికలో 20 వారాలు సీరియల్ గా వెలువడి పాఠకాదరణను పొందాయి. 1998లో నానీలు గ్రంథరూపంలోకి వచ్చాక ఈ ప్రక్రియ కొత్త కవులనూ, పాత కవులనూ అమితంగా ఆకర్షించింది. ఆ గ్రంథంలోని 'నానీల్లోకి' అనే స్వీయ పీఠిక నానీల నిర్మాణాన్ని, అంతస్సారాన్ని స్పష్టంగా ఆవిష్కరించింది. జనవరి 2012 లో 'సత్కృతి' పత్రిక లో నేను రాసినట్లు "మానవ ప్రకృతిలోని భిన్న ప్రవృత్తులను ఆకళింపు చేసుకోవాలని చేసిన ప్రయత్నం, జీవితాన్ని అనుభవాల సంపుటిగా భావించి, అది దుఃఖించటం కోసమే కాదని, దానిని జయించటం కోసం కూడా అని తలచి చేసిన ప్రయాణం, అంతస్సీమల్లోకి వెళ్ళి అనుభూతుల్లో తడిసి వచ్చి సమాజీకరణం చెందిన సన్నివేశం. మనిషిమీద అపారమైన ప్రేమతో నిత్య సత్యాన్వేషణాపరత్వంతో, ఉపదేశకంఠంతో కాక అనురాగస్పర్శతో చెప్పాలనీ" గోపి గారి తాపత్రయం. సరళమైన నానీల కవితా తాత్త్వికత సహృదయులందరిని కదిలించింది; అనుసరణ నానీలు వచ్చాయి. వర్ధమాన కవుల్లో రాయాలనే సృజనావేశం మొదలయింది.

**నాలుగుపాదాల నానీలో మొదటి రెండు పాదాల్లో ఒక భావాంశం, చివరి రెండు పాదాల్లో మరొక భావాంశం ఉంటాయి.**

ప్రజాకవి వేమన పద్యనిర్మాణ పథకాన్ని, వస్తుతత్వాన్ని ఆవాహన చేసుకున్న పరిశోధక కవి డా.ఎన్. గోపి. తన కొత్త కవితా ప్రక్రియైన నానీల నిర్మాణ వ్యూహాన్ని స్పష్టంగా వివరించడం నానీల వ్యాప్తికి దోహదపడింది. నానీ అతిబిగింపూ, అనవసరమైన సడలింపూ లేకుండా రూపొందించుకున్న 20–25 అక్షరాల విస్తీర్ణం గల చట్రం. 20 అక్షరాలకు తగ్గకుండా 25 అక్షరాలకు మించకుండా నాలుగు పాదాల నియమంతో నానీ కదులుతుంది. వచన కవితల్లో లాగే ఈ విభజనకు హేతుబద్ధత ఏమీ లేదు. అయితే నిర్మాణం దృష్ట్యా వీటిలో ఒక పద్ధతి గమనింపవచ్చు. నాలుగుపాదాల నానీలో మొదటి రెండు పాదాల్లో ఒక భావాంశం, చివరి రెండు పాదాల్లో మరొక భావాంశం ఉంటాయి.

మొదటి దానికి రెండోది సమర్థకంగా వుంటుంది.

"కుండ ముక్కలైందా/ కుమిలిపోకు/ మట్టి మరోరూపం కోసం/ సిద్ధమౌతుంది" దీనిలో మొదటి భావాంశానికి రెండో భావాంశం సమర్థకంగా వుంది. కొత్తగా నానీల రాయాలనుకునేవారికి ఈ వివరణలు నూతనోత్తేజాన్ని కలిగించాయి.

కొత్తగా కవిత్వం రాసేవారి నుండి వచన కవులుగా పేరొందిన సీనియర్ కవులు కూడా నానీలు రాసారు, రాస్తున్నారు.

తెలుగు సాహిత్యచరిత్రలో లఘు కవితా ప్రక్రియలకు లోటేమీ లేదు. వాటికి ప్రత్యేకమైన ఆదరణ, స్థానం వున్నాయి. హాలుని గాథాసప్తశతిని చిన్న పద్యంలో నెమరువేసుకున్నాం. శతకపద్యాలు, ద్విపదలు నిత్యపారాయణంగా గడిచిన రోజులున్నాయి. చాటు పద్యరూపంలోని ముక్తకాల్ని ఇప్పటికీ తలచుకుంటూనే వున్నాం. మినీకవితలు, హైకూలు పాఠకుల్ని ఆకర్షించిన వర్తమాన లఘు కవితా ప్రక్రియలు. వీటన్నింటి మధ్య నానీలు తమ విశిష్ట అస్తిత్వాన్ని స్థిరపరచుకున్నాయి. గత ఇరవై ఎనిమిది సంవత్సరాలలో 550 నానీల కవితా సంపుటాలు వెలువడ్డాయి. అప్పుడప్పుడు నానీలు రాస్తూ పుస్తకరూపంలోకి తీసుకరాని కవులు అసంఖ్యాకం. కొత్తగా కవిత్వం రాసేవారి నుండి వచన కవులుగా పేరొందిన సీనియర్ కవులు కూడా నానీలు రాసారు, రాస్తున్నారు. కవితా వ్యాసంగంలో ఒక అనివార్యమైన సృజనకార్యక్రమంగా నానీల రచన కొనసాగుతోంది. ఆధునిక తెలుగు కవిత్వంలో నానీలు 'ట్రెండ్ సెట్టర్'గా నిలబడ్డాయనే మాట నిస్సందేహంగా అక్షర సత్యం. ఒక ప్రక్రియ ఇంతగా సమకాలీనుల నుండి ఆదరణ పొందడానికి కేవలం గోపిగారు తన పీఠికలో చెప్పిన నిర్మాణాంశాలే కాకుండా మరెన్నో అనుకూలాంశాలు నానీల్లో దాగున్నాయి. ముఖ్యంగా డా.సంగనభట్ల నర్సయ్య గారి 'నానీలు నిర్మాణశిల్పం' వ్యాసం నానీల రూపనిర్మాణ అంశాలను సమగ్రంగా విశ్లేషించిన మినీమేనిఫెస్టో. నానీల నిర్మాణ వైవిధ్యాన్ని పలుకోణాల్లో అవిష్కరించిన తీరు, ఉదాహరించిన నానీలు, నిరూపణలు ప్రక్రియకు ప్రామాణికతను కలిగించాయి. అదే వరుసలో ఎం.నారాయణ శర్మ గారి 'నానీల్లో నూతన నిర్మాణాంశాలు' ("నానీల దశాబ్ది " సంచిక డా.ఎస్ రఘు, 2008 ప్రచురణ) అనే వ్యాసం కూడా




నానీలకున్న మరింత లోతైన కవితా రీతులను చూపించింది. పై వ్యాసాలను ఆధారం చేసుకొని కొన్ని ముఖ్యమైన నానీల నిర్మాణాంశాలను వైవిధ్యాన్ని పరిశీలింపవచ్చు. కొత్తగా నానీలు రాయాలనుకునేవారికి ఎంతో సహాయకారిగా ఈ వ్యాసం నిలుస్తుంది.

ఇప్పటివరకు వేలాదిగా వచ్చిన నానీలను పరిశీలిస్తే నానీల్లోని మౌలికమైన నిర్మాణవ్యూహం స్పష్టమవుతుంది; కొన్ని ముఖ్యమైన పద్ధతులు అర్థమవుతాయి. నానీల నిర్మాణంలో ఒకటి, రెండు పాదాలు మొదటి యూనిట్ గా, మూడు, నాలుగు పాదాలు రెండవ యూనిట్ గా సమర్థక విభాగంగా ఉండే ప్రధానపద్ధతిని నానీల కవులు ఎక్కువగా అనుసరించారు. "కుండ ముక్కలైందా / కుమిలిపోకు..." అని పైన ఉదాహరించిన నానీ ఈ ప్రధానపద్ధతికి దిక్సూచి. మొదటిపాదం ఒక భావాంశంగా మిగతా మూడు పాదాలు సమర్థక భావాంశంగా ఉండటం మరో పద్ధతి.

"ఒంటరితనపు దుఃఖం / ఊరవతలి ఊడల మర్రి / ఊరడించే నేస్తం" (కలువకుంట రామకృష్ణ)

పై నిర్మాణ పద్ధతికి వ్యతిరేకంగా మొదటి మూడు పాదాలు ఒక విషయాన్ని మోసుకెళ్ళి నాల్గవ పాదంలో అర్థవంతంగా ముగియడమనే విభిన్నత కూడా కనిపిస్తుంది.

'మిత్రుడా! / నన్నోసారి గాయపర్చవూ / నేను / కవిత్వం రాయాలి'(కారం శంకర్)

నాలుగు పాదాలు కలిసి ఒక అభివ్యక్తి నిరూపణంగా కూడా నానీ రూపొందుతుంది. ఇది కవి ప్రకటనా పత్రంగా ఇలా ఉంటుంది.

'కేశాలు / తొలగించుకున్నంత / సులభంగా / క్లేశాలు తొలగిపోతాయా!' (డా. మసన చెన్నప్ప)

మొదటి రెండు పాదాలు ఒక యూనిట్ గా నిలబడి మూడు, నాలుగు పాదాలు వేరు వేరు భావాలను వ్యక్తీకరించే యూనిట్లుగా నిలబడిన నానీ కూడా ఉంది.

"నీళ్ళలో చెట్టు నిలకడగా వుంది
నీరు శాంతమా !
నీడ శాంతమా !!
(నాంపల్లి సుజాత)

నానీలోని నాలుగు పాదాలు వేరువేరుగా కనిపిస్తూ ఒకటవ పాదానికి మూడవ పాదం, రెండవ పాదానికి నాలుగవ పాదం సమర్థనీయమైన కవితార్థాన్నిచ్చేవి ఉన్నాయి.

**నానీలు విస్తృతంగా ప్రచలితమవుతున్న తొలిదశలో నానీల ప్రక్రియలపై కొన్ని విమర్శలు, వాదోపవాదాలు వచ్చాయి.**

'అతడు విద్యుత్తు / ఆమె కొవ్వొత్తి / అది యథాతథం / ఇది ద్విగుణీకృతం'(డా॥ ఎం. విజయశ్రీ)

నానీల అభివ్యక్తీకరణలో పాదవిభజనకు సంబంధించిన నిర్మాణాంశాలే కాకుండా మరెన్నోమార్గాలను నానీల కవులు అనుసరించారు. "అనుసరించేవారి సంఖ్య ఎక్కువవుతున్న కొద్దీ వస్తువులు, అనేకానేక నిర్మాణరీతులు పురుడు పోసుకుంటున్నాయి. నిబద్ధంగా ఏర్పడుతున్న ప్రమాణాలు, నైతిక ప్రమాణాలు ఎక్కువవటం వల్ల ప్రక్రియలో విస్తృతదశ కలుగుతుంది" అని ఎం. నారాయణ శర్మ చేసిన విశ్లేషణ సరైనదే. నానీల నాలుగు పాదాల్లో ఒక ప్రశ్న– సమాధానం, పాత సామెతను సమకాలీన వాతావరణానికి అన్వయించి కొత్తగా చెప్పడం, పొడుపు – విడుపు, ఒక ప్రతిపాదన –నిరూపణ, సమస్య – పూరణ, కొత్త నిర్వచనం, పేరడీ మొదలైన విభిన్న పద్ధతులలో కవులు నానీల ప్రక్రియను వినూత్నతను అందించారు. ఎప్పటికప్పుడు వచ్చే కొత్త నానీలతో కొత్త కవులతో ఏదో ఒక కొత్త పద్ధతి కనిపించడం వల్ల కూడా నానీలు అభివ్యక్తి వైవిధ్యాన్ని సంతరించుకున్నాయి. వాటినీ మరింత లోతుగా అనుశీలన చేయవలసి వుంది.

నానీలు విస్తృతంగా ప్రచలితమవుతున్న తొలిదశలో నానీల ప్రక్రియలపై కొన్ని విమర్శలు, వాదోపవాదాలు వచ్చాయి. ఇది హైకూ, మినీకవితలాంటిదే అని – నానీలకు ప్రత్యేక ప్రక్రియా లక్షణాలు లేవనే వాదనలు వినిపించాయి. కానీ ఆ వాదనలేవీ స్థిరంగా నిలబడలేక పోయాయి. "నిజమైన కవిత్వాభిమానానికి రూపం మీద ద్వేషం ఉండదు. రూప సంక్లిష్టత లేని నానీల ప్రక్రియ చాలామంది సాహిత్యకారులను ఆకర్షించింది. ఈ ప్రక్రియ వల్ల వచన కవిత్వంలో ఒక క్రమశిక్షణ వచ్చింది. వర్ధమాన కవులకు అభ్యాస పాఠాలు నేర్పుతుంది. అతి

ప్రాచీన ఛందోనియమమైన అక్షరాల నియతిని పెట్టుకున్న నానీలు కవి స్వేచ్ఛకు పరిమితి ఏర్పరిచినా, ఆ పరిమితే నానీల సాంద్రతకు, గాఢతకు, నిర్మాణ వైవిధ్యానికి తోడ్పడుతూ నానీల ప్రక్రియ బలమైన ఆకర్షణను తెచ్చి పెట్టింద"న్న డా.సంగనభట్ల నరసయ్య విశ్లేషణ విమర్శకులకు మంచి సమాధానం. అదే విధంగా "తెలుగులో హైకూను అర్థం చేసుకుని రాసిన వాళ్ళు తక్కువమంది. హైకూల పేరుతో కొందరు మినీ కవితలు రాస్తే, మరి కొందరు హైకూకు, మినీ కవితకు మధ్య సందిగ్ధంలో పడి రచనలు చేశారు. నానీలు ఈ అవస్థను కొంతవరకు తప్పించాయి.

నానీల ప్రక్రియలో వస్తువైవిధ్యం ప్రధానమైన అంశం. సాధారణంగా ఒక వచన కవితాసంపుటిలో ముప్పై నలభై కవితలుంటాయి.

నానీ స్వేచ్ఛగా మినీ కవితల్ని రాయించింది. నానీలన్నీ మినీ కవితలే. మినీ కవితలన్నీ నానీలు కావు. నానీ ఇచ్చిన స్వేచ్ఛ భావపరమైనది. ఇందులో హైకూ వంటి అనుభూతిని రాసుకోవచ్చు". దీన్ని బట్టి ఒక ప్రక్రియను మరో ప్రక్రియతో పోల్చడం అనవసరం అని ఆర్.ఎస్.వేంకటేశ్వర రావు ప్రక్రియల మధ్య గల సామ్య వ్యత్యాసాలపై స్పష్టతనిచ్చారు.

హైకూ, మినీ కవిత కంటే నానీలు విభిన్న ప్రక్రియగా నిలబడే అంశాలను డా.పెన్నా శివరామకృష్ణ, దాస్యం సేనాధిపతి, పి.లక్ష్మణ్ రావు, డా.తలతోటి పృథ్వీరాజ్, మాకినీడు సూర్యప్రకాశ్ వంటి విమర్శకులు సమర్థంగా విశ్లేషిస్తూ నిరూపించారు. ఇప్పటికీ అప్రతిహతంగా నానీలు వస్తూనే ఉన్నాయి. 'కవిత్వం ఒక ఆల్కెమీ' అన్నట్లుగా నానీల శక్తి, రసానందం, రాసే కవులకు, ఆస్వాదించే పాఠకులకు మధ్య నిరంతరాయంగా భావప్రసారితం అవుతూనే వుంది.

నానీల ప్రక్రియలో వస్తువైవిధ్యం ప్రధానమైన అంశం. సాధారణంగా ఒక వచన కవితాసంపుటిలో ముప్పై నలభై కవితలుంటాయి. చాలావరకు కవి వైయక్తిక అనుభవాలు, సామాజిక విషయాలతో అవి నిండి వుంటాయి. అభ్యుదయ, విప్లవ, స్త్రీవాద, దళిత, బిసి, మైనారిటీ ధోరణులు, వాదాలను వినిపించే కవిత్వంలోని వస్తువు ఒక్కటే అని చెప్పవచ్చు. అభివ్యక్తిలో వైవిధ్యం ఉంటుంది. నానీల్లోకి వచ్చేసరికి ఒక్కో సంపుటిలో వందనానీలు తప్పనిసరిగా వుంటాయి. ఈ సంఖ్యకు రెండింతలు మూడింతలున్న నానీల సంపుటాలు

ఉన్నాయి. అందువల్ల ఒక నానీల కవి తన కవితాసంపుటికోసం విభిన్న వస్తువుల అన్వేషణ చేయవలసిన అవసరం ఉంది. తన చుట్టూ వున్న ప్రతీ అంశాన్ని, కదలికను, తనలోని స్పందనలను కవితామయం చేయాలని తపించిపోతాడు. వస్తువు దొరకగానే అందుకనుగుణమైన అభివ్యక్తిని శక్తివంతంగా నిర్మించుకుంటాడు. ఈ ప్రక్రియలో కొందరు వస్తువును పునరావృతం చేస్తూ అభివ్యక్తిలో బలహీనపడతారు. ఇప్పటివరకు వచ్చిన నానీలను పరిశీలిస్తే చాలా ఆశ్చర్యం కలుగుతుంది. వందలాది కవులు, వేలాది అంశాలతో కవిత్వీకరించిన అపూర్వ వైవిధ్యం మనముందు సాక్షాత్కారమవుతుంది.నానీలకవులునిశితప్రాపంచికప్రాకృతికపరిశీలనలు కొత్త ప్రపంచాన్ని ఆవిష్కరిస్తాయి. నగరం– పల్లె, అంతరిక్షం, ప్రకృతి, జననం– మరణం, రాజకీయాలు, మతం, ప్రపంచీకరణ, సామ్రాజ్యవాదం, వరల్డ్ బ్యాంక్, ఆకలి, సౌందర్యం, బాల్యం, బీభత్సం, సామాజిక సమస్యలు, ఉద్యమాలు, నీతి, భక్తి, విద్య, దేశభక్తి, ఆధ్యాత్మికత, హేతువాదం, విప్లవం, దళిత, స్త్రీ, మైనారిటీవాదాలు, వలస, సంస్కృతి, మానవ ప్రవృత్తులు, అనుభూతులు వెరసి ఇందుకు నిరూపణగా అసంఖ్యాకమైన నానీలను ఉదాహరణగా చూపించి నానీల్లోని వస్తువైవిధ్యాన్ని దర్శింపవచ్చు. ఒక కవి నానీల గ్రంథాన్ని చదువుతుంటే ఆ కవి అంతరంగాన్ని, అనుభవాల్ని, సంస్కారాన్ని, సాహిత్యస్ఫూర్తిని, వివరించే 'ప్రత్యేకమైన డైరీ' లాగా అనిపిస్తుంది. పాఠకుడు కవి వక్రోక్తికి, వైయక్తిక అనుభూతులకు ఆత్మీయతతో తాదాత్మ్యం చెందుతాడు. ఈ వైవిధ్య లక్షణమే నానీలు పాఠకులకు చేరువవడానికి ఒక ప్రధాన కారణం. అందువల్లనే నానీల్లోని విభిన్న అంశాలపై రెండు వందలకు పైగా పరిశోధనా వ్యాసాలు ఇరవై విమర్శనా గ్రంథాలు వచ్చాయి. పలు ప్రాంతాల్లో సదస్సులు జరిగాయి. విశ్వవిద్యాలయ స్థాయిలో ఎం.ఫిల్., పి.హెచ్.డి. పరిశోధనలు వచ్చాయి, ఇంకా జరుగుతూనే వున్నాయి. పాఠ్యాంశాలుగా కూడా అధ్యయనం చేస్తున్నారు. ప్రత్యేకంగా ఈ నానీలపై పరిశోధనా గ్రంథాలు సమర్పించిన డా.చింతకింది శ్రీనివాసరావు, చలపాక ప్రకాష్, తన్నీరు సురేష్ గార్ల నుండి మరిన్ని లోతైన విషయాలను తెలుసుకోవచ్చు. నానీల ప్రామాణికతకు ఇదొక కొలమానంగా భావింపవచ్చు.

**నానీల్లోని విభిన్న అంశాలపై రెండు వందలకు పైగా పరిశోధనా వ్యాసాలు ఇరవై విమర్శనా గ్రంథాలు వచ్చాయి.**

ఒక కవిత ఎన్ని పేజీలు రాసామన్నది ముఖ్యం కాదు. అందులో ఎంత కవిత్వం కదలాడుతున్నదనేది ప్రధాన అంశం. అలాగే నానీలు నాలుగు పాదాలే కదా! చాలా సులభంగా రాయవచ్చని అనుకుంటారు. కాని కవితాత్మకతతో తొణికిసలాడేలా నానీలు రాయడం అంత సులభమైన విషయం కాదని ఇప్పటివరకు వచ్చిన నానీలను పరిశీలిస్తే అర్థమవుతుంది. విభిన్న విషయాలను వస్తువుగా తీసుకోవడం సులువేమోగాని దాన్ని కవిత్వీకరించడం చాలా కష్టం. కవి నైపుణ్యం ఇక్కడే వెల్లడవుతుంది. ఏ ప్రక్రియలోనైనా ఈ అంశమే ప్రతిభకు గీటురాయిగా నిలుస్తుంది. ఏ కవితా సంపుటైనా సంపూర్ణంగా కవితాత్మకతతో నిండి ఉండడం అసాధ్యం; కొద్దిమంది ప్రతిభావంతులైన కవులకు మాత్రమే అది సాధ్యం. నానీలు రాసిన కవుల్లో సీనియర్ కవులెంతమంది ఉన్నారో అంతకుమించిన వర్ధమాన కవులు ఉన్నారు. వీరంతా తమ నానీల్లో భావసాంద్రత కోసం పడిన తపన వల్లే ప్రక్రియకు సాహిత్యగౌరవం ఏర్పడింది. భవిష్యత్ వచన దీర్ఘకావ్యరచనలకు మౌలిక శిక్షణగా ఆయా కవులకు ఉపయోగపడింది. పదిహేడేండ్ల దేవులపల్లి వెంకటసాయి రేవంత్ వ్యాస్ అనే ఇంటర్ విద్యార్థి తొలిసారిగా కలం చేతబట్టి నానీలు రాసాడు. బాల్యదశలోనే బరువైన నానీలు రాసిన కవిగా పేరు తెచ్చుకున్నాడు. "మనసొక రేడియో / మనక్కావల్సిన / స్టేషను మనమే / ట్యూన్ చేసుకోవాలి"



**నానీలు రాసిన కవుల్లో సీనియర్ కవులెంతమంది ఉన్నారో అంతకుమించిన వర్ధమాన కవులు ఉన్నారు.**



మనసు గురించి బాల ఆత్రేయలా కవిత్వాన్ని వినిపించే ప్రయత్నం చేసాడీ కవి. గోపీగారి నానీలు ఏ నానీతో ప్రారంభమయిందో చూస్తే అశ్చర్యం కలుగుతుంది.

"జీవితం మొత్తం / ఏ పద్యంలోనూ పట్టదు / పద్యానికి / అత్యాశ కూడదు"

ఇది కవిత్వానికి, నానీలకు, మనుషులకు సమస్తం అందరికి అనువర్తింపచేసుకుంటూ భావనిధులను నిక్షిప్తం చేసుకున్న నానీ.ఒక మనిషి తన జీవితంలో కొన్ని అనందాలూ, కొన్ని దుఃఖాలూ పొందుతాడు.

అన్నీ ఆనందాలే, అన్నీ దుఃఖాలే మనిషిని చుట్టుముట్టవు. కాలానికి ఆ సమతూకం తెలుసు. మనిషే అది అర్థం చేసుకోలేక ఏవేవో ఆశిస్తూ అత్యాశపడతాడు. అదే విధంగా అన్ని భావాలు ఒకే కవితలో, ఒకే పుస్తకంలో చెప్పాలనే అత్యాశ కవికి ఉండకూడదు. అందుకేనేమో గోపీగారు వందల కవితలు, కావ్యాలు రాసినా ఇంకా మిగిలిపోయిన కవితోద్వేగాలు, భావ తీవ్రతలకు వాహికగా నాలుగు పాదాల నానీలను సృష్టించారు. అదే సమయంలో జీవిత విస్తృతిని, ప్రపంచ పరిధిని, మానవ శక్తిని గమనించి చాలా జాగ్రత్తగా బాధ్యతతో ఈ నానీని రాసి తన గ్రంథంలో మొదటినానీగా కూర్పు చేశారు. ఈ వరసలోనే నానీల్లోని శక్తిని, కవిత్వమూల్యాన్ని అంచనా వేసుకోవాలి. 'జలగీతం' అనే మహాకావ్యంరాసిన గోపిగారి నానీల్లోని కవితాశక్తిని ఇక్కడ ప్రత్యేకంగా పరిచయం చేయడం సాహసమే. అదే విధంగా అసంఖ్యాకమైన నానీల్లోంచి కొన్ని నానీలను మాత్రమే ప్రస్తావిస్తూ ఆయా అంశాలలో నానీలకున్న ప్రత్యేకతను, విలువను, భావగాంభీర్యాన్ని, కవితాస్ఫూర్తిని, చైతన్యాన్ని, వ్యంగ్యాత్మక వైభవాన్ని పరిశీలిద్దాం. వ్యాస పరిధిమేరకు ఈ వరుసలో ఎందరో నానీల కవుల నానీలను ఉదాహరించే అవకాశం ఉండకపోవచ్చు.

**ఒక అనుభూతిని గాఢంగా అనుభవిస్తే అందులోంచి కవిత్వాన్ని సృష్టించవచ్చు.**

ఒక అనుభూతిని గాఢంగా అనుభవిస్తే అందులోంచి కవిత్వాన్ని సృష్టించవచ్చు. తాదాత్మ్యం చెందే మనసువుంటే ప్రతి చిన్న విషయాలలోంచి కవి విలక్షణంగా వ్యక్తమవుతాడు. నానీలను చదివితే ఈ విషయం అక్షరాలా అనుభవమవుతుంది.

"పచ్చని చెట్లు/ తెల్లబడ్డాయా/ఓహో తెలిసింది /కొమ్మకొమ్మకూ కొంగలూ" (సోమేపల్లి వెంకటసుబ్బయ్య)

పచ్చని చెట్టు క్రింద వేర్లు ఎంత లోతుగా ఉన్నాయో తెలవదు కాని కవి ఊహలు ఏ లోతుల్లో ఉన్నాయో ఈ నానీ తెలుపుతుంది.

"కళ్ళల్లో నీ ప్రతిబింబం /రెప్పలు మూస్తే/ హృదయంలోకి/ జారుతుంది" (పి. లక్ష్మణ్ రావు)

ఏ ప్రేమ లేఖలోనుండో దొంగిలించిన వాక్యాలు కావివి, నానీల కవుల భావుకతకు అద్దం పట్టే కవిత్వప్రతిబింబాలివి.



ఆకాశంలో చుక్కలు పెట్టే ఉన్నాయి. ముగ్గులు వెయ్యడమే ఇక తరువాయి. నానీల్లోని కవిత్వమూల్యాలకు, ఊహాశక్తికి నిదర్శనమీ నానీ



"ఆకాశంలో /చుక్కలు పెట్టే ఉన్నాయి./ ముగ్గులు వెయ్యడమే/ ఇక తరువాయి" (కందేపి రాణిప్రసాద్). నానీల్లోని కవిత్వమూల్యాలకు, ఊహాశక్తికి నిదర్శనమీ నానీ. నానీలు చదవడం ప్రారంభించిన పాఠకుల్ని ముగ్గులోకి లాగుతుంది నానీ; నానీల్లోని సూక్ష్మరహస్యాన్ని విప్పిచెప్పిన నానీల్లో ఇదొకటి. కవిత్వమంటే ఏదో కొత్త విషయాన్ని అవిష్కరించే ఫార్మూలా కాదు. ఉన్న పాత విషయాన్నే కొత్తగా చూపించి అంతరంగంలో అనుభూతి వెలిగించి, ఆలోచనల భాస్వరాన్ని మండించే అక్షర రసాయనాల మానసిక క్రియ. అదే పై నానీలో వ్యక్తమైంది. మనం ఎన్నోసార్లు లెక్కించాలని చూసిన చుక్కల్ని ఇలా ముగ్గులోకి దింపడమే కవిత్వం. ఇలాంటి ఊహల నైపుణ్య విన్యాస అంతర్నేత్ర జీవే కవి. నానీల్లో అలాంటి జీవకవిత్వం దాగి వుంది. ఇక్కడ మరో విశేషమేమిటంటే 'ఆకాశంలో చుక్కలు పెట్టి ఉన్నాయి ముగ్గులు వెయ్యడమే తరువాయి' అన్నట్లు ఈ విశాల ప్రపంచంలో నలుదిక్కులా చుక్కలన్నీ దృశ్యాలున్నాయి. సంఘటనలున్నాయి. పరిణామాల కదలికలున్నాయి. వాటిని నాలుగు పాదాలుగా, నలభై వాక్యాలుగా మార్చుకునే శక్తిని సూచిస్తున్న నానీ ఇది.

కవిత్వానికి మూలధాతువు భావుకత; భూమి నుండి అమూల్యమైన ముడి పదార్థాలను వెలికితీసి శుద్ధి చేసుకున్నట్లుగా కవి తనను తాను తవ్వుకుంటూ భావుకతల నిధులను వెలికితీసి ప్రపంచానికి పంచుతాడు. ఇలా పంచగలిగే మనిషిని కవిగా, పంచిన దాన్నే కవిత్వంగా లోకం గుర్తిస్తుంది. ఆ సంతృప్తి కోసమే కవి తపన పడతాడు. అలాంటి తపనే ఈ నానీల కవిత్వంలోనూ కనిపిస్తుంది.

'మల్లెపువ్వులు/స్నానమాడుతున్నాయ్ /నీలికురుల/సెలయేటిలో' (డా. వి. త్రివేణి)

రేడియోలో చిన్నప్పుడు విన్న లలితగేయాల అనుభూతి పరిమళాలు వీస్తున్నాయి. అందుకే కవిత్వం మనసును ఉ య్యాలలూగిస్తుంది. ఈ విషయాన్నే బి. బాలకృష్ణ ఎంత కాస్ట్లీగా చెప్పాడో చూడండి.

"కాసేపైనా / నన్నానందంగా ఊగనీ / కవిత్వం / బంగారు ఊయల !"



ఈదడం నేర్చుకోండి జీవిత ప్రవాహంలో ఎన్ని సుడిగుండాలో!



నిజంగా ఊయల ఊగుతుంటే ఎంత ఆనందం కలుగుతుంటే అంతటి తూగు ఈ నానీలో కదలుతూ మదిని కదిలిస్తుంది. 'కాదేదీ కవితకనర్హం' అన్న శ్రీశ్రీ మాట నానీలకు బాగా వర్తిస్తుంది. దాస్యం సేనాధిపతి మసిబట్టను కవితావస్త్రంగా ఇలా మార్చేసారు.

"ఇప్పుడిది / వంటింటి మసిబట్టే / దానికీ ఉన్నాయి / అందమైన రోజులు"

కవిత్వం జీవన వాస్తవికతను విప్పి చెపుతుంది. వాస్తవికతకు దూరంగా వుండే కవిత్వం పాఠకులకు చేరువకాకుండా పోతుంది. కవి ఎవరికీ చెందని ఒంటరి ద్వీపంలా నిరుపయోగంగా విస్మరింపబడే ప్రమాదం వుంది. నానీలు అలాంటి ప్రమాదాలకు దూరంగా ఉంటాయి. మనిషికి వారి జీవితానికి చాలా సన్నిహితంగా, ఉపదేశకర్తగా, వాస్తవస్థితిని బట్టబయలు చేస్తాయి నానీలు. డా.తలతోటి పృథ్వీరాజ్ జీవితాన్ని ఏ విధంగా వ్యాఖ్యానించారో చూడండి.

"ఈదడం / నేర్చుకోండి / జీవిత ప్రవాహంలో / ఎన్ని సుడిగుండాలో !!"

జీవితం ఓ చిక్కుముడి. దాన్ని ఎంత సున్నితంగా విప్పాలో కొట్టి రామారావు ఇలా చెపుతారు. "దారపు ఉండ / మన జీవితం / చిక్కుతీసేలోగా / చిక్కుల్లో పడతాం" అని హెచ్చరిస్తారు.

డా. ఎన్. గోపి ఒక నానీలో చెప్పినట్లు "ఎంత చదివినా / పేజీలు పెరుగుతున్నా / పుస్తకంలా వుంది /జీవితం". అలాగే ఈ నానీల్లో కూడా జీవితం అంతకంతకూ విస్తృతమై వైవిధ్యభరితంగా కవితామయమై కనిపిస్తుంది. ఈ ప్రక్రియ తొలిదశలో నానీల పరివ్యాప్తికి తోడ్పడిన ఎస్.ఆర్. భల్లంగారి నానీలు సామాజిక సమస్యలను వాస్తవికంగా చిత్రించాయి. చేనేత

కార్మికుల విషాదదుస్థితిని 'కన్నీటిహారంగా' మారుస్తూ మనల్ని ఇలా కదిలిస్తాడు.

"దూదిని ఏకుతుంటే / దారానికి ఐదులు / కన్నీటి హారం / తయారైంది"

**నానీలు సమకాలీన ప్రపంచానికి ప్రతిబింబాలుగా నిలబడుతాయి.**

సామాజికాంశాలపై కవిత్వం రాస్తున్నప్పుడు అందులో కొంత కవిత్వాంశ తగ్గుతుందని వస్తువుకు ప్రాధాన్యత పెరుగుతుందని ఒక విమర్శ. నానీల్లో అలాంటి ప్రాధాన్యం కనిపించదు. నానీల కవులు సామాజికాంశాలపై ఎక్కువగా స్పందించారు. ఆ స్పందనలో విషయ తీవ్రతతో పాటు భావవ్యక్తీకరణకు ప్రాధాన్యమిచ్చారు.

"చెరువెండిపోయింది / రైతుగుండె చెరువయ్యింది / కవిత్వానికి / తడి కరువైంది" (డా. మచ్చ హరిదాసు).

ఒక రైతు వ్యథను మన గుండె కరిగేలా చెప్పాడీ కవి. నిరంతరం స్వేదంలో మునిగిపోయే సింగరేణి కార్మికుడి గురించి మరో కవి ఎంత లోతుగా ఆలోచించాడో ! "శ్వాస కోశాల్నిండా / 'చావు' పొగలు / సింగరేణి / మండుతున్న బొగ్గుల కొలిమి'

వస్తువుకు శిల్పానికి మధ్య సమన్వయాన్ని సాధించిన నానీల కవులు సామాజికాంశాల వ్యక్తీకరణలోనూ కవిత్వం పలచబడకుండా రాస్తూ ప్రక్రియ స్థాయిని పెంచారు. విమర్శలకు గురికాకుండా నిలబడగలిగారు. నానీల విశిష్టతకు ప్రాణాధారమైన మరొక అంశముంది, అదే సమకాలీనత. నానీలకున్న అదనపు బలం కూడా ఇదే. నానీలు సమకాలీన ప్రపంచానికి ప్రతిబింబాలుగా నిలబడుతాయి. తమ చుట్టూ జరుగుతున్న పరిస్థితులకు, పరిణామాలకు స్పందించే తొలి ప్రాణి కవే కదా! సాహిత్యానికి సామాజిక ప్రయోజనమే ముఖ్యమనుకుంటే అందులో కవిత్వం మరింతగా తన బాధ్యతను స్వీకరిస్తుంది. సమకాలీన సమస్యలన్నింటి మీద నానీల కవులు కవిత్వ ఎఫ్.ఐ.ఆర్. ను రచించారు. భూగోళం మీది సమూల సమస్త పరిణామక్రమాన్నంతా నిశితదృష్టిలో పరిశీలించారు. స్పష్టమైన దృక్పథంతో వ్యాఖ్యానిస్తూ ఘాటుగానే విమర్శించారు. ఈ మార్గంలో దీర్ఘకవిత ఒక యుద్ధం.

వచన కవితది నిరంతర పోరాటం, లఘు కవితలది మెరుపుదాడి. నానీలు సమకాలీన సామాజిక సమస్యలపై మెరుపుదాడులు చేసాయి. నానీలు సమస్యల మూలాలపై అవగాహనను, సహానుభూతిని కల్గించాయి. మూగబోయిన గొంతులకు ధిక్కారస్వరాన్ని నేర్పాయి. అక్షరాలు నినాదాలై చుట్టుముట్టి చైతన్యాన్ని నింపాయి. ఈ వరుసలో స్థానిక, జాతీయ, అంతర్జాతీయ, వైయక్తిక పరిధుల్ని దాటి, అంతరంగాల్ని చీల్చుకుంటూ ఎన్నెన్నో విషయాలు నానీలుగా రూపుదిద్దుకున్నాయి. ఇటీవల ప్రపంచాన్ని వణికించిన కోవిడ్ వైరస్ మీద హర్షవర్ధన్ 'కోవిడ్ నానీలు', కోట్ల వేంకటేశ్వర రెడ్డి 'గడప దాటని యుద్ధం', పత్తిపాక మోహన్ 'లాక్ డౌన్ నానీలు', చలపాక ప్రకాష్, ఎస్.రఘు మొదలైనవారు కోవిడ్ ఇతివృత్త నానీలు రాశారు. మరో కోణంలో ఆయా కవుల స్వభావం, నేపథ్యం, సామాజిక స్థితిగతులను, ప్రాపంచిక దృక్పథాన్ని వారు రాసిన నానీల ద్వారా సులభంగా విశ్లేషించవచ్చు. ఒక నానీల సంపుటి చదివితే అ రచనా కాలం నాటి పరిణామాలన్ని అందులో ప్రతిఫలిస్తాయి. ఆ పరిణామాల ప్రతిఫలనాల్లో కవి నిబద్ధత, నిష్పాక్షికత, పోరాట స్ఫూర్తి, చైతన్యం విభిన్న రూపాలుగా వ్యక్తమవుతూ నానీల స్థాయి అవగతమవుతుంది.



**సమకాలీన ప్రపంచంలో సమస్త మానవాళికి అందోళన కల్గించే విషయాలు ప్రపంచీకరణ, ప్రైవేటీకరణ, ఆర్థిక సరళీకరణ, సామ్రాజ్యవాదం.**



సమకాలీన ప్రపంచంలో సమస్త మానవాళికి అందోళన కల్గించే విషయాలు ప్రపంచీకరణ, ప్రైవేటీకరణ, ఆర్థిక సరళీకరణ, సామ్రాజ్యవాదం. వీటి దుష్ప్రభావాలు అనంతాలు. నానీల కవులు వీటన్నింటి మీద పదునైన నానీలు రాసారు. ప్రపంచీకరణ విషపు వేర్లు ఎంత లోతుగా దిగబడ్డాయో, ఎంత సుదూరంగా వ్యాపించాయో ఊహించలేము. అనిశెట్టి రజిత ప్రపంచీకరణకు పెట్టిన పేరేమిటో చూడండి.

'"జవజీవాలను / శ్రమసారాలనూ పీల్చే అక్టోపస్ / ప్రపంచీకరణ "

ప్రపంచీకరణ ప్రభావాలను రుచి చూస్తున్న వేళ 'అక్టోపస్' అనే పదం చిన్నదిగాకనిపిస్తుందేమో! నానీకవులు ప్రపంచీకరణకు విభిన్నమైన నిర్వచనాలు

చేసారు. ఒకరు దాన్ని 'ఉక్కుకౌగిలి'గా (పి. లక్ష్మణ్) మరొకరు 'తాడు లేకుండానే వేసుకునే ఉరి'(ఎస్. రఘు) గా 'సామ్రాజ్యవాద విస్తృతికి / అందమైన తొడుగుగా' (కొట్టి రామారావు) ప్రపంచీకరణపై తమ వ్యతిరేకతను, ఆగ్రహాన్ని ప్రకటించారు.




భారతదేశాన్ని ప్రపంచీకరణవైపు నడిపించిన నాయకుడిని అన్నవరం దేవేందర్ ఎంత తీవ్రంగా సంబోధిస్తున్నాడో చూడండి– "ప్రపంచీకరణ/ బుసకొట్టే పాము/ పాలుపోసింది/ మా పాములపర్తే !"

బుసకొట్టే ప్రపంచీకరణ పాము నేడు వేయిపడగల పామై ప్రపంచాన్ని కబళిస్తుందనే కఠినవాస్తవం మనముందున్నప్పుడు కవుల వాక్యాలు కాలజ్ఞానంగా దర్శనమిస్తుంది.

ప్రపంచీకరణ పదఘట్టనలకు సమస్త విలువలు ధ్వంసమవుతాయనే చేదు నిజాల్ని నానీకవులు ఎంతో బలంగా చెప్పారు. 'ప్రపంచీకరణ / కొండచిలువకు పాత విలువలన్ని / శిథిలమవుతాయని' (బండారు సుజాతా శేఖర్) చెప్పినట్టుగానే కూలిపోతున్న సాంస్కృతిక సౌధాలను, దూరమవుతున్న మానవానుబంధాలను నిశ్శబ్దంగా చూస్తున్నాం. గ్లోబల్ విలేజ్లో / లోకమంతా ఒకటే / మనుషులే దూరదూరంగా...' (డా. సి. భవానీదేవి) అని ప్రశ్నిస్తుంటే 'మనుషుల మధ్య / దూరాలు పెరుగుతుంటే / ప్రపంచం / గ్లోబల్ విలేజా. (మాడిశెట్టి గోపాల్) అని మరొకరు ప్రపంచీకరణను వెక్కిరించారు.

"'ప్రపంచీకరణతో / బాగుపడింది / బడు గులా / బహుళజాతి అడుగులా". (అంబల్ల జనార్ధన్) అనే ప్రశ్నలో ఒక అంతర్జాతీయ వ్యాపారుల వ్యవస్థీకృత కుట్రలను, వాటి మోసాలను నిలదీయడం కనిపిస్తుంది. అందుకే డా.పెళ్ళకూరు జయప్రద వ్యంగ్యంగా వాస్తవాన్ని తెలిపారు. "ప్రపంచీకరణలో / పేదరికం మటుమాయం / అది / పెద్ద ఎండమావి కదా!'

సామ్రాజ్యవాదానికి కుడిభుజం, ఆచరణహస్తం ప్రపంచబ్యాంక్, మన ఆర్థికావసరాలను ఆసరా చేసుకొని ఆదుకున్నట్లుగా పైకి కనబడుతుంది.

అంతర్గతంగా కఠిన నియమ నిబంధనలతో మన సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక రంగాలపై ఆధిపత్యం చెలాయిస్తుంది. పేదదేశాల సార్వభౌమాధికారాన్ని కబళిస్తుంది. నానీల కవులు వరల్డ్ బాంక్ అజ్ఞాత ఎజెండా పసిగట్టి మనల్ని హెచ్చరిస్తూనే ఉన్నారు. అవులించకముందే/పేగుల లెక్క/ రిమోట్ చూపుల్తో/ వరల్డ్ బ్యాంక్' (పత్తిపాక మోహన్). ఆర్థిక సరళీకరణ ముసుగులో ఎన్నో వికృత కోణాలున్నాయి. పచ్చని పంట పొలాలను పారిశ్రామిక ప్రగతి పేరుతో ప్రత్యేక ఆర్థిక మండలాలుగా విభజిస్తూ రైతుల పొట్టలు గొడుతున్నారు. దానికి నాగిళ్ళ రమేష్ ఇలా స్పందించాడు. 'బిడ్డా!/ సెజ్ ల పిట్టలు/మనచేనుదాక రాగల్ల!/ఒడిశెల పట్టు' 'సెజ్'లపై రైతుల వ్యతిరేకత, పోరాటం, పోలీసుల కాల్పులు, రైతుల మరణం వరకు దారితీసిన నెత్తుటి సందర్భాన్ని గుర్తుచేస్తుందీ నానీ!

జార్జిబుష్ కోపం
ఇరాక్ శాపం సద్దాం
ఆత్మ అమెరికన్ల
పాలిటి ప్రేతాత్మ

సామ్రాజ్యవాదం – ఉగ్రవాదం రెండూ పర్యాయపదాలు, పరస్పరాశ్రితాలు. తమ అధిపత్యం కోసం ఏర్పాటుచేసిన తిరుగుబాటు దళాలు ఉగ్రవాదంగా మారి తమకే ముప్పుగా, సవాలుగా మారిన ఉదంతాన్ని నానీలు ఒడిసిపట్టుకున్నాయి.

'పాలుపోసి పెంచిన పామే/కాటేస్తుంది/బిన్ లాడెన్/మరో దృష్టాంతం' (తలతోటి పృథ్వీరాజ్). ప్రపంచదేశాలకు తమ సైనికశక్తిని నిరూపించడం కోసం, అపారమైన చమురు నిల్వలను అక్రమంగా దోచేసుకోవాలనే కుట్రతో ఇరాక్ దేశంపై అమెరికా చేసిన విషప్రచారం, ఇరాక్ యుద్ధ ప్రభావం అందరికీ భయంకర అనుభవమే. నానీలు ఈ కుట్రపై ఘాటుగానే స్పందించాయి. జార్జిబుష్ కోపం/ఇరాక్ శాపం/సద్దాం ఆత్మ/ అమెరికన్ల పాలిటి ప్రేతాత్మ" (టి. సాంబశివరావు).

పనికి ఆహార పథకంలోని అవినీతి, లక్షల లంచం తీసుకొని ప్రశ్నలడిగే ఎం. పీలు. క్రికెట్ మ్యాచ్ ఫిక్సింగ్, వాకపల్లి దుర్ఘటన, లాకప్ డెత్స్, బూటకపు ఎన్ కౌంటర్స్, నగరం, పల్లె యాసిడ్ దాడులు, నీటిపోరాటాలు, ఆకలిచావులు, వృత్తికారులు బతుకుపోరు, వ్యాపారమయమైన విద్య, కార్పోరేట్ జీవన సంస్కృతి, సాంకేతిక విప్లవ సమస్యలు, నిరుద్యోగం ఇలా

విభిన్న దారుల్లో సామాజిక బాధ్యతతో సమకాలీనతను ఆవిష్కరించాయి నానీలు. నానీలు హైద్రాబాద్ లో అవిర్భవించి ఉభయగోదావరి జిల్లాలలో ప్రవేశించి ఆంధ్రప్రదేశ్ అంతటా వ్యాపించాయనడంలో సందేహం లేదు. ఈ నానీల పరివ్యాప్తిలో ప్రత్యేకంగా ప్రస్తావించవలసిన ప్రాంతం ఒకటి ఉంది. అదే కరీంనగర్. ఈ ఇరువది ఎనిమిదేళ్ల నానీల సాహిత్యయాత్రలో ఒక్క కరీంనగర్ జిల్లా నుండే సుమారు అరవైనానీల సంకలనాలు వచ్చాయి. వేటికవే తమదైన అస్తిత్వవేదనతో, తాత్త్వికభూమికతో, సాంద్రకవితాభివ్యక్తితో గుర్తింపు తెచ్చుకున్నాయి. ఉద్యమపోరాట శీలతను నిబిడీకృతం చేసుకున్న ఉత్తర తెలంగాణా మట్టినుండి ఉత్తమమైన సాహిత్యం ఉద్భవించడం సహజమైన పరిణామం. కరీంనగర్ నానీలను పది జిల్లాల తెలంగాణ సామాజిక, రాజకీయ, సాంస్కృతిక ముఖచిత్రంగా పిలుచుకోవచ్చు. తెలంగాణా సాంస్కృతిక భాషా వైవిధ్యం, పాలకుల అణచివేత, ఆధిపత్యం, అసమానతల్లోంచి ఉ బికివచ్చిన దుఃఖం, వేదన, అస్తిత్వపోరాటపు నానీలు ప్రత్యేక తెలంగాణా ఉద్యమానికి శక్తివంతమైన ఆయుధాలుగా, పాఠాలుగా మారాయి. ప్రతికవి అనివార్యంగా తనదైన తెలంగాణా ఆకాంక్షను గాఢంగా వ్యక్తీకరిస్తూ ప్రతికూల శక్తులపట్ల ధిక్కారశంఖారావాన్ని దిక్కులు పిక్కటిల్లేలా కవిత్వీకరించారు. తెలంగాణా ప్రాంతపు నానీల్లో తెలంగాణకు జరిగిన అన్యాయాన్ని స్పృశించని కోణం లేదంటే అతిశయోక్తి కాదు. ధర్నాచౌకుల్లో కొనసాగుతున్న ఉద్యమావేశం, వాతావరణమంతా గోపి నానీల మొదటి గ్రంథం నుండే ప్రారంభమయింది.

'తన ఊళ్ళో / తానే పరాయిదైంది / తెలంగాణ పల్లె / గాయపడిన చెల్లె!'

**తెలంగాణా ప్రాంతపు నానీల్లో తెలంగాణకు జరిగిన అన్యాయాన్ని స్పృశించని కోణం లేదంటే అతిశయోక్తి కాదు.**

1997లో గోపి గారి మొదటి నానీల గ్రంథంలోని నానీ ఇది. అప్పటికి టి.ఆర్.ఎస్. పార్టీ పుట్టలేదు. కానీ ఒక ప్రత్యేక ఉద్యమం జరుగుతున్న సందర్భంలోంచి పుట్టినట్టుగా వున్న శక్తివంతమైన నానీ రాశారు. ఒక మనిషి పరాయీకరణకు గురవుతున్నాడంటే బలమైన పీడనలో, ఆధిపత్యంలో బతుకుతున్నాడని అర్థం. అలాంటిది ఒక ప్రాంతమే పరాయీకరణకు

లోనయిందంటే స్వదేశీ సామ్రాజ్యవాదానికి బలయిపోయినట్టుగా స్పష్టమవుతుంది. అ సూచన ఈ నానీలో వుంది.

**పోలవరం
కోస్తాకు వరం
పోతిరెడ్డిపాడు
తెలంగాణ బీడు**

ఈ సందర్భంలో 'అడవి కూనలు' అనే నానీల సంపుటికర్త నూటెంకి రవీంద్ర కవిత్వానికి పీఠికరాస్తూ గోపిగారు అన్నమాటలు గుర్తుచేసుకోవాలి. "ఏడుపొచ్చింది ఈ నానీలు చదివితే, ఎక్కెక్కి వలవలా జాలువారాలనిపించింది. అపరాధ భావంలో తడిసి ముద్దయిపోవాలనిపించింది. తెలంగాణ బతుకువెతలను గర్భీకరించుకున్న ఈ నానీలు నిజంగా నావీ నీవీ మనవే. ఏడుపెందుకు మరి! ఎందుకంటే తెలంగాణా బడుగుజీవితాలను తెలంగాణా రచయితలు తగినంతగా చిత్రించలేదని మొదటినుంచి నా షికాయతుకు ఎంతసేపు ఉద్యమం, పోరాటమే కాని దానికి మూలమైన బతుకు చిత్రాన్ని పట్టించుకున్న పాపాన పోలేదు. ఆ కంప్లెంటు ఈ నానీల్లో తీరుతున్నందుకు ఉద్వేగం తన్నుకొచ్చింది" అని గోపి భావోద్వేగానికి గురయ్యారు. ఆ తదనంతరం తెలంగాణా ప్రాంతం నుండి వచ్చిన నానీలు తెలంగాణా బతుకు చిత్రణకు ప్రాధాన్యమిస్తూనే, వర్తమాన తెలంగాణా ఉద్యమానికి పదునైన వ్యాఖ్యానంగా, నినాదంగా తమవంతు పాత్రను పోషించాయి.

ఈ వరుసలో మొదట చెప్పుకోవల్సిన కవి కోట్ల వెంకటేశ్వరరెడ్డి. వారు రాసిన 'నూరు తెలంగాణ నానీలు' అద్భుతమైనవి. తెలంగాణా మేధావులు, ప్రజలు ఏ వాదనలైతే చేస్తున్నారో అవన్నీ పదునైన ఉద్యమ పరిభాషలో 2001లోనే నానీల్లో వ్యక్తమైనాయి. వెక్కిరింపులకు, అనాదరణకు గురవుతున్న తెలంగాణ భాషకు, పదాలకు సాహిత్య గౌరవాన్ని తీసుకువచ్చే ప్రయత్నం నానీలు చేసాయి. జింబం అశోక్ 'మానేరు నానీలు', అన్నవరం దేవేందర్ 'బుడ్డ పర్కలు' మొవి తెలంగాణా జీవద్భాషా వ్యక్తీకరణలను ఆస్వాదించవచ్చు. "పోలవరం /కోస్తాకు వరం /పోతిరెడ్డిపాడు / తెలంగాణ బీడు"

తెలంగాణాకు శాపంగా మారిన జలదోపిడిని పోనుగోటి నరసింహారావు ధైర్యంగా వ్యక్తపరిచారు. "అలమట్టి.../ అలమట్టి /తీరని దాహార్తి / ఎంతకూ ఆరని నీటిచిచ్చు"ను పత్తిపాక మోహన్ ఘాటుగా విమర్శించాడు.

"జగిత్యాల, సిరిసిల్లా కల్లోలిత ప్రాంతాలా. కల్లోలమంతా నీ స్వార్థంలోనే" అనే గాజోజు నాగభూషణం మాటల్లో పాలకుల ద్వంద్వనీతి విశదమవుతుంది. "అందాల పోటీల్లో/ తెలంగాణ తల్లి నెగ్గింది/ బతుకమ్మ!/ పూలకిరీటం" (పెరుక రాజు). ప్రత్యేక రాష్ట్ర ఉద్యమ పరీక్షలో తెలంగాణా తల్లి గెలుపుకోసం ఈ నానీ గాఢంగా ఆకాంక్షినట్టుగా వుంది. డా. బండిపెల్లి మల్లికార్జున్ తెలంగాణా భాషతో అమర్యాదగా వ్యవహరించే వాళ్ళకు తీవ్రమైన హెచ్చరిక చేసాడు. 'మా భాష–యాసను/ పేర్నాల బెడితే/ మర్యాదుండదు/ఇజ్జత్ – మానం తీస్తం'. తెలంగాణ నుడికార పదునును చెప్పకనే చెప్పాడీ కవి.

> **మా భాష-యాసను పేర్నాల బెడితే మర్యాదుండదు ఇజ్జత్-మానం తీస్తం**

తెలంగాణా సాంస్కృతిక చైతన్యంలో డా. నలిమెల భాస్కర్ ఒక బహుభాషా సాహితీయోధుడు. వీరి 'మట్టిముత్యాలు' నానీల సంపుటినిండా నిజంగా వజ్రాల్లాంటి నానీలు కనిపిస్తాయి. అవన్నీ తెలంగాణా జీవన వైవిధ్యాన్ని, మౌలిక అవేశాల్ని, ఆవేదనల్ని, అనుభవాలను ఉత్తేజపూరితంగా కవితామయమై ఆకర్షిస్తాయి. 'యాభైయ్యేర్నుండి/తెలంగాణ మోయలేని/ బరువొకటీ/ నవంబరు వొకటి'. కవి దృక్పథం, ఆగ్రహం సక్రమంగానే ఉంది. కవి పలుభాషల్లో నలిగిపోతున్నా వేదన చెందేది తెలంగాణా విముక్తికోసమేనని స్పష్టమవుతుంది. ఇదే వరుసలో నిరంతర ఉద్యమకారిణి అనిశెట్టి రజితది మరింత తీవ్రమైన స్వరం. 'తల్లుల దుఃఖం/ పిల్లలది/ పిల్లల దుఃఖం / తెలంగాణది'. జీవనదిలా మారుతున్న ఈ దుఃఖాన్ని ఎండబెట్టడానికే తెలంగాణా కవుల ప్రయత్నం. అందులో భాగంగా ఉద్యమమనే పదాన్ని ఎలా నానీకరించారో చూడండి. 'ఉద్యమం రగలకపోతే/ ప్రతి ఉదయం/ వృథా అవుతుంది' (ఎన్. గోపి). ఉదయానికి కొత్తరూపునూ అర్థాన్నిచ్చారీ కవి. మరో కవి టి. రాధాకృష్ణమాచార్యులు ఉద్యమానికి త్యాగం శ్వాస వర్తమానం అవ్యవస్థపై దాని రుసరుసలను వివరించారు. "అట్టడుగున ఉద్యమం/నిర్మాణాత్మకమే/ నాయకులే/వ్యూహాత్మకం" (ఎస్. రఘు).

పవిత్రమైన ఉద్యమాన్ని తమ ఎదుగుదలకు ఉపయోగించుకునే ఇంటిదొంగలను, ఉద్యమద్రోహులను వెలెత్తి చూపుతుందీ నానీ, ఈ విధంగా

తెలంగాణ, ఉద్యమం అనే ఈ రెండు అంశాలపై అసంఖ్యాకమైన నానీలను ఉదాహరించవచ్చు.

నానీల కవిత్వంలో ప్రత్యేకంగా ప్రస్తావించుకోవలసిన మరొక అంశం ప్రాంతీయ చైతన్యం, వర్తమాన సన్నివేశంలో ఉద్యమం. ప్రాంతీయ చైతన్యమనే పదబందాన్ని సంకుచితంగా అర్థం చేసుకుంటున్నారు. ఉద్యమమంటే కేవలం తెలంగాణా ఉద్యమమే కాదు, అంతకంటే విశాలమైన మానవాళికోసం తపనపడే అంశాల కోసం జరిగే పోరాటాలు ఉన్నాయి. అలాగే ప్రతివ్యక్తి తను పుట్టిన మట్టిని ప్రేమిస్తాడు, స్మరిస్తాడు. తన నేల విశిష్టతను, వైభవాన్ని గానం చేస్తాడు. స్థానీయ మూలాలపట్ల అపారమైన గౌరవాన్ని ఆత్మీయతను వెల్లడిస్తాడు. స్వీయ అస్తిత్వలోతుల్లోకి వెళ్ళి సకల సంవేదనల్ని కవిత్వంలోకి అనువాదం చేసుకుంటాడు. ఈ క్రమంలో ఆశా నిరాశలు అనుభూతులన్నీ కవిత్వంలో ఆవిష్కారమవుతాయి. ప్రొ. రాచపాళెం చంద్రశేఖరరెడ్డి తను రాసిన నానీల సంపుటికి 'సీమనానీలు' అనే పేరు పెట్టారు. పేరుకు తగినట్టుగానే రాయలసీమ పరిస్థితులను, కవి సాహిత్య చైతన్యాన్ని, లోతైన విమర్శకుణ్ణి కవిత్వంలో పరిచయం చేసాయి. "రాయలసీమ/అనగా నేమి./నీళ్ళకు బదులుగా/కన్నీళ్ళు కురియును". కొండను అద్దంలో చూపినట్టుగా రాయలసీమ స్వభావాన్ని దృశ్యమానం చేశారు. రాచపాళెం గారు. కొన్ని నానీలకు ఇచ్చిన పాదసూచికలు పాఠకుల సాహిత్య పరిజ్ఞానాన్ని పెంచేవిగా, ఆసక్తిని కలిగించేవిగా ఉన్నాయి. ఎ.ఎ. నాగేంద్రనానీల్లో కూడా రాయలసీమ స్థానికతలను వినవచ్చు. మార్కాపురవాసి మంత్రి కృష్ణమోహన్ నానీలో తన స్థానికతను ఎలా వెలిగించాడో చూడండి.

**నానీల కవిత్వంలో ప్రత్యేకంగా ప్రస్తావించుకోవలసిన మరొక అంశం ప్రాంతీయ చైతన్యం, వర్తమాన సన్నివేశంలో ఉద్యమం.**

'మట్టిపలక'/అని చులకనా/అక్షర దీప్తికి/తొలి ప్రమిద కదా". మట్టిపలకలతో మానవాళికి అక్షరాభ్యాసం చేయించిన తమ ఊరిని కవి తలచుకున్న తీరు గౌరవనీయంగా వుంది. తగుళ్ళ గోపాల్ "తీరొక్క పూవు" సంపుటిలో "మా ఇంట్లో /దొంగలు పడ్డారు /మా దారిద్ర్యాన్ని/ఎత్తుకపోతే బాగుండు"అని తమ బతుకు చిత్రాన్ని ఆవిష్కరిస్తాడు. తదనంతర

కాలంలో కృష్ణ మోహన్, తగుళ్ల గోపాల్ లు సాహిత్య అకాడమీ యువ కవితా పురస్కారం అందుకున్నారు.

నానీల అధ్యాయంలో స్త్రీవాద, దళిత చైతన్యానికి ప్రభావవంతమైన స్థానం వుంది.

డా. పెళ్ళకూరు జయప్రద తమ 'నెల్లూరు భాష యాస/ మా సింహపురి /మెదడులో/ సమర్థతా శ్వాస' గా చెపితే పాతూరు అన్నపూర్ణ "పెన్నానీరు ఇంత తియ్యగా ఉందేం/ తిక్కన భారతాన్ని ఒంపుకుంది మరి!' అని నెల్లూరు గొప్పతనాన్ని నానీల్లో వర్ణించారు. ఈ విధంగానే కన్నోజు లక్ష్మీకాంతం 'చార్మినార్ నానీలు', కె.జె. రమేష్ 'గుంటూరు నానీలు', పున్నమి

'నల్లగొండ నానీలు', అంబల్ల జనార్దన్ 'బొంబాయి నానీలు', డా.సి. భవానీదేవి 'హైద్రాబాద్ నానీలు', రాజేంద్రప్రసాద్ 'కడప నానీలు', తులసీరాం 'విశాఖనానీలు', సంపత్కుమార్, మాధవీలత 'ఢిల్లీ నానీలు', మరికంటి 'పాలమూరు నానీలు' మొవి, ఆయా ప్రాంతాల విశిష్టతలు, ప్రస్తుత స్థితిగతులు, స్థానీయ జీవన వైవిధ్యం, సాంస్కృతిక విశేషాలతో కవి లోకల్ ట్రావెలర్ పోయెట్ గా దర్శనమిస్తాడు. తన తొలి శ్వాసలు కదలాడిన నేల ఋణాన్ని కవితాక్షరాలతో కృతజ్ఞతలు తెలుపుకుంటాడు. ఇంకొందరు కవులు తమ నానీల సంపుటి పేరులోనే స్థానీయ పరిమళాన్ని పంచుతారు. వై. సత్యనారాయణ 'దీపంతలు', మచ్చ హరిదాసు 'గోరు కొయ్యలు', బండారు సుజాతా శేఖర్ 'జొన్నకంకులు', వడలి రాధాకృష్ణ 'వట్టివేళ్ళు', అంకాలపు వీరేశం బాబు 'బత్తీసలు', అన్నవరం – 'బుడ్డపర్కలు', నాగిశెట్టి 'గడ్డి చేమంతులు', చింతకింది శ్రీనివాసరావు 'కళింగ నానీలు', వెల్దండి శ్రీధర్ 'ఊపిరి దీపాలు', ఎనభై ఐదేళ్ల పద్య కవి డా.కూరేళ్ళ విఠలాచార్య 'నానీ నేత్రాలు', సివి.శ్రీనివాస్ 'నానీల జీవధార', కాంచనపల్లి రవికాంత్ 'నానీ కిరణాలు', గిన్నారపు ఆదినారాయణ, మారోజు దేవేంద్ర, వింధ్యవాసినిదేవి, చింతకింది శంకర్ నానీల సంపుటాలు ఆయా ప్రాంతాల ముద్రను ప్రతీకాత్మకంగా తెలియజేస్తాయి. ఈ వ్యక్తీకరణలన్నీ దేశీ ప్రక్రియైన నానీలకు మరింత దేశీయతా సొబగులను అద్దింది. కీశే. సోమేపల్లి వెంకట సుబ్బయ్య ఐదు నానీల సంపుటాలు రచించటం విశేషం.

నానీల అధ్యాయంలో స్త్రీవాద, దళిత చైతన్యానికి ప్రభావవంతమైన స్థానం వుంది. నానీల కవులు లింగవివక్షతపై, పురుషాధిక్యతపై తీవ్రమైన నిరసన స్వరాన్నే వినిపించారు. నానీల కవిత్వంలో సుమారు ముప్పైమంది కవయిత్రులు తమ నిశితమైన దృష్టికోణాలనుండి అధిపత్యకోణాలన్నింటిపై విమర్శనాస్త్రాలు సంధించారు, నానీల తొలి కవయిత్రి సి. భవానీదేవి, 'స్త్రీ హృదయ సంవేదనపై సమగ్రమైన వ్యాసం రాసి కవయిత్రుల నానీల్లోని మహిళాచైతన్యాన్ని సంపూర్ణంగా ఆవిష్కరించారు. నానీలు రాసిన కవయిత్రులు డా. వి. త్రివేణి, డా. అడువాల సుజాత గార్ల నానీల్లోని స్త్రీవాద దృక్పథంపై మంచి వ్యాసాలు రాసారు. అతి తక్కువ కాలంలో కవిత్వంలో విశిష్టస్థానాన్ని సంపాదించుకున్న ఎన్. అరుణ 'గుప్పెడు గింజలు' లో ధిక్కారస్వరాన్ని ఇలా వినిపించారు.

అకాశంలో సగం అనే మాట స్త్రీలను సంతృప్తిపరచడానికి ఉపయోగిస్తున్న కవితాత్మక నినాదమైంది

"ఆమె ధిక్కారంతో / తల విదిలించింది / ఆకాశంలోమేఘాలు / చెల్లా చెదురు

'అకాశంలో సగం' అనే మాట స్త్రీలను సంతృప్తిపరచడానికి ఉపయోగిస్తున్న కవితాత్మక నినాదమైంది. ఆ ప్రమాదాన్నిగమనించిన తన స్వేచ్ఛాకాశం మీద ముసురుకున్న నిర్బంధాలు, ఆధిపత్యమేఘాల్ని చెల్లాచెదురు చేసే ప్రతిఘటనాత్మక నానీ ఇది. ఈ బాటలోనే యశశ్రీరంగనాయకి, అనిశెట్టి రజిత, కోపూరి పుష్పాదేవి, ఝాన్సీ కె.వి. కుమారి మొ. వారు ముందు వరుసలో నిలబడుతారు.

నేతల ప్రతాప్ కుమార్ 'దళిత నానీలు' నానీల్లోని దళిత ఉద్యమ స్ఫూర్తికి స్పష్టమైన అడుగుజాడలు. ఉన్నత నాగరికతలోకి ప్రయాణిస్తున్నామని ఘనంగా చెప్పుకునే కాలంలోనే మరో వైపు అంటరానితనం, అమానవీకరణ, దోపిడి, అణచివేతలు జరుగుతూనే వున్నాయి. విభిన్న కోణాలుగా వివక్షతకు గురవుతున్న వర్గాలవారి వేదన, ఆందోళన నానీల్లో సిద్ధాంతస్థాయిలో అవేశంగా, ఆలోచనాత్మకంగా వ్యక్తమైంది.

యస్సీ, యస్టీ మైనారిటీలు బీసీలూ / బువ్వలేనోళ్ళూ కలిస్తేనే దళితులు"

దళితులు అనే పదానికి కొత్త నిర్వచనాన్నిస్తూ నేతల అణగారిన వర్గాల ఐక్యవేదికను నిర్మించడానికి ఉద్యుక్తుడయ్యాడు.

"వాదనలు వస్తు శిల్పాలు ఏవైనా శ్రామిక వర్గదృక్పథం నానీల లక్ష్యం"

అని కూకట్ల తిరుపతి నానీల్లోని బహుజనుల బహుళార్థక లక్ష్యాన్ని గాఢంగా ప్రకటించాడు. ఈ వరుసలో ఆచార్య సూర్యా ధనంజయ్ 'బంజారా నానీలు' బంజారాల అస్తిత్వాన్ని గాఢంగా చిత్రించాయి. "బంజారాలంటే/వనచరులే/ అందుకే వారి మాటల్లో/అడవి పరిమళం" అని గిరిజన సంస్కృతిని నానీల్లో వ్యక్తపరిచారు. సంగివేని రవీంద్ర వర్లి వలస నానీలు – ప్రవాస జీవితం గడుపుతున్న బడుగు జీవుల వలసబతుకు చిత్రణలోనూ ఈ దళితవేదనే దాగివుంది.



నానీలు ఎన్నో ప్రత్యేక విశేషాల సంపుటి. విభిన్న అంశాలపై రాసిన నానీల సంపుటికి భిన్నంగా ఒకే అంశంపై రాసిన నానీల గ్రంథాలు వెలువడటం ఒక విశేషం.



నానీలు ఎన్నో ప్రత్యేక విశేషాల సంపుటి. విభిన్న అంశాలపై రాసిన నానీల సంపుటికి భిన్నంగా ఒకే అంశంపై రాసిన నానీల గ్రంథాలు వెలువడటం ఒక విశేషం. అందులో విశిష్టార్థత కలిగినవి. టి. సంపత్కుమార్ సునామీ నానీలు'. పదమూడు దేశాల్లో సునామీ సృష్టించిన జల భూకంపపు ప్రళయ తాండవ బీభత్సాన్ని, విషాదాన్ని, పునరావాస కార్యక్రమాల్ని సహానుభూతితో, శక్తివంతంగా నాలుగు పాదాల్లో నిక్షిప్తం చేసారు. పఠితల్ని దుఃఖపూరితం చేస్తూ, కర్తవ్యోన్ముఖం చేసే ప్రయోజనాత్మక నానీలు 'సునామీ నానీలు'. విదేశాల్లో ఉన్న కవులు కూడా నానీలను సృజించారు. సతీష్ 'న్యూజిలాండ్ నానీలు', రాపోలు సీతారామరాజు 'దక్షిణాఫ్రికా నానీలు' నానీల వ్యాప్తికి నిదర్శనం. డా.ఎన్. గోపి 'జలగీతం' దీర్ఘకావ్యంపైన 'వైజ్ఞానిక, మానవీయ తాత్త్విక దర్శనం' అనే గ్రంథం ఎం. ధనంజయ నాయక్ రాసారు. వారే నీటిని ప్రధాన వస్తువుగా చేసుకుని నూరు 'నీటి నానీలు' రాయడం ఆశ్చర్యకరమైన విషయం. ఈ నానీల్లో జలం గొప్పదనాన్ని కీర్తించడం, సైన్సు సమాచారం, పర్యావరణ స్పృహ– ఇత్యాది అంశాలన్నింటినీ కవితాత్మకంగా చెప్పడం

మరింత అభినందించదగ్గ అంశం. యెన్నం సత్యం 'సూదినానీలు' నానీల చరిత్రలో మరో మేలిమలుపు. బట్టలు కుట్టే దర్జీవృత్తికారుడైన యెన్నం సత్యం ప్రవృత్తిరీత్యా కవితాశిల్పం తెలిసిన లబ్ధప్రతిష్ఠుడైన వచన కవి. తన వృత్తిలో కీలకసాధనమైన 'సూది'ని కేంద్రకంగా తీసుకుని వృత్తికారుల జీవనంలోని ఆటుపోట్లు, సామాజిక చరిత్రలో తమ సుఖదుఃఖాల స్వీయగాథలను నిక్షిప్తం చేసి ఒక దీర్ఘకావ్య




అనుభూతిని కలిగిస్తాడు కవి. ఎంతో లోతుగా సమస్తవృత్తికారుల బతుకు శిల్పాన్ని పరిశోధించడానికి పురికొల్పే కవితాత్మక కైఫీయత్తు 'సూది నానీలు', డా. సి. నారాయణ రెడ్డి 75వ జన్మదినోత్సవం సందర్భంగా డా. ద్వానా శాస్త్రి 'నానీలలో సినారె' అనే సంపుటి వెలువరించారు. అంతకుముందు వందమంది కవులు, రచయితలపై "సాహిత్య నానీలు" రాశారు. సి. నారాయణరెడ్డి కవిత్వం, వ్యక్తిత్వం, ప్రభావం మొన విశిష్ట గుణగణాలపై రాసిన నానీలు కవితాభిమానులను ముఖ్యంగా సినారె శిష్యులను, అభిమానులను ఎంతగానో అలరించాయి. ఇలాంటి ప్రయోగం ఒక్క ద్వానాశాస్త్రిగారే చేశారు. అయితే ప్రతీ నానీల సంపుటిలో ప్రతికవి తమకు నచ్చిన కవి, రచయిత, గ్రంథం, కథ, ప్రముఖ వ్యక్తులపై ప్రేమాభిమానాలు కురిపిస్తూ నానీలు రాసారు. ఇవి ఆయా కవుల సాహిత్య సంస్కారాన్ని తెలుపుతాయి. ఇవి ఒక సంప్రదాయంగా కూడా మారింది. ఈ అంశంపై దాస్యం. సేనాధిపతిగారు ఒక మంచి వ్యాసమే రాశారు.

నానీల కవిత్వంలో వ్యంగ్యవైభవం ప్రతిధ్వనిస్తుంది. కవిత్వంలో ఆత్మగతమైన ధ్వని నాలుగు పాదాల నానీల్లో కూడా అద్భుతంగా ఒదిగిపోయింది. నానీల కవులు విభిన్నమైన ధ్వని ప్రయోగాలు చేసి గొప్ప వ్యంగ్యాన్ని, హాస్యాన్ని, చమత్కారాన్ని సాధించారు. నానీలంటే ఇష్టపడని 'కొందరు వ్యక్తులు' కూడా నానీల్లోని ఈ వ్యంగ్య బాణాలకు దాసోహమయ్యారు. నానీల వ్యంగ్యంలోని అణుశక్తి పాఠకుల గుండెల్లో హాస్యవిస్ఫోటనం సృష్టిస్తుంది. కన్నోజు లక్ష్మీకాంతంగారి ఈ నానీ వినండి. "ఈ ఎమ్మెల్యేగారు / ఇంత బరువున్నారేమిటీ! / అసెంబ్లీలో / మార్షల్స్ గుసగుస"

కవి రాజకీయ అవినీతి ఎండగట్టిన తీరు కసిగా చక్కిలిగింతలు పెడుతుంది. ప్రభుత్వానికి ఆరోగ్యకర ఆదాయాన్నిస్తూ ప్రజలకు అనారోగ్యాన్ని

పంచే మద్యనిషేధంపై కే.జె. రమేష్ వ్యంగ్య నిర్వచనం చూద్దామా! "మద్య నిషేధం అంటే/ మధ్య మధ్యలో/ నిషేధం అన్న మాట/ అంతే!". ప్రతికవి ఏదో ఒక సందర్భంలో కవిత్వంమీద నిర్వచనాత్మక కవితను రాశారు. అవన్నీ కవిత్వం మీద వారి ప్రేమను, అవగాహనను, గాఢానుబంధాన్ని, గౌరవాన్ని వెల్లడిస్తాయి. ఆధునిక కవిత్వంలో అలాంటి ప్రసిద్ధమైన కవితాఖండికలు ఎన్నో ఉన్నాయి. నానీల్లో కూడా ఇదే సంప్రదాయం కనిపిస్తుంది. నానీల సృష్టికర్త డా.ఎన్. గోపి నానీలను ఇలా నిర్వచించారు. "ఎండపొడల్లో/ తడిగా నానీలు/ రక్తంతో/ శృతిచేసిన వినూత్న బాణీలు" ఈ బాణీలోనే తదనంతర కవులు స్పందించారు. నానీల కవులు నానీలను సృష్టించిన గోపీ గారిపై కూడా నానీలను రాసారు. ఈ అంశంలో అన్నవరం దేవేందర్ నానీ చాలా ప్రఖ్యాతం. "నానీలు/ నానీ నానీ ఉబ్బినయి/ నాన్నగోపి/ తబ్బిబ్బయితాండు". నానీ కవి మల్లయ్యగారు నానీల మీద రాసిన నానీలతో ఒక సంకలనమే తీసారు. నాటకంలో భరతవాక్యం లాగా భరతనానీ అనే లక్షణ సంప్రదాయం అనధికారంగా స్థిరపడింది. డా.అడువాల సుజాతగారి నానీని చివరగా చెప్పుకుందాం! "నానీ! నీ విత్తు చిన్నదే/ కాలంతో పనిలేదు/ దిగుబడికి /కొదువే లేదు"

**ఎండపొడల్లో తడిగా నానీలు రక్తంతో శృతిచేసిన వినూత్న బాణీలు**

నిజమే కదా, ఇప్పటివరకు వస్తున్న నానీలను చూస్తుంటే నానీలకు కరువుకాలం లేదేమో! ఇరవై ఎనిమిది సంవత్సరాల నానీల కవితావిశేషాలను స్థూలంగా చెప్పడానికి ప్రయత్నం చేసాను. ఇదంతా ఒక ఉపరితల పరామర్శగానే భావిస్తున్నాను. ఈ వ్యాస పరిధి మేరకు ఎందరో ప్రముఖులైన నానీల కవులను ప్రస్తావించలేకపోయాను. సాహిత్య చరిత్రలో ఒక లఘు కవితా ప్రక్రియ ఇంత ప్రభావం చూపడం సాధారణ విషయం కాదు. ఈ నానీల కవులు కాలక్రమేణా వచనకవులుగా రూపాంతరం చెందడం మరో ఉత్తమ పరిణామం. కవిత్వ చరిత్రలో నానీలు ఒక ప్రత్యేక కవిత అస్తిత్వాన్ని సంతరించుకుని కొత్త కవులకు ఊపిరులూదుతున్నాయి. మూడు దశాబ్దాల నానీల ఉత్సవం నాటికి మరెన్నో ఉత్తమ నానీల సంపుటాలు వెలువడతాయని, మరింత అధ్యయనం జరుగుతుందనే ఉత్సాహంతో ఈ నానీల ప్రస్థానాన్ని తాత్కాలికంగా ముగిస్తున్నాను.





# 'నానీ'ల్లో నూతన నిర్మాణాంశాలు

డా. ఎం.నారాయణ శర్మ
98483 48502

సుమారుగా రెండు రెండున్నర దశాబ్దాల క్రితం డాక్టర్ గోపి చేతుల నుంచి వెలువడిన నానీలు అనే రూపం బహుశా అన్ని లఘు కవిత రూపాలలో ఎక్కువ ప్రజాదరణ పొందింది. లబ్ద ప్రతిష్టులైన కవుల నుంచి వర్ధిష్ణువుల దాకా అనేకమంది నానీలను రాశారు. ఇప్పుడు నానీలలో మరొక మార్గం కూడా మొదలైంది. అది ఏక వస్తువు కలిగినటువంటి నానీల సంపుటాలు వెలవడటం. సాధారణంగా ఒకే వస్తువుకు సంబంధించిన నానీలు ఎవరైనా సంకలనం చేసినప్పుడు రావటం సాధారణంగా కనిపించే విషయం. కానీ నానీలలో ఒకే కవి ఒక వస్తువు మీద రాసినటువంటివి ఒక సంపుటంగా రావడం అనేది కనిపిస్తుంది. ఇదే సందర్భంలో రకరకాల వాతావరణాలకు సంబంధించి, అంటే కవిత సంబంధంగా చెప్పాలి అని అంటే విభిన్నమైన అర్ధ క్షేత్రాలకు సంబంధించిన వస్తువులను తీసుకొని కవిత్వం రాసినటువంటి వాళ్ళు అధికంగా ఉన్నారు. సంపూర్తిగా వచన కవిత్వంలో చూసినట్లయితే సాఫ్ట్వేర్ ఉద్యోగాల గురించి విదేశాలలో ఉన్న పరిస్థితుల గురించి వచ్చిన కవిత్వం చాలా తక్కువ అని చెప్పాలి. ఒక దశలో అసలు లేదనుకునేంతగా. కానీ నానీలలో సాఫ్ట్వేర్ నానీలు దక్షిణాఫ్రికా నానీలు లాంటివి అనేకంగా కనిపిస్తాయి. మొదట్లో జాతీయంగా ఇతర ప్రాంతాలలో ఉన్నవాళ్లంతా రాసిన బొంబాయి నానీలు వర్లినానీలు లాంటివి కొన్ని కనిపిస్తాయి కానీ రెండవ పరిణామములు ఈ అంతర్జాతీయ స్థాయిలో ఇతర దేశాలలో ఉన్న వాళ్ళు రాసిన నానీలు కూడా కనిపించడం కనిపిస్తాయి. వస్తు పరంగా చూసినప్పుడు ఇన్ని పరిణామాలు నానీలలో కనిపిస్తున్నాయి. అంటే నానీల నిర్మాణాలలో కూడా ప్రాథమికమైన నిర్మాణ సూత్రాలను ఇంకా వ్యాప్తం చేస్తూ మరికొన్ని పరిణామాలు వచ్చాయి అని అనుకోవటం పొరపాటు కాదు. అందువల్ల డాక్టర్ గోపి తన మొదటి నానీల సంపుటంలో చెప్పిన సూత్రాలు ప్రాథమిక సూత్రాలు. ఆ తర్వాత వచ్చినవి

పరివర్తన పరిణామ సూత్రాలుగా భావించాలి. అలాంటి సూత్రాల గురించి చిన్న అన్వేషనే ఈ వ్యాసం.

**అంశాలు - ప్రమాణ విస్తృత దశలు :**

మానవ జీవితం ఎంత చైతన్యవంతమైందో సాహిత్యమూ అంతే చైతన్యవంతమయింది. కాలం గడుస్తున్న కొద్దీ సాహిత్యంలో కొత్త వెలుగులు, కొత్తపుంతలు వెల్లివిరుస్తాయి. ఏ సాహితీ ప్రక్రియకైనా, మార్గానికైనా ప్రాథమికంగా ప్రమాణ దశ, సంపన్నదశ అని రెండు దశలుంటాయి. తొలిదశలో ఉండేది ప్రమాణ దశ. నన్నయ భారత రచనకు ముందు 'ఆంధ్రశబ్ద చింతామణి'ని రూపొందించడం. కుందుర్తి నాటికి వచన కవిత్వంలో ప్రాతిపదికంగా ప్రమాణాలు రావటం తెలిసిందే.

సాహిత్యంలో తొలిదశలో ఉండేది ప్రమాణ దశ. నిర్మాణానికి కావలిసిన ఒక రీతిని స్పష్టం చేసుకోవడం. అనుసరణీయమైన కొన్ని మార్గాలను రూపొందించుకోవడం. తరువాత కాలంలో అనుసరించేవారు ఎక్కువవటం మూలాన వివిధ దశల్లో వచ్చే అవసరాల దృష్ట్యా, ఆశంసల దృష్ట్యా ప్రమాణాలు మరింతగా వికసించడం లేదా సులభతరం అవటం, నైరాశ్యమవటం జరుగుతుంది. అంటే అనుసరణీయమైన మలికూర్పు జరుగుతుంది. ఇది కూడా ప్రాథమికంగా ప్రమాణాలను రూపొందించినవారి ప్రధానోద్దేశానికి దగ్గరగానే. ఇది సంపన్నదశ.

ఒక ప్రక్రియ, రూపం సంపద్వంతమౌతున్న క్రమాన్ని సుమారుగా అయిదు రకాలుగా గుర్తించవచ్చు.

1. ప్రమాణాల్లో కలిగే మార్పు
2. భాషలో కలిగే మార్పు
3. భావనావృత్తి
4. వస్తువులో కలిగే మార్పు
5. నిర్మాణంలో కలిగే మార్పు

ప్రమాణాల్లో కలిగే మార్పు అంటే ప్రాథమిక దశలో ఏర్పరచుకున్న ప్రమాణాలు మరింత సులభతరం అవటం. ఇది నిర్ణయించుకుని చేయటం

వల్లగాని, కొన్నిటినే అనుసరించడం వల్ల గానీ జరుగవచ్చు. ఇది రూపొందించడంలో అనుసరించే నిర్ధారణకు, వెసులుబాటుకు సంబంధించింది.

భాషలో ఉండే మార్పు అంటే అనుసరిస్తున్న భాషావ్యూహాలు మారడం తొలిదశల్లో గ్రాంథీకం నుండి సులభగ్రాంధీకం వైపుకి అటునుండి వ్యవహార భాషవైపుకి వెళ్ళటం తెలిసిందే.

వస్తువుల్లో, వస్తుదర్శనంలో వస్తున్న మార్పు నిర్మాణాంశాలకు సంబంధించింది కాదు.

వస్తువు పట్ల ఉండే భావనల్లో వచ్చే మార్పు. ఉరామరికగా చెప్పుకుంటే పూర్వకాలంలో భావన అలంకారశాస్త్రాన్ని ఆశ్రయించింది. వర్తమానంలో మనోవైజ్ఞానికశాస్త్రాన్ని, ప్రతికాత్మకతని ఆశ్రయించింది.

వస్తువుల్లో, వస్తుదర్శనంలో వస్తున్న మార్పు నిర్మాణాంశాలకు సంబంధించింది కాదు. కాని వ్యక్తీకరణకు సంబంధించినంతవరకు నిర్మాణానికి ఇది అవసరమే.

కవి చాతుర్యాన్ని అనుసరించి, వస్తువుల అర్థక్షేత్రాలకు సంబంధించి, వ్యక్తీకరణకు సంబంధించి ఏర్పడే మార్పులు నిర్మాణంలో వచ్చేమార్పు.

అనుసరించే వారి సంఖ్య ఎక్కువవుతున్నకొద్దీ వస్తువులు, అనేకానేక నిర్మాణరీతులు పురుడు పోసుకుంటాయి. నిబద్ధంగా ఏర్పడుతున్న ప్రమాణాలు, నైతిక ప్రమాణాలు ఎక్కువవటం వల్ల ఆ ప్రక్రియలో విస్తృతదశ కలుగుతుంది. అనేకానేకాంశాల పరిశీలన ముఖ్యంగా పద్యాలు, ముక్తకాలుగా ఉన్న ప్రక్రియలో ఈ భాగం ఎక్కువ. చరిత్రలో చూసినా బౌద్ధంలో హీనోయానం, మహాయానం అనే దశలు కనిపిస్తాయి. ఒకరకంగా చెప్పుకుంటే బుద్ధుని బోధనాక్షేత్రం నుండే ఇంత బౌద్ధసాహిత్యం ఉద్భూతమైంది. బౌద్ధంలో ఉండే ధార్మిక నిష్పత్తుల సంఖ్య పెరిగింది.

సాధారణంగా సాహితీ నిర్మాణంలో ఒక వ్యూహం పనిచేస్తుంది. ఈ వ్యూహం వల్ల చూపబడే పరిధి విస్తృతమవటం. నిష్పత్తుల సంఖ్య పెరగటం, తగ్గటం కనిపిస్తుంది.

**నానీలు - ప్రాథమిక ప్రమాణాలు:**

నానీల ప్రస్థానం ప్రారంభమై పదివసంతాలు. సాహితీ క్షేత్రంలో నానీలు అడుగు పెడుతూనే కొన్ని ప్రమాణాలను ఏర్పరచుకున్నాయి. మొదటిసారి నానీల పుస్తకం ప్రచురింపబడుతున్నప్పుడు డా॥ గోపీ పీఠికలో ఈ నిర్మాణాంశాలు కనిపిస్తాయి. ప్రాథమికంగా గోపీ రాసిన నానీలతోపాటు, ఇప్పటికి ముద్రిత, అముద్రిత రచయితలు అనుసరిస్తున్నవి ఈ ప్రమాణాలే.

ఇందులో ప్రధానమైనది అక్షరాల సంఖ్య. ఇరవై ఒకటి నుండి ఇరవై అయిదు మధ్య ఈ సంఖ్య ఉండాలని, నాలుగు భాగాలుగా ఉండాలని, రెండు భావాంశాలు వ్యక్తీకరింపబడాలని, ఒకటికొకటి అంతర్గతంగా సంలీనం చెందాలనేవి ముఖ్యమైనవిగా అగుపిస్తాయి.

ఇందులో అక్షరాల సంఖ్యని అందరూ పాటిస్తున్నారనే చెప్పుకోవాలి కాని డా॥ సంగనభట్ల నరసయ్య గారు తన వ్యాసంలో (నానీలు సంవీక్షణం – సం॥ డా॥ ఎస్. రఘు) అక్షర సంఖ్య పాటించని కవుల గూర్చి చెప్పారు. ఇవి నాలుగవటం వరకు గొడవ లేదు. రెండు భావాంశాలవటమే కనిపించడం తక్కువ. ఈమధ్యకాలంలో వస్తున్న నానీలలో కొన్ని వైరుధ్యాలు కనిపిస్తాయి.

ప్రత్యేకించి నానీలపై వచ్చిన నా పుస్తకం 'డా॥ ఎన్. గోపీ రూపసృష్టినానీలు – సమాలోచన'లో డా॥ గోపీ చూపిన ప్రమాణాలతోబాటు మరికొన్ని నిర్మాణాంశాలని గుర్తించి చూపాను. డా॥ సంగనభట్ల వ్యాసంలోనూ కొన్ని నిర్మాణాంశాలను చూడవచ్చు. (చూ. నానీలు సంవీక్షణం. సంపాదకుడు ఎస్. రఘు) ఈ మధ్య కాలంలో వస్తున్న నానీల్లో ప్రతిపాదిత గుణం కలిగినవి ఎక్కువ నిర్వచనప్రాయంగానో, నిషేధం చేస్తూనో, వర్ణనతోనో అనేకమైన నానీలు వస్తున్నాయి. ఉదా॥ డా. గోపీ నానీల్లో నేను చూసిన నిర్మాణాంశాలలో ఒక వాక్యంలో ప్రశ్నిస్తూ మరొక వాక్యం సమర్థించడం, సమాధానం చెబుతున్న క్రమాన్ని నాలుగు రకాలుగా చూపాను.

1. మొదటి అంశంలో ప్రశ్నించడం; రెండవ అంశంలో సమాధానం చెప్పటం.

2. మొదటి అంశం రెండు పాదాల్లో ప్రశ్నించి విషయాంతరంగా సమాధానం చెప్పడం.

3. ప్రశ్నతోపాటు– ఆ వాక్యాల్లోని అంతరార్థాన్ని సమాధానంగా వ్యక్తీకరించడం.

4. ప్రశ్నించి సమాధానం చెప్పడం, వర్ణనాత్మకంగా చెప్పిన విషయాన్ని తరువాత పాదాల్లో వ్యంగ్యంగా చెప్పటం.

5. మొదటి అంశంతో రెండవ అంశానికి పోలిక చూపటం, మొదటి అంశంలో కవిత్వీకరించిన దాన్ని మరో విషయంలో పోల్చటం.

**ప్రశ్నాపూరిత వాక్యాల నిర్మాణం నానీల్లో అధికం. కొత్తగా వస్తున్న చాలా సంపుటాల్లో ఈ పద్ధతిని అనుసరించడం కనిపిస్తుంది.**

డా॥ సంగనభట్ల చూపిన అంశాలలో ప్రాసను చెప్పటం. అక్షరాల సంఖ్య మొదలైన అంశాలను ప్రస్తావించారు. వాస్తవంగా నానీలు గర్భిత వాక్యాలు, ఒంట్లో చాలా దాచుకుని తిన్నగా, చిన్నగా కనిపిస్తాయి. ఒకరకంగా ఇవి ఒక పొడుగు వచన కవిత్వంతో సరిపడేంత మూల విలువ కలిగినవి. వచన కవిత రూపొందిస్తున్నప్పుడు కవి తాను వ్యక్తీకరించాల్సిన మూలభావానికి కావల్సిన ఉపవాక్యాలు ప్రథమభాగంలో నిర్మిస్తాడు. దీనివల్ల పాఠకుడు భావాన్ని పట్టుకోవడానికి శతధా సంసిద్ధుడౌతాడు. ఇదంతా బంతిని పట్టుకోవడానికి ఆటగాడు తీసుకునే జాగ్రత్తలాంటిది.

నానీల్లోనూ మొదటి భావాంశం అలాంటిదే. ఇది ఉద్దేశ్యాన్ని, పాఠకుడు పట్టుకునే సామర్థ్యాన్ని కలుగజేస్తూ సంసిద్ధున్ని చేస్తుంది. అందువల్ల రెండవ వాక్యం ఉదాత్తమైందిగా కనిపిస్తుంది.

ప్రశ్నాపూరిత వాక్యాల నిర్మాణం నానీల్లో అధికం. ఇది డా॥ గోపీ నుండే ప్రారంభమైనప్పటికీ కొత్తగా వస్తున్న చాలా సంపుటాల్లో ఈ పద్ధతిని అనుసరించడం కనిపిస్తుంది.

నానీల పరంపర ఉధృతమౌతున్న ప్రస్తుత సందర్భంలో నానీల అర్థవృత్తి కేవలం బాహ్యంపై ఆధారపడ్డదే. ముప్పాతిక భాగం పాఠకుడికి వదిలేయాల్సిన నానీల కవి. సంపూర్ణ ఉద్దేశ్యాన్ని ప్రసారం చేసే బాధ్యతని తీసుకుంటున్నాడు. ప్రస్తుతం వస్తున్న నానీల్లో వస్తుగతంగా అనేక అంశాలు ప్రస్తావింపబడతున్నాయి. కవులు, రచయితలయొక్క వైయక్తిక జీవిత ప్రభావం

నానీల్లోని వస్తువును విస్తృతం చేస్తున్నాయి. సాధారణంగానే ముక్తకాలవటం మూలాన అనేకానేకాంశాలని తమలోని నైపుణ్యాన్ని, చాతుర్యాన్ని అనుసరించి కవితామయం చేస్తున్నారు. ఇలాంటి స్థితిలో ఇటువంటి వస్తువులు తీసుకుంటున్నారు. వీరి వ్యూహాలిలా ఉన్నాయంటూ చెప్పటమూ అసాధ్యమే.

ప్రస్తుతం నానీలు రాస్తున్న కవుల్లో లక్షణాత్మక వివేచన కన్నా, ప్రయోగాత్మక వివేచనే ఎక్కువ.

ప్రస్తుతం నానీలు రాస్తున్న కవుల్లో లక్షణాత్మక వివేచన కన్నా, ప్రయోగాత్మక వివేచనే ఎక్కువ. భావోద్రేక గమనం ఉన్న నానీలే ఎక్కువ. ప్రాథమికంగా పూర్వపు ఆనవాళ్లలోనించి తప్పించుకోలేని వాళ్ళే ఎక్కువ కనిపిస్తారు.

నానీల్లో ఈమధ్యకాలంలో వచ్చినవి ప్రాతిపదిక గుణం కలిగినవే. నిర్వచన ప్రాయంగానో, వర్ణనాత్మకంగానో, నిషేధం చేస్తూనో అనేకమైన నానీలు వచ్చాయి.

నానీల్లో రెండు భావాంశాలని ఒక అర్థజిజ్ఞాసతో సంలీనం చేయటం ప్రధాన తత్వం. ప్రస్తుతం పూర్తి రచనా భిన్నవాక్యాలను సంలీనం చేయడం కంటే ప్రతిపాదిం చడం ఎక్కువ. ఇందుకు కారణం వస్తువు వైయక్తిక మూలాలకు సంబంధించినదవటం.

ఈమధ్యకాలంలో వచ్చిన నానీల సంపుటాల్లో, పత్రికలో ప్రచురింపబడుతున్న నానీల్లో తమకు ఆప్తులైన వారిగురించి వారి వ్యక్తిత్వాలను గూర్చి నానీలు వస్తున్నాయి.

"అమ్మ నాన్న ఊరు / ఒక కాన్సెప్ట్<br>
కె.వి. నరేందర్ / కథల ఎక్స్పర్ట్"<br>
(అన్నవరం దేవేందర్ – బుడ్డపర్కలు – 15)

"ఘంటసాల అంటే / పాటా!<br>
బీడు మడుల్లో ప్రవహించే పంటకాలువ!!"<br>
(డా॥ ఎస్. రఘు – జీవనలిపి – 32)

"షెహనాయికి / ఎంత మెరుపో
అది బిస్మిల్లాఖాన్ / ఊపిరి విరుపు"
(నాంపల్లి సుజాత – నెమలీకలు – 15)

"మాఘే మాఘే గతం వయ: / మల్లీ నాథా
మల్లీ ఓసారి / పుట్టగూడదూ"
(డా॥ ఎం. విజయశ్రీ – ప్రాణం ప్రణవం – 19)

నగరం చుట్టూ
ప్లాట్ల సమాధులు
బతికుందగానే
బక్కరైతు శవాలు

వస్తువుల్లో ఈరకమైన మార్పు రావటం వల్ల, నిర్మాణ వ్యూహంలోనూ మార్పు కనిపిస్తుంది. ముఖ్యంగా కథల్లో ఉండే ఔద్వేగికగుణం, నిబద్ధత, కేవలం వస్త్వాధారిత నానీల రూపకల్పన ఇది. ప్రాథమికంగా నానీలు వ్యంగ్యాత్మకం. అయినా వీటిలో భావుకత పాలే ఎక్కువ.

వస్తువు పట్ల నిబద్ధత కలిగిన నానీలు కూడా ఎక్కువయ్యాయి. 4,5 సంవత్సరాల పూర్వమే కోట్ల వెంకటేశ్వరరెడ్డి నూరు తెలంగాణా నానీలు తెచ్చారు. ప్రస్తుతం రాస్తున్న వాళ్ళలో అన్నవరం దేవేందర్ మొదలైనవాళ్ళు ప్రాంతీయ స్పృహతో నానీలు రాస్తున్నారు. ఇందులో ధిక్కారం, తిరస్కారం ఆత్మగౌరవం ప్రధానంగా కనిపిస్తాయి. అందువల్ల నిర్మాణంలోనూ, వ్యూహంలోనూ మార్పు కనిపిస్తుంది.

"నగరం చుట్టూ / ప్లాట్ల సమాధులు
బతికుండగానే / బక్కరైతు శవాలు"
(కోట్ల వెంకటేశ్వర్ రెడ్డి – నూరు తెలంగాణా నానీలు)

"కరీంనగర్ జిల్లా / ఎర్ర శెల్క నేల
ఎగబడుదు / ఎదరుతిరుగుదు"
(అన్నవరం దేవేందర్ – బుడ్డ పర్కరలు)

ఇతరత్రా నానీలు రాస్తున్న కవుల్లోనూ ప్రాంతీయ స్పృహ కనిపిస్తుంది. నిజానికి ముక్తకాలుగా కనిపించే కవితల్లో సంఘటనాత్మకమైనవి తక్కువ. ఒక దుర్ఘటననో, సంఘటననో, గొప్ప వ్యక్తినో క్షేత్రంగా తీసుకుని రూపుదిద్దుకున్న సంపుటాలున్నాయి. "సునామీ నానీలు" టి. సంపత్కుమార్, "నానీల్లో

సినారె" డా॥ ద్వా.నా. శాస్త్రి, అంబల్ల జనార్ధన్ "బొంబాయి నానీలు" ఇందులో నగర జీవితం ప్రధానవస్తువు.




"చేపలు పట్టుకొని / ఊరు చేరారు
ఇల్లులేదు / ఇల్లాలు లేదు"
(టి. సంపత్కుమార్ – సునామీ నానీలు)

"ఎల్లలు లేని / దృక్కోణమాయనది
మూడు ప్రాంతాలూ / ఆయనకు పిల్లలే"
(ద్వా.నా. శాస్త్రి – నానీల్లో సినారె)
బొంబాయి జీవితాన్ని స్పర్శిస్తూ వచ్చిన "వర్లీ" కూడా అలాంటిదే.

"ఆకలి వేటలో / అలయెన్స్
వేదిక ఎక్కడ / ముంబై లోకల్ ట్రేన్స్"
(వర్లి వలస నానీలు – సంగనేని రవీంద్ర)

గతంలో నానీల్లో స్త్రీ కోణాన్ని చూసాం. ఇవి జ్ఞానాత్మక ఊహా స్పర్శలకు సంబంధించినవి. క్షేత్రం ఒకటే అయినా అనుభవిక స్పర్శ ప్రధానంగా కనిపిస్తున్నాయి. కథకునిలా దూరంగా ఉండి చెప్పడం కంటే అనుభోక్తగా స్పందిస్తున్నారు. ఎక్కువగా కనపిస్తున్నారు. ఈ నానీల మూలంగా నానీల్లో వివిధ కోణాల్లో స్త్రీ చైతన్యం ఆవిష్కరింపబడుతూ ఉంది.

వైరుధ్యం గల నానీ కవుల్లో నిష్పత్తుల సంఖ్య తక్కువ. స్త్రీ గురించి చెప్పినప్పుడు వర్ణనాత్మకంగా చెప్పటం, అనేక ప్రతీకలతో చెప్పడం చూస్తాం. ఇందులో అనుభవిక స్పర్శ పరాశ్రయమైంది. దృక్పథంలో ఉన్న బలం వల్ల స్త్రీ చైతన్యం ప్రతిభావంతంగా రూపొందింది. స్పర్శించే కోణాలు, స్పర్శలు వీటిని పట్టి నిష్పత్తులను కొలవచ్చు. కోణాలను అనుసరించే నిర్మాణ వ్యూహాలు అధికమౌతాయి.

"ఒక్కరికి / ఒకరే అమ్మ!
మానవాళికి / ఉందిగా మదర్ థెరిసా" – (జీవన లిపి – ఎస్. రఘు)

"ఆ రాతి ముఖం / అమ్మది
అందుకే / మృదులాతి మృదులం" – (ఎన్. అరుణ – గుప్పెడు గింజలు)

"వివాహమా / ఎంతపనిచేశావు?
నన్ను పుట్టింటికి / అతిథిని చేసావు" –(చిల్లర భవానీదేవి – భవానీ నానీలు)

"గంగాభవనీలు / శ్రీలక్ష్మిలే అనుకోకు
ఝూన్సీలు / రుద్రమలు ఉన్నారు" – (నాంపల్లి సుజాత నెమలీకలు)

కొన్ని చోట్ల నానీల్లో వాక్య నిర్మాణాన్ని అసంపూర్ణంగా వదలటం కనిపిస్తుంది.

"తెలంగాణా రైతు / జపైన భూమిలా
ఎవుసం అటకెక్కి / తాను రోడ్డెక్కి"
"ఆవులు మేస్తున్న / పచ్చిక నేల
చుట్టాలతో నిండి / ఇల్లు"

"డాలర్ క్షేత్రాలకు / మేధోవలస
ఆవలి తీరాన / సరస్వతీ పుత్రులు"
(అనిశెట్టి రజిత – గోరంత దీపాలు)

ఈమధ్య కాలంలో వస్తున్న నానీల్లో రెండు భావాంశాలలో ఒకదాన్లో ప్రశ్నించి, రెండవదాంట్లో సమర్థించడం. సమాధానమివ్వటం ఈ పద్ధతి డా॥ గోపీ నానీల్లోనూ కనిపిస్తుంది. ప్రస్తుతంలో ఈ పద్ధతిని అనుసరించేవారు ఎక్కువ.

"చైతన్యాన్ని / భయ పెట్టడమా?
గూడుపుఠానీలో / గూండాల రాజ్యమా?" – (అనిశెట్టి రజిత)

"గణపతి బొప్పా మోరియా! / వినరా ఓరయ్యా!
గూండాలేమిటి? / చందాలేమిటి?" – (అంబల్ల జనార్దన్)

"మరో బ్యాంకు / బోర్డు తిప్పేసిందా
మరి అత్యాశేగా / కొంపముంచింది" – (చిల్లర భవానీదేవి)

"చమురు క్షేత్రంపై / నెత్తుటి మరకా
కొన్నాళ్ళకు / అదే నేల కాబోలు" – (సోమిపల్లి వెంకట సుబ్బయ్య)

"రాజ్యానికి / ఉద్యమాలు గిట్టవు
మరి అడవి? / పోరాటాల పురిటి గడ్డ" – (నూటెంకి రవీంద్ర)

"అంత పెద్ద / మల్లయోధుదూ
తెల్లవెంట్రుకకు / తల్లడిల్లుతున్నాదేమి?" – (నాంపల్లి సుజాత)

"అలారానికేమన్నా / తెలివుందా?
కమ్మని కలని / పాడుచేసింది" – (కారం శంకర్)

"ఇల్లొకటుందని / విర్రవీగాలా?
అద్దెకైతే / ఎన్ని కొంపలో!" – (మసన చెన్నప్ప)

"మాట్లాడటమంటే ఏమిటి? / విత్డ్రాయల్
మరి వినటం / డిపాజిట్" – (కలువకుంట రామకృష్ణ)

ఇలాంటి నిర్మాణాల సంఖ్య ప్రస్తుతం వస్తున్న నానీల్లో ఎక్కువ. సరదాగా కనిపించే మరో పద్ధతి పదాన్ని మళ్ళీ మళ్ళీ ప్రయోగించడం. ఇది పదంలో భారాన్ని అధికం చేయడం కోసం.

"మన ఆప్తులు / పోయినప్పుడు
మనం కూడా / కొంచెం కొంచెం చచ్చిపోతాం" – (ఎన్. అరుణ)

"గింజా గింజా కలిసి / ధాన్యమైనట్టు
మాటా మాటా కలిసి / కావ్యమైనాయి" – (ఎన్. అరుణ)

"కిరణాలు కిరణాలుగా / తీసుకుంటే
సూర్యుడు / తరిగిపోతాడు" – (ఎన్. అరుణ)

"జారిపో జారిపో / కన్నీటి చుక్కా
మరో బిందువుకు / చోటుకావాలి" – (జీవన లిపి – ఎస్. రఘు)

"నిజంగా ఇది / కరువు కాలమే
మనిషికి మనిషి / కరువైన కాలం" – (నూటెంకి రవీంద్ర – అడవి కూనలు)

"ప్రమిదకీ వత్తికీ / స్నేహమే సేతువు
మనిషికీ మనిషికీ / కూడా" – (చిల్లర భవానీదేవి)

"కానీ కానీ / చిరతపస్సు కానీ
గానం గమనం / ప్రాణం ప్రణవం" – (డా॥ విజయశ్రీ)

"కాలానికి తిమ్మిరెక్కింది / జల్లూ, జల్లూ
యాడ కురుస్తుందో / వాన" – (సంబారి లక్ష్మీరాజం, గులకరాళ్ళు)

ఇటువంటి శైలి చాలామంది నానీ కవుల్లో విస్తృతంగా కనిపిస్తుంది. ఒక భావనలో ఉండే వస్తువు రెండు భాగాలకూ వ్యాపించడం రెండవ గుణాన్ని చెబుతున్నప్పుడు ఒక ఉదాత్త గుణాన్ని ప్రతిపాదించడం కనిపిస్తుంది.

ఒక ప్రయోగాన్ని, బంధాన్ని వ్యతిరేకించడం, ధ్యానాత్మకంగా ఉండటం, ఉద్వేగపూరితంగా ఇలా రకరకాల వైరుధ్యాలతో నానీల కవులు నానీలను రూపొందిస్తున్నారు.

సాహిత్య ప్రపంచంలో ఏర్పడే అనేక మార్పుల్లాగే, నూతన మార్గాల్లాగే నానీల్లోనూ ఏర్పడుతున్నాయి. నానీల కవులు అనేకమైన నూతన పరికరాలతో పాఠకుణ్ణి మెప్పించడానికి సిద్ధపడుతున్నారు.

జయంతితే సుకృతినః రససిద్ధాః కవీశ్వరాః॥
నాస్తియేషాం యశఃకాయే జరామరణం భయమ్॥



"కొన్ని ముఖ్యమైన పరిణామాలు గుర్తించలేనంత నిశ్శబ్దంగా జరిగి స్థిరపడతాయి. తెలుగు సాహిత్యంలో నానీలు ఒక ప్రక్రియగా స్థిరపడడం అటువంటిదే. నానీకి శక్తివంతమైన ప్రక్రియగా మారగలిగిన అవకాశం ఉందని గుర్తించాలి. మొత్తంగా మనిషిని ఉన్నతీకరించడమే సాహిత్య ప్రయోజనమనుకుంటే, నానీలకు ఆ శక్తి ఉంది"

– ఎన్. వేణుగోపాల్





# హాస్యం, వ్యంగ్యాలతో మురిపిస్తున్న మూడు దశాబ్దాల 'నానీ'

డాక్టర్ చలపాక ప్రకాష్ 9247475975

'నానీ'! ఈ మాట తెలుగునాట ప్రతి ఇంట్లో చిన్నారులను ముద్దుగా పిలిచే పేరు. 'నానీలు' అనే నాలుగు పాదాల చిట్టి కవితలను 1997లో ఆచార్య ఎన్.గోపి వార్త ఆదివారం అనుబంధంలో ధారావాహికంగా రాసి పాఠకుల్ని ఆకర్షించారు. తెలుగు సాహిత్య రంగంలో ఎన్నో కవితా ప్రక్రియలు పుట్టుకొచ్చాయి. కాని ఒకటి, రెండు దశాబ్దాలకు మించి కొనసాగినవి చాలా అరుదు. కాని 'నానీ' ప్రక్రియ దాదాపు మూడు దశాబ్దాలకు చేరువవుతున్నా ఇంకా ఈ ప్రక్రియలో కవులు తమ కవితలు కొనసాగిస్తూండడం విశేషం. కారణం సమకాలీన పరిస్థితులకు తగ్గట్టు 20 నుండి 25 అక్షరాలు నియమంతో తక్కువ నిడివి కలిగి ఉండడం వల్లననుకుంట! కేవలం పాత వారే కాదు, కొత్తగా కలం పట్టిన వారు సైతం నానీలు రాస్తూ అగ్రగుణ్యులుగా కీర్తి ప్రతిష్టలు అందుకుంటున్నారు. అసలు పుస్తకాలు చదివేవారి సంఖ్యే తగ్గుముఖం పడుతున్నప్పటికీ తక్కువ నిడివిగల నానీలు పాఠకుల్ని ఆకర్షించి చదివింపచేస్తున్నాయి. అందుకే కాలానికి తగ్గ కవితా ప్రక్రియ 'నానీ' అని పేర్కొనడం జరిగింది. 'నా'వి 'నీ'వి, వెరసి మనవి' అన్న భావాల్ని 'నానీ'గా అవతరించి ఈ రోజున తన విస్తృత రూపాన్ని ప్రదర్శించుకుంటూ నూతన వస్తువైవిధ్యంతో దూసుకుపోతోంది.

తొలుత నానీల సృష్టికర్త ఎన్.గోపితో తన మదిలో భావాల్ని చిట్టి కవితలుగా రాసుకుంటూ ప్రారంభించబడిన ఈ 'నానీ'లు, కవి ఎస్.రఘు కూడా ఆంధ్రజ్యోతిలో ఈ నానీలు రాయడంతో అది ప్రక్రియగా రూపాంతరం చెందింది. ప్రథమంగా 'నానీలు' పేరుతో గోపిగారే వీటిని ఒక సంపుటిగా తీసుకురాగా, కీ. శే. ఎస్.ఆర్. భల్లం 'గూడు వదిలిన గువ్వలు' పేరుతో నానీల సంపుటి తీసుకురావడంతో సంపుటాల తొలి వారసుడు భల్లం అయ్యారు. తొలి

నానీల కవయిత్రిగా చిల్లర భవానీ దేవి, ఎక్కువ సంఖ్యలో నానీల సంపుటాలు వెలువరించి కీ.శే. సోమేపల్లి వెంకట సుబ్బయ్య నానీల చిన్నాన్నగా గుర్తింపు పొందారు.

నానీల వస్తువైవిధ్యంలో హాస్య, వ్యంగ్యం, చమత్కారం ప్రధానం: సాధారణంగా నానీల్లో తక్కువ నిడివిలో ఎక్కువ భావం ప్రదర్శించడమే ప్రధానం. అది పేలి పాఠకుల హృదయాల్లో చురుక్కున అంటుకోవాలి. ముఖ్యంగా హాస్యం, వ్యంగ్యం, చమత్కారం నానీల్లో ఉండడం వల్లే సాధారణ పాఠకుల్ని సైతం చదివించడంతో పాటు వాళ్లనీ కవులుగా తీర్చిదిద్దేలా ఉసిగొల్పాయి. అటువంటి నానీలు ఎక్కువగా వచ్చాయి, ప్రక్రియని ఎక్కువ కాలం నిలిచేలా చేసాయి.

వాటిలో ఉదాహరణకి కొన్ని–

ఆచార్య ఎన్.గోపి రాసిన నానీ

"సూర్యుడు
నదులకు చెమట ధారపోస్తాడు
దాహమేసి
మళ్ళీ తాగేస్తాడు"

సోమేపల్లి వెంకట సుబ్బయ్య

"ప్రేమ మైకంలో
ప్రియా..ప్రియా..
పెళ్ళి పర్వం ముగిసాక
ఏమేవ్, ఒసేయ్!!"

చిల్లర భవానీదేవి

"వివాహమా
ఎంత పని చేసావు?
నన్ను పుట్టింటికి
అతిథిని చేశావు"

ఎన్.అరుణ

"మా నాన్న
చెరుకు పండించేవాడు
అందుకే
అనుబంధాల్లో అంత తీపి"

| | |
|---|---|
| కోపూరి పుష్పాదేవి | ''అతను గొప్ప దానశీలి<br>వృద్ధాశ్రమానికి<br>అమ్మా నాన్నల్ని<br>దానం చేశాడు'' |
| కలువకుంట రామకృష్ణ | ''వర్షం కురిసి<br>వెలిసిందిప్పుడే!<br>భూదేవి<br>తలస్నానం చేసింది'' |
| కందేపి రాణీప్రసాద్ | ''సముద్రంలో<br>ఎంత సర్ఫ్ ఒలికిందో<br>ఎన్నటికీ తరగని<br>నురగలు'' |
| ఎస్.రఘు | ''ఈ దారికి<br>ఎంత ఓపికో!<br>ఎందరు ప్రయాణించినా<br>అలసిపోవటం లేదు'' |
| చలపాక ప్రకాష్ | ''గుండెల మీద పెట్టుకు<br>చూసుకుంటున్నారు<br>పిల్లల్ని కాదు<br>సెల్లుఫోనుని'' |

ఈ నానీలన్నిటికీ వ్యాఖ్యానాలు అవసరం లేదు. పాఠకుడికి ఇట్టే అర్థమయ్యిపోయి గిలిగింతలు పెట్టి ఆలోచనలలోకంలో విహరింపజేస్తాయి. నానీలని కొన్ని వందలు మంది, వందలు, వేల సంఖ్యలో రాసుంటారు. ఇటీవల కొన్ని వాట్సాప్ గ్రూపులు కూడా ప్రత్యేకంగా నానీలు రాయిస్తూ కొత్త కవుల్ని ప్రోత్సహిస్తున్నారు. వాటిలో 'వాగ్దేవి సాహితీ వేదిక' ప్రధానంగా చెప్పుకోవచ్చు.

ప్రధానంగా నానీలపై పోటీలు నిర్వహిస్తూ, పుస్తకబహుమతులు విజేతలకు పంపిస్తూ, మధ్య మధ్యలో నానీలు వర్క్‌షాపులు నిర్వహిస్తూ కొత్త తరం కవులు తయారవ్వడానికి కారణమై మరెందరికో ఆదర్శంగా నిలుస్తున్నారు. అలాగే నానీల సంపుటాలుకు ప్రత్యేకించి అవార్డులిస్తున్న వారు గతంలో అనకాపల్లికి చెందిన హైకూ క్లబ్ వారు ప్రారంభించగా, నేటికీ దానికి కొనసాగిస్తున్నవారు నెల్లూరుకు చెందిన పెళ్ళకూరి జయప్రదాసోమిరెడ్డి గారు. ఈవిధంగా నానీల కొనసాగింపుకి ఎందరో ప్రోత్సాహకులుగా ఉన్నారు.

ఇక ఇటీవల కొత్తగా రాస్తున్న నానీల కవులు గురించి ప్రస్తావించవలిసి వస్తే–

గడ్డం సులోచన

''మైకు మనసులో
ఏం పెట్టుకోదు
విన్నదంతా
కక్కేస్తుంది''

డి.సంపత్‌కుమార్, సునామీ నానీల్లో

''మంచిరోజు
పవిత్రస్నానం
స్పీడ్‌యుగం కదా!
వెంటనే స్వర్గప్రాప్తి''

సునామీ వచ్చి వెంటనే మనుషులకి స్వర్గప్రాప్తి కలిగించిందని ఓ చక్కని సెటైర్.

ఇటీవల విస్తృతంగా రాస్తున్న కొత్త కవికెరటాలు కుడికాల వంశీధర్, ఎస్. లహరి, నానా.

కుడికాల వంశీధర్

''వారి
ఆతిథ్యం గొప్పది
టీ, టిఫిన్ కన్నా ముందే
వైఫై పాస్‌వర్డ్ ఇచ్చారు''

ఎస్.లహరి రాసిన నానీ–

''మా ఊర్లో వానొస్తే
కాగితం పడవలు
మరి పట్నంలో
కార్లే పడవలు''

నానా 'నా..నానీలులో–

''వివాహమా
మోసం చేశావ్
కన్న కూతుర్ని
పరాయిదాన్ని చేసావ్''

ఇలా చెప్పుకుంటూపోతే కొన్ని వందల నానీలు ఉటంకించాల్సివస్తుంది. మహాకవి శ్రీశ్రీ చాలా కవితా సంపుటాలు రచించారు. అయినప్పటికీ ఆయనకి పేరు ప్రఖ్యాతలు తెచ్చింది మాత్రం 'మహాప్రాస్థానం' ఎలాగో, అలాగే ప్రతి ఒక్కరూ రాసిన వందల నానీల్లోంచి ఏరితే, ప్రతి ఒక్క కవీ రాసిన ఒక అద్భుత నానీ చెప్పుకోదగ్గది ఉండి ఉంటుంది. అటువంటి నానీలన్నీ కలిపి ఒక నానీల సంకలనం తీసుకువస్తే నానీల(కవితా)ప్రియుల తృష్ణ ఒక్కచోటే గుత్తిగా తీర్చినవారవుతారు.... ఎక్కువమంది పాఠకులు కవిత్వాన్ని ఆకర్షించబడేలా కారణభూతులవుతారు. అటువంటి ప్రయత్నం ఎవరైనా చేస్తే బాగుంటుందన్నది పలువురి సూచన ఈ సందర్భంగా గుర్తుచేస్తున్నాను.



పరిశోధనా వ్యాసం



# నానీలు-కవితాత్మకత

డాక్టర్ తన్నీరు సురేశ్ 8790569436

వ్యాససంగ్రహం:

1. పరిచయం: ఆధునిక తెలుగు లఘుకవిత్వం లో నానీలు అనే ప్రక్రియ ఒకటి దీనిని ఆచార్య ఎన్ గోపి గారు ప్రారంభించారు.
2. ఈ నానీలు పరిచయం చేసి అందులోని కవితాత్మకతను విశ్లేషణ చేయడం వ్యాస ఉద్దేశ్యం.
3. పరిశోధనలో నానీలలో కవితాత్మకత పదాలు భావాంశాలు పదచిత్రాలు భావ చిత్రాలు ప్రతీకలు ఆశ్రయించుకొని అద్భుతంగా ఆవిష్కరణ అవుతుంది అని ఊహా ప్రతిపాదన.
4. సమాచార సేకరణ మరియు విశ్లేషణ పద్ధతిని పరిశోధనలో అనుసరించడం జరిగింది.
5. ఫలితాలు ముగింపు: నానీలలో గల కవితాత్మకతను నిర్మాణం, భావాంశం, వస్తుగతం, ప్రతీకలు భావచిత్రాలు పద ప్రయోగాలు అనే కోణంలో చూసి ఫలితాలను ప్రకటించడం జరిగింది.

Keywords: ఆధునిక తెలుగు కవిత్వం నానీలు నానీలు 20 నుంచి 25 అక్షరాలు 4 పదాలు గల కవితా రూపం భావాంశ నిర్మాణం నానీలలో అందాన్ని తెస్తుంది. నానీలు సూక్ష్మంలో మోక్షం చూపగల మంచి కవితా రూపం.

**ఉపోద్ఘాతం:**

"నిన్ను నా సర్వస్వంగా భావించ గలిగే
స్వల్ప భాగాన్నే నాలో మిగలనీ"
-------- రవీంద్రనాథ్ ఠాగూర్



**కవిత్వం అంటే ఒక చైతన్యం, కవిత్వం ఒక రస స్పర్శ, కవిత్వం ఒక సామాజిక బాధ్యత.**



ప్రపంచం ఎంతో విశాలమైనది; కానీ ప్రపంచమంతా మనది కాదు ప్రపంచాన్ని మనకు మొత్తంగా ఇచ్చినా మనం చేసుకునేది ఏమి లేదు. నాది అనుకోగలిగే అణువు మాత్రమైనా ఆనందమే, పరమానందమే. ఊరిలో ఎంతమంది ఉన్నా మన పిల్లలు అంటేనే మనకు ఏదో ఆత్మ స్పర్శ, అనురాగం కదా. అందుకే కవిత్వం పేరుతో ఎన్ని అక్షరాలు గుట్టలుగా పర్వతాలుగా పోగు పోసుకున్నా అందులో హృదయం కదిలించే కొన్ని సం స్పందనలే మిన్న. అవే కావాలి అవే మనల్ని చేరాలి. సరిగ్గా అలాంటి కవితాత్మక సృజన ధ్వనులే నానీలు. కవిత్వం విశ్వమంత విశాలమైనది అణువంత సూక్ష్మమైనది. కవిత్వానికి కొలమానాలు, పరిమాణాలు కన్నా కవితాత్మక అనుభూతి ప్రధానం. అందుకే అలంకారికులు రసాత్మకమైన వాక్యం మాత్రమే కాదు పదం కూడా కవిత్వమే అన్నారు. కవిత్వాన్ని కవిత్వంగా స్వీకరించడం అంటే నిన్ను నిన్నుగా ప్రేమించడమే తప్ప మరో పొర కమ్మే కల్మషత్వం ఉండదు. కవిత్వం అంటే సంతోషాన్ని వ్యక్తం చేసేది, దుఃఖాన్ని పోత పోసుకునేది.

కవిత్వం అంటే ఒక చైతన్యం, కవిత్వం ఒక రస స్పర్శ, కవిత్వం ఒక సామాజిక బాధ్యత. సమాజ అభివృద్ధి అంటే కంప్యూటర్ పరికరాలు మొదలైన భౌతిక సామగ్రి మాత్రమే కాదు వ్యక్తిని శక్తిగా దైవంలా మార్చే మానసిక పరిణతి సాధించడం కూడా. అందుకు ఏకైక మార్గం కళ. కళ, కళ కోసమే కాని కళ ప్రజల కోసమే కానీ అసలు కళ అంటూ ఒకటి ఉండాలి ఒప్పుకోవడమే ఒక గొప్ప విజయం . అలాంటి గొప్ప కవిత్వంలో కవితాత్మకతని గురించి చెప్పడం అంటే మనిషిలో ఆత్మను, దేవుడిలో దైవత్వాన్ని బయటకు తీయడమే.

ఏ కవిత్వం సమాజంలో నిలబడుతుంది అంటే కవిత్వాన్ని కలిగిన కవిత్వమే నిలబడుతుంది అందుకే నానీలు రెండు దశాబ్దాల క్రితం పురుడు పోసుకొని ఇప్పటికీ నిలబడింది. పైగా, పుట్టినప్పుడు ఉన్న ప్రేమ లాలత్వమే ఇప్పటికీ సొగసిల్లుతుంది. చిన్నారిని ఇష్టపడనివారు ఉంటారా? పైగా అందాలు తేజరిల్లుతూ బోసి నవ్వులు చిందే చిట్టి తల్లిని దగ్గరకు తీసుకోని వారు తీసుకొని, ఆనందించని వారు ఉంటారా? అది జరిగే పని కాదు.

**ప్రధానవిషయం :**

> **నానీలలో కవితాత్మకత సూక్ష్మంలో మోక్షాన్ని అడుగులో అవనిని గొడుగులో అనంతాన్ని చూపగలది.**

నానీలు తెలుగులో స్థిరపడిన గొప్ప ప్రక్రియ. దీనిని ప్రారంభించినది ఆచార్య ఎన్ గోపి గారు. నానీలు మొదట వార్తా దినపత్రికలో 5 అక్టోబర్ 1997 నుండి 8 ఫిబ్రవరి, 1998 వరకు ధారావాహికంగా వెలువడ్డాయి. ఆ తర్వాత సంపుటాల రూపంలో వచ్చాయి. పత్రికల్లో గోపి గారు నానీలు రాస్తున్న రోజుల్లోనే ఈ రూపానికి మంచి గుర్తింపు, మన్నన లభించాయి. ఎస్, ఆర్ భల్లం మొదలు అనేక మంది కవులు, కవయిత్రులు నానీలను రాశారు ప్రచురించారు. వివిధ పత్రికల్లోను, సంపుటాల రూపంలోనూ వచ్చే నానీల సంఖ్య అనూహ్యంగా రోజురోజుకి పెరిగింది.

నానీల రచనపై పట్టు కలిగిన వారిలో గోపి గారి తర్వాత ఎస్.ఆర్. భల్లం (గూడు వదిలిన గువ్వలు) ఎస్.రఘు(జీవన లిపి), సోమేపల్లి వెంకట సుబ్బయ్య(తొలకరి చినుకులు), తలతోటి పృథ్వీరాజ్ (అడుగులు)నేతల ప్రతాప్ కుమార్ (పాలకంకి) పత్తిపాక మోహన్ (పచ్చబొట్టు ), రాచపాళెం చంద్రశేఖరరెడ్డి (సీమ నానీలు), పి లక్ష్మణరావు (నావీ నీవి) అంబల్ల జనార్ధన్ (బొంబాయి నానీలు) ఇంకా త్సవటపల్లి సాయి వెంకన్నబాబు, రసరాజు, మసన చెన్నప్ప, కలువకుంట్ల రామకృష్ణ, కోసూరి గాంధి,(వీరి పేర్లతోనే సంపుటాల పేర్లు), చిమ్మపూడి శ్రీరామమూర్తి (వెలుగు పూలు),దాస్యం సేనాదిపతి (చిటికెలు), నూటెంకి రవీంద్ర(అడవి కూనలు), బూర్ల వెంకటేశ్వర్లు (రంగుల విల్లు) నలిమెల భాస్కర్ లు పేర్కొన తగిన వారు. కవయిత్రులు అదేహవా శారదా అశోక వర్ధన్, చిల్లర భవానీ దేవి, యశశ్రీ రంగనాయకి, అరుణ, సుర్యాధనంజయ్, అనిశెట్టి రజిత, నాంపల్లి సుజాత, విజయశ్రీ, రాణిప్రసాద్, విజయలక్ష్మిమార, ఇలా ఎందరో నానీల్లో తమ బాణీలు వినిపించారు. ఇలా నానీలు తెలంగాణ, కోస్తా ఆంధ్ర, మహారాష్ట్ర అన్ని ప్రాంతాల నుంచి నలువైపులా ప్రవహించి జీవం పోసుకున్నాయి.

## నానీలు - కవితాత్మకత :



చూసిన ప్రతి వస్తువును కవిత్వంగా చేసే గొప్ప సౌకర్యం నానీ సొంతం. గొప్ప సందేశాలను కవితాత్మకంగా ఇవ్వాలంటే నానీ ఒక గొప్ప వరం.



నానీలలో కవితాత్మకత సూక్ష్మంలో మోక్షాన్ని అడుగులో అవనిని గొడుగులో అనంతాన్ని చూపగలది. దీర్ఘ కవిత్వంలో కవితాత్మకత చూపడం కన్నా లఘు రూప కవిత్వంలో కవితాత్మకత చూపడం కష్టం. నానీల్లో కవితాత్మకత చెప్పాలంటే నానీలు చెప్పడం తప్ప వేరే మార్గం లేదు. "నానీ/ పువ్వు కాదు పుప్పొడి కాదు/ మేధో వనంలో/ కళ్ళు తెరిచే విత్తనం " అంటాడు భల్లం. పువ్వు అందానికి పుప్పొడి ఆస్వాదనకు, విత్తనం సృష్టికి సంకేతం. నాని కేవలం చూపుకు మాత్రమే నచ్చే పువ్వు మాత్రమే కాదు; అర్థం ఆస్వాదన యోగ్యం. పైగా ఆ అర్థం ఆస్వాదన మాత్రమే కాదు ఒక్కో నానీ జ్ఞానంలో ఆలోచనలు పుట్టించే విత్తనం లాంటిది. దీనివల్ల నానీ ప్రయోజనం అందం, ఆనందం మాత్రమే కాదు, ఆలోచన పరమ ప్రయోజనం అన్నమాట కూడా అని తెలుస్తుంది.

హైకూలు బాగా వచ్చిన రోజుల్లో నానీలు రావడం వలన హైకూ మూడుపాదాలకు మరోపాదం పెరిగి నానీ రూపొందిందని కొందరు భావించారు. నిజానికి హైకూకి ఒక పాదం పెరిగి నానీ రూపొందలేదు. చతుష్పాది అనేది మన దేశీ సంప్రదాయం. అంతేగాక నాలుగు పాదాల మధ్య ఒక అంతర్లత అంటే భాషా పరమైన, భావ పరమైన, అర్థ పరమైన నిర్మాణ సమన్వయాన్ని నానీ సాధించింది. దీని వల్ల నిర్మాణ గత ఆకర్షణ శక్తి పెరిగింది. నిజానికి దీని శక్తి కవితాత్మక శక్తి వల్ల కూడా పెరిగింది.

## వస్తుగత కవితాత్మకత:

కవిత్వంలో ఎంచుకునే వస్తువు కూడా కవిత్వాన్ని గొప్పగా మారుస్తుంది. అందుకే కాలాన్ని బట్టి వస్తువులో వచ్చే మార్పు కూడా ప్రధానాంశం అయింది. నానీలు ముక్తకాలు కావడం వలన ఎంచుకునే వస్తువులు అపారం. చూసిన ప్రతి వస్తువును కవిత్వంగా చేసే గొప్ప సౌకర్యం నానీ సొంతం. గొప్ప సందేశాలను కవితాత్మకంగా ఇవ్వాలంటే నానీ ఒక గొప్ప వరం "నడిచే పాదాలకు / మేకులు

కొట్టకు/ శిలువ/ క్రీస్తు విలువను పెంచింది" (గోపి) ఎన్నో మత గ్రంథాలు ఇచ్చే గొప్ప సందేశాన్ని నాలుగు పాదాల నానీ ఇలా నిక్షిప్తం చేసింది. ఇందులో ఇంకా కవితాత్మకతని ఏమని వివరించాలి. మనిషి అభివృద్ధిని ఆపే కుత్సిత చర్యలు ఆ మనిషిని మహోన్నతుడిని చేస్తాయి తప్ప నిలువరించలేవు.

జీవితంలో చెడు అలవడినంత తొందరగా మంచి అలవడదు. చెడు ఆకర్షిస్తుంది, ఆనందింపజేస్తుంది; కానీ జీవితాన్ని నాశనం చేస్తుంది.

చాలా వరకు నానీలు కొన్ని నిర్వచనాలుగా ఉండి జీవితానికి సంబంధించిన సందేశాలను ఇస్తాయి. "వంతెన పునాదులు/ నీళ్ళలో/ జీవితం పునాదులు/ కన్నీళ్లలో" అంటాడు రఘు జీవితంలో దుఃఖాన్ని ఎదుర్కొని మనిషి అంటూ ఉండడు. పైగా దాన్ని పొందిన వాడే నిజమైన జీవితాన్ని ఆస్వాదించ గలుగుతాడు. "జీవితం విషం/ కాబట్టి ఆకర్షణ/ జీవితం అమృతం/ కాబట్టి సంఘర్షణ (గోపి). విషం, అమృతం, ఆకర్షణ సంఘర్షణ పదాలు జంట పదాలుగా శబ్దాత్మకంగా సాన్నిహిత్యం కలిగినవే కానీ వాటి మధ్య అంతరం మాత్రం చాలా ఎక్కువ. జీవితంలో చెడు అలవడినంత తొందరగా మంచి అలవడదు. చెడు ఆకర్షిస్తుంది, ఆనందింపజేస్తుంది; కానీ జీవితాన్ని నాశనం చేస్తుంది. మంచి ఆకర్షించదు. పైగా మంచిగా బతకాలి అంటే ఎంతో సంఘర్షణ పడవలసి వస్తుంది. కానీ అది జీవితాన్ని నిలబెడుతుంది.

## పద ప్రయోగ సార్థక్యాలుగా నానీలు కవితాత్మకత:

కవితాత్మకతకి ప్రధానమైనది వస్తువును కవిత్వంగా చేయడం. అందులో అనేక మౌలిక అంశాలు ఉంటాయి. వాటిలో పదాల ప్రయోగం చాలా ప్రభావం చూపిస్తుంది. భావానికి తగిన పదం వేస్తే చాలు శిల్పం అక్కడే జ్యోతక మవుతుంది. పదాల ప్రయోగం నానీలో కవితాత్మకతని రెట్టింపు చేస్తుంది. వేసే పదం వస్తువును ప్రత్యక్షంగా పాఠకుని గుండెలో అనుభవంగా ముద్ర వేస్తుంది.

"నేను పుట్టిన/ గదిలో పడుకున్నాను/ అమ్మవొడి వెచ్చదనం/ గుప్పుమంది " (గోపి). అమ్మవొడి చల్లగా ఉంది, హాయిగా ఉంది. అనే పదాలు సాధారణంగా వింటాము. ఇక్కడ వెచ్చదనం అనే ప్రయోగం ఉంది. చల్లదనం.,

వెచ్చదనం అనేవి స్పర్శా పూర్వక అనుభవాలు. అంటే బాహిర భౌతికానికి సంబంధించినవి. వాసన గుప్పుమనడం అనేవి ఆస్వాదించ దగినవి, స్పర్శ కాదు. అంతరంగానికి సంబంధించిన ఆస్వాదన ఉంటుంది. అమ్మ ఇప్పుడు ఉండి ఉంటే అమ్మ చేతి స్పర్శ తన శరీరానికి కలిగేది. ఆనందాన్ని కలిగించేది. కానీ అమ్మ ఇప్పుడు లేకపోవడం వల్ల అమ్మకు సంబంధించిన జ్ఞాపకాలు మాత్రమే తలుచుకోవడం జరుగుతుంది. జ్ఞాపకాలు భౌతిక శరీరాన్ని మనసును స్పర్శిస్తూ అమ్మ ఒడి అనుభవించడం కేవలం జ్ఞాపకంతో కూడిన అనుభూతి మాత్రమే. ఇంతకు పూర్వంలో అమ్మ ఒడిలో పడుకున్న అనుభవం యొక్క అనుభూతిని మళ్లీ తలుచుకోవడం వల్ల కలిగే అనుభవం ప్రస్తుతం ఎందుకంటే, అమ్మ ఇప్పుడు ఉంటే సరాసరి అమ్మ ఒడిలోనే పడుకునేవాడు కదా! అమ్మ ఇప్పుడు లేదన్నమాట ఆమె ఇప్పుడు లేదనే బాధ ఒక భారమైన భావాన్ని మనసులో నింపి వెచ్చదనం అనే ప్రయోగానికి కారణమైంది. ఈ నానిలో వెచ్చదనం, గుప్పుమనడం అనే పదాలు ఇంతటి భావాన్ని నిక్షిప్తం చేశాయి.

నెమలీక స్పర్శలా కవిత్వం ఒక పులకరింతను ఇవ్వాలి. అందుకే కవులు అనగానే సమాజం వారికి ప్రత్యేక గుర్తింపు ఇస్తుంది.

పదాల ప్రయోగం ప్రాసలను ఇచ్చినప్పుడు కవితాత్మకత మరింత ప్రభావ వంతంగా ఉంటుంది.

“దళారులు/ ఉరితాడు లేకుండానే రైతుల/ ఉసురు తీసే తలారులు” (తలతోటి పృథ్వీరాజ్)

### భావాల పులకరింత కవిత్వం:

“మా ఊరి/ కూడలిలో/ వెలుగు నిచ్చే/ వీధి దీపమే/ వెన్నెల” (విజయలక్ష్మి మార) “వంటపాత్ర నిండా/ చీకటి/ అది కాస్తా/ ముఖాల మీద వ్యాపించింది” గిన్నెలో అన్నం తెలుపు రంగులో ఉంటుంది. గిన్నెలో ఆ తెలుపు లేదు చీకటి అనే శూన్యమే ఉంది. ఆ చీకటి ముఖాల మీద వ్యాపించింది అంటే పేదరికం తినడానికి తిండి లేని వారి ముఖంలో ఇంకా ఏ జీవకళని కాంతిని వెతకాలి? అమావాస్య పదంతో పేదరికం భావాన్ని అందులోని ఆవేదనని ఇలా

ఆవిష్కరిస్తుంది ఇది. ఎంత హృదయాత్మకమైన నానీ ఇది.

నెమలీక స్పర్శలా కవిత్వం ఒక పులకరింతను ఇవ్వాలి. అందుకే కవులు అనగానే సమాజం వారికి ప్రత్యేక గుర్తింపు ఇస్తుంది. "ఎంత తేనె/ తాగిందో ప్రేమ/ ఎన్ని తరాలైన తియ్యగానే ఉంటుంది " (చలపాక ప్రకాష్)

"చూపును/ నాటాను/ మనసు మాగాణిపై/ మొలిచింది ప్రేమ మొలక" (ఎస్. ఆర్. భల్లం)

అమ్మ ఏ పని చేసినా పిల్లల గురించే ఆలోచిస్తుంది. సాధారణంగా రోజులు లెక్కించడం అనేది ఏదో ఒక పరిణామం కోసం ఎదురుచూస్తూ చేసే పని.

**భావాంశ సమన్వయ కవితాత్మకత:**

నానీలలో భావాంశ నిర్మాణం కూడా కవితాత్మకతని ప్రభావవంతం చేస్తుంది. భావాంశం అంటే ఒక భావం పూర్తి కావడం. సాధారణంగా నానీలలో 5 రకాల భావంశ నిర్మాణం ఉంటుంది. దీనిని నేను నా సిద్ధాంత వ్యాసంలో వివరించాను. ఈ భావాంశ నిర్మాణం ఉపమానం– ఉపమేయం, సూత్రం– ఉదాహరణ, సిద్ధాంతం– అన్వయం, ప్రశ్న– సమాధానం, బింబం– ప్రతిబింబం కోణంలో ఉంటుంది.

ఒక ఉదాహరణ :

"బ్లాక్ బోర్డ్ / హాయిగా నవ్వింది / ఎలా? అక్షరాల దంతాలతో" (చిందం సునీత). ఇందులో ప్రశ్నకు సమాధానం ఉన్నట్టుగా నానీ నిర్మాణం జరిగింది. కానీ చాక్ పీస్ రాతలను దంతాలుగా భావించి అవి నవ్వుతున్నాయి అనడంలో ఉంది కవితాత్మకత. నిర్ధారణ ఉదాహరణ లాగా ఉన్న నానీ " పుస్తకాలు/ కాగితం, సిరా చుక్కలు కాదు/ తోడుకుంటే/ వజ్రాల గనులు" (పత్తిపాక మోహన్)

**ప్రతీకలు- భావచిత్రాలు కవితాత్మకత :**

పదాలలో పరమార్థాన్ని సాధించడం నానీల ప్రత్యేకత ఇందుకు ప్రతీకలు, భావచిత్రాలు ప్రధాన ఆధారం అవుతున్నాయి. "అమ్మ/ చేట ముందేసుకొని/ పిల్లాడి ఉద్యోగం కోసం / డేట్లు లెక్కిస్తుంది" (గోపి). అమ్మ ఏ పని చేసినా పిల్లల

గురించే ఆలోచిస్తుంది. సాధారణంగా రోజులు లెక్కించడం అనేది ఏదో ఒక పరిణామం కోసం ఎదురుచూస్తూ చేసే పని. ఇక్కడ కూడా ఆ పరిణామమే కావాలి అమ్మకు. తన కొడుకుకి ఉద్యోగం రావాలి, అది ఆమె ఆశ. ఇది ఎప్పుడు చేస్తుంది? చేట ముందు పెట్టుకున్నప్పుడు చేటలో ఉండేవి ఏమిటి? బియ్యం. అది ఆహారానికి సంకేతం. అంటే కొడుకు భవిష్యత్తులో తనకు తిండి పెట్టాలి అనే కోరిక కాదు. ఇక్కడ. కొడుకుకు జీవితాంతం తాను పోయాక కూడా శాశ్వతంగా కడుపునిండా తిండి దొరకాలి అనే పరమార్థం అమ్మ ఆశ, ఆశయం. చేట డేట్లు అనే భావచిత్రాలు సాధించిన కవితాత్మకత ఇలా ఉంటుంది.

**కవిత్వం ఎప్పుడూ కూడా కవిత్వ శక్తిని ప్రదర్శించడానికి తప్ప కవి శక్తిని ప్రదర్శించడానికి కాదు.**

అలాగే మరొకటి శారదా అశోక వర్ధన్ రాసిన నానీలో చూద్దాం. "కసుగాయాలను రాళ్ళతో రాల్చేస్తున్నారు/ రేపటి ఫలాలు/ నిష్ఫలాలెనా". ఇందులో రాల్చేయడం భ్రూణ హత్యలకు, రాళ్ళు అంటే గర్భ విధ్వంసక కారణాలైన మందులు. "రొయ్యల మడుగుల క్రింద/ భూమాత కళేబరం/ వల వేస్తే/ డాలర్లే పడ్డాయి". ఇక్కడ డాలర్లు అనేది ప్రపంచీకరణకి ప్రతీక. మనిషి జీవన అవసరం కోసమే ప్రకృతిని ఉపయోగించు కోవాలి తప్ప వ్యాపార అవసరం కోసం కాదు డబ్బు కోసం ఆధారమైన నేల తల్లిని నాశనం చేసే మనిషి దుశ్చర్యని ఈ నాని కవితాత్మకం చేసింది.

"కవి సమయాల నుండి/ విముక్త మైంది/ ఇప్పుడామె/ అహల్య".

ఇందులో అహల్య పురాణ ప్రతీక. ఈ ఒక్క పదంతో ఒక గొప్ప అంశం ఈ నాని చెప్పడం జరిగింది. అహల్య ఒక అందమైన స్త్రీ. ఆమెను కోరిన ఇంద్రుడు అవలంభించిన తప్పుడు మార్గం వలన భర్త అయిన గౌతముని శాపం పొంది రాయిలా మారుతుంది. రామపాదం తాకి తిరిగి అందమైన స్త్రీ గా మారుతుంది. దీనిని ఆధారం చేసుకొని ప్రస్తుత నాని నిర్మాణం జరిగింది. కవిసమయాలు అంటే కవిత్వంలో అందం కోసం ప్రవేశ పెట్టబడిన ఒక అంశం. ఇవి ఒక్కోసారోరి అవసరాన్ని దాటి కూడా ప్రయోగింపబడి రచనలో సారం తగ్గేది. ప్రబంధానంతర కాలంలో జరిగింది ఇదే. కవిత్వం ఎప్పుడూ

కూడా కవిత్వ శక్తిని ప్రదర్శించడానికి తప్ప కవి శక్తిని ప్రదర్శించడానికి కాదు. కవిసమయాలు ఎక్కువగా ఉన్నప్పుడు కవిత్వం అర్థంకాని బండరాయి అయితే అవి తగ్గిపోయాక స్వచ్ఛమైన కవిత్వం అందమైన అహల్య అన్నమాట.

కవిత్వం నవ నవోన్మేశ శాలిని అన్నట్టుగా ఉండాలి. కొత్తదనం వాస్తవ దూరం కానిది అయి ఉండాలి.

**కవిత్వంలో కవిత్వం :**

కవిత్వంలో కవితాత్మకత అనేది అందులోని భావం, బాష, అలంకారాలు బట్టి ఉంటుంది నానీలు అలాంటి కవితాత్మకతను కలిగి ఉండటమే కాదు ఆ కవితాత్మకత వివరించి చెప్పేవి కూడా ఉన్నాయి. "కవి కొండెక్కి కూర్చున్నాడు భావం నేలరాలి పోయింది" (రఘు). ఇక్కడ భావానికి ప్రాధాన్యం ఇవ్వని కవిత్వం వ్యర్థం అనే సూచన ఉంది. అలాగే "ఆ పద్యం హుందాగా అందంగా ఉంది స్పందనలు మాత్రం అంతంత మాత్రం" (గోపి). పదాడంబరం కాదు కవిత్వం అంటే చక్కని చిక్కని భావం ఉండాలి. "భాషతో చెక్కితే/ భావం ఏర్పడదు/ భావమే/ మాటల్ని వేదిస్తుంది" (గోపి)". గొప్ప కవిత్వం / అంటే ఏమిటి / నిత్య నూతనం / సత్య సుందరం" (మసన చెన్నప్ప). ఎలాంటి దాపరికాలు లేకుండ కవిత్వాన్నికి చిన్న నానీలో ఇచ్చిన నిర్వచనం ఇది. కవిత్వం నవ నవోన్మేశ శాలిని అన్నట్టుగా ఉండాలి. కొత్తదనం వాస్తవ దూరం కానిది అయి ఉండాలి.

"దహనంలో / కుడి చెయ్యి కాలలేధు / కారణం / కలం పట్టిన చెయ్యి"

"పుస్తకాలకు / రెక్కలుండవు / చదివితే / మనకు పుట్టుకొస్తాయి (రఘు)

నానీలలో కవిత్వ గొప్పదనాన్ని వర్ణించినవి పై నానీలు.

**ముగింపు :** సూక్ష్మమైన రూపంలో నానీలలో విస్తారమైన కవితాత్మకతను ఇమిడ్చిన నానీ కవుల, కవయిత్రుల సృజనకు మరోసారి వందనంతో సదా కవిత్వం నిలవాలి, గెలవాలి. స్వచ్ఛమైన కవిత్వానికే నానీలు రాయాలి కానీ ఏది పడితే అది రాశి నానీ అనకూడదు. కవిత్వ, ఒక గొప్ప అనుభూతి అది నానీల ద్వారా వికసించాలి, విస్తరించాలి.

**పాదసూచికలు:**

1. ఎస్ .గోపి – నానీలు
2. సంగనభట్ల నర్సయ్య – తెలుగులో దేశీ ఛందస్సు ప్రారంభ వికాస దశలు
3. ఎస్. రఘు జీవనలిపి
4. శారదా శోక వర్ధన్ – నానీలు – బాణీలు

**ఉపయుక్తగ్రంథసూచి:**

**ఉపయుక్త గ్రంథాలు :**


గోపి ఎన్.– నానీలు , 1998 చైతన్య ప్రచురణలు, హైదారాబాద్

గోపి ఎన్. గోపీ నానీలు, 2002, చైతన్య ప్రచురణలు, హైదారాబాద్

నర్సయ్య సంగనభట్ల– తెలుగులో దేశీ ఛందస్సు ప్రారంభ వికాస దశలు, 1991, ఆనంద వర్ధన ప్రచురణలు, ధర్మపురి.

భల్లం.ఎస్.ఆర్ – గూడు వదిలిన గువ్వలు, 2000, రచనా సాహితీ గృహం, తాడేపల్లి గూడెం.

రఘు .ఎస్. – జీవనలిపి 2004 మనస్విని ప్రచురణలు, ఖమ్మం.




"స్వతంత్ర దృక్పథం గల కవి మాత్రమే నూతన ఆవిష్కరణ చేస్తాడు. సమాజం పట్ల నిబద్ధత, సామాజిక సమస్యల పరిష్కారాన్వేషణ, తపన వున్న కవికి మాత్రమే అది సాధ్యం. డా.ఎన్. గోపి సృష్టించిన నానీలు అలాంటి ప్రతిభా గీతికలు"

– ఏ.బి.కె. ప్రసాద్



# శ్రీనివాస్ నానీలు

సి.వి.శ్రీనివాస్, ✆ 9985889434



ఇస్తారాకుకేమో
పరమాన్నం!
కుట్టిన చేతులకేమో
పస్తులా!?

రక్తానిది కూడా
గ్రూపిజమే
సార్వజనీనం
కన్నీరొక్కటేనేమో!!

అమ్మ కూడా
నిత్యాగ్నిహోత్రే!
తాను పొయ్యి ముట్టియ్యని
రోజుంటదా!?

ఎన్నికల్లో
వికసించిన హామీలు
అసెంబ్లీ సాక్షిగా
వాడిపోయినై!
సొంత కుటుంబానికే

ఆడబిడ్డయ్యింది భూమి!
హృదయంలో
తడి ఉన్నందుకే!

బరువెక్కిపోతున్న
స్కూల్ బ్యాగ్!
తల్లిదండ్రుల ఆశల్ని
మోయలేకనే!!

ఊరి చెరువు
ఎండిపోయింది.
ఎండిపోనిది
గుండెచెరువే కదా!



# 'నానీ' నిర్మాణ కౌశలం, రచనావిన్యాసం

డాక్టర్ బి.బాలకృష్ణ 9948997983

తెలుగు కవిత్వంలో ఎప్పటినుండో ప్రయోగాలు కనబడుతున్నాయి. కవిత్వం సమాజాన్ని బట్టి మారుతుంటుంది. ఒక్కో సమాజంలో దాని బాధ్యత ఒక్కోరకంగా ఉంటుంది. నన్నయ కాలంలో ధర్మప్రచారమైతే, శివకవి యుగంలో కులవ్యతిరేక బాధ్యతలను తీసుకుంది. శ్రీకృష్ణదేవరాయల కాలం నాటికి సరసవినోదాలకు, పాండితీప్రకర్షకు మాత్రమే పరిమితమైనట్టు కనిపించింది. ఈ విధంగా కవిత్వం తన రూపురేఖల విషయంలో కూడా ఆయా కాలాల మనుషుల మనస్తత్త్వానికి తగ్గట్లే మార్చుకుంటూ వస్తున్నది. ఒకప్పుడు పురాణమని, శతకమని, ప్రబంధమని, కావ్యమని– ఇలా ఎన్నో విధాలుగా మారుతున్నది.

ఆధునికకాలంలోసరదాకోసంరాసేకవిత్వమేకాకుండా,సమాజశ్రేయస్సు ఆకాంక్షించి రాసే కవిత్వమే ఎక్కువగా వస్తున్నది. దేశకాల పరిస్థితులను ప్రతిబింబించని ఏ సాహిత్యమైనా అది కాలగర్భంలో కలిసిపోవాల్సిందే. కాబట్టి సమాజ స్పృహ కవిత్వంలో కచ్చితం. మరి సమాజ స్పృహ మాత్రమే ఉండి, అది చాలా పెద్దగా ఉంటే కూడా సోది చెబుతున్నట్టుగా భావిస్తారు పాఠకులు. కాబట్టి నూతన ప్రక్రియలను కూడా నేటి కవులు చేపట్టవలసిన చారిత్రకమైన అవసరం ఎంతైనా ఉంది. అందులోను ఎక్కువగా "అల్పాక్షరాలలో అనల్పార్థ రచన" ఉండాలని తాపత్రయంలో పడుతున్నారు. నేటికాలపు సినిమాలను చూసినట్లైతే ఈ విషయం మనకు బోధపడుతుంది.

సంభాషణల్లో సంక్షిప్తత, గాఢత, గేయ రచనలో కూడా సంక్షిప్తత, గాఢత కనిపిస్తాయి. ఒక గొప్ప తత్త్వాన్ని దాని లోతుల వరకూ పోకుండా పంచ్ డైలాగుల్లో, తేలికపాటి మాటల్లో అర్థగాంభీర్యం సాధించడం మనకు

తెలిసిందే. ఈ విధంగానే నేటి కవులు కూడా ప్రక్రియ ఏదైనా, పాఠక లోకాన్ని ఆకట్టుకొనే విధంగా తమ కవిత్వం ఉండాలని భావిస్తూ తమ రచనలు చేస్తున్నారు. అందుకోసం వారు పాశ్చాత్య కవితా ప్రక్రియలను కూడా అనుకరిస్తున్నారు, అనుసరిస్తున్నారు. ఇలాంటి తరుణంలోనే తెలుగు కవిత్వ చరిత్రలో ఒక 'దేశీయ కవితా ప్రక్రియ' అనుభవజ్ఞుడైన ఒక కవి జీవితానుభవాల లోగిళ్ళ నుండి జీవం పోసుకుంది. అదే 'నానీ' ప్రక్రియ.

**కొత్త ప్రక్రియలు రాయాలనుకొనే వారికి, కొత్తగా కవిత్వాన్ని చెప్పాలనుకునే కవులకు నానీ ప్రక్రియ ఒక సాధనగా ఉపయోగ పడుతుంది.**

## నానీ లక్షణం

ఒక అనుభజ్ఞుడైన వ్యక్తి చేత సృష్టించబడింది కనుక నానీ రూపురేఖలు, విన్యాసాలు, సూత్రాలు కొంత పటిష్టంగానే ఉన్నాయి. ఇది కాలక్రమంలో మార్పులకు గురౌతూ వచ్చిన ప్రక్రియ కాదు. దీని నిర్దిష్టమైన సూత్రం ముందే నిర్మించబడింది. ఒక్కరి చేతిలోనే రూపుదిద్దుకుంది కాబట్టి, ఈ ప్రక్రియలో స్పష్టమైన రూపం కనిపిస్తుంది. ముందే చట్రం ఏర్పరుచుకున్నందున కవి తన మానసంలో రెక్కలు కట్టుకొని విహరించే భావాల్ని కవిత్వీకరించుకోవడమే తరువాయి.

ఈ ప్రక్రియలో కాఠిన్యం తక్కువ కాబట్టి చదవాలనుకొనే వారికి, రాయాలనుకొనే వారికి ఎటువంటి పేచీ లేకుండా భావ వాహకం జరుగుతుంది. అందుకే సీనియర్ కవుల నుండి ఇప్పుడే కలం పట్టిన కవి బాలకుల వరకూ అందరూ ఈ ప్రక్రియలో తమ కవిత్వాన్ని ప్రవహింపజేస్తున్నారు. అంతేకాక కొత్త ప్రక్రియలు రాయాలనుకొనే వారికి, కొత్తగా కవిత్వాన్ని చెప్పాలనుకునే కవులకు నానీ ప్రక్రియ ఒక సాధనగా ఉపయోగపడుతుంది. మరొక విషయం, ప్రతీ నానీకి, ఇంకో నానీకి మధ్యలో కవి ఎంతో ప్రసవ వేదన పడాల్సి ఉంటుంది. ఒక పద్యం బ్రహ్మాండంగా రాసి, మరో నాలుగు పద్యాలు పేలవంగా రాసి ఒక వచనం జోడించి, మళ్ళీ ఓ అద్భుతమైన పద్యాన్ని చెప్పి కావ్యాన్ని గానీ, ప్రబంధాన్ని గానీ పూర్తి చేయవచ్చు. కాని నానీల విషయంలో ఒక స్పష్టమైన, తీవ్రమైన లోకోత్తరమైన విషయాన్ని చెప్పిన అనుభూతి కలగాలి. అపూర్వ వస్తు నిర్మాణం ప్రతి 20–25 అక్షరాలలో కన్పించాలి. అంటే ఎక్కడా జారిపోయే

వెసులుబాటు లేదు. కావ్యంలో ఎస్కేప్ అయినట్టు నానీల్లో కవి ఎస్కేప్ కాలేదు. ఒకవేళ పేలవంగా రాస్తే ఆ నానీని పాఠకుడు అక్కడే వదిలేస్తాడు. ఇంకో నానీ కోసం సహృదయుడు వెదుకుతాడు. మరో విషయం ఈ ప్రక్రియలో కవి సమకాలీన సమాజాన్ని దాటిపోలేదు.



సీత కోరుకుంది
అయోధ్యనో,
అడవినో కాదు
తనమీద రామయ్య
నీడ ఈ నానీలో
దాదాపు రామయణ
కథ యొక్క
ముఖ్య ఉద్దేశం
చెప్పబడింది.



## నానీల ప్రత్యేకత

ఆధునిక జీవన విధానంలో ఏ పనైనా తొందరగా అయిపోవాలన్న మనస్తత్వం ఎక్కువైంది. ఆ పరిణామాన్ని దృష్టిలో పెట్టుకొనే సాహిత్యంలో మినీ కథ, మినీ నవల, మినీ కవిత, హైకూ, నానీ లాంటి ప్రక్రియలొచ్చాయి. పాఠకునికి చదివే ఓపిక, సమయం లేవు. అదే ప్రాచీన సాహిత్యంలో ఆదర్శ దాంపత్యాన్ని గురుంచి చెప్పాలంటే, సీతారాముల కథ తీసుకొని కథను వర్ణనలతో సాగదీస్తూ, ఎన్నో ధర్మాలను, నీతులను, సూక్ష్మాలను మిళితం చేస్తూ చెప్పాల్సి వచ్చేది. ఇక్కడ ఎక్కువ బుద్ధిని ఉపయోగిస్తూ చదువరుల మానసాలకు ఆహ్లాదాన్ని కలిగిస్తూ, రసానందాన్ని ప్రసాదించడం కవి ఉద్దేశం. కానీ, ఆధునిక ప్రక్రియలలో పైన చెప్పినదంతా సంక్షిప్తంగా రావాలి.

"సీత కోరుకుంది /అయోధ్యనో, అడవినో కాదు /తనమీద /రామయ్య నీడ"

ఈ నానీలో దాదాపు రామయణ కథ యొక్క ముఖ్య ఉద్దేశం చెప్పబడింది. పాఠకుడికి కట్టే, కొట్టె, తెచ్చే అన్నట్టుగా కథ స్ఫురిస్తుంది. పాఠకుని హృదయంలో మెరుపు మెరిసే విధంగా ధర్మసూక్ష్మాలు కానీ, నీతికానీ ఉండాలి. ఎక్కువ సేపు ఆలోచించకుండానే, అయోమయంలో పడవేసే విధంగా కాకుండా, వెంటనే స్ఫురించే భావాలకే నానీలో పెద్దపీట. ప్రాచీన కవిత్వంలో కవి చెప్పదలచుకొన్నదంతా పాఠకుని ముందుంచడానికి అవకాశముంది. కానీ ఈ లఘు రూపాల్లో పాఠకునికి ఏది కావాలో కవే నిర్ణయించి అంతే మొత్తంలో పాఠకలోకానికి అందించాలి. పొరబాటున ఎక్కువ చెప్పడానికి వీలులేకుండా ఉండడమే ఈ ప్రక్రియల లక్షణం. ఇది కవి ప్రతిభకు పరాకాష్ఠ.

## నానీ - కవితా వస్తువు

ఈ ప్రక్రియలో కవితా వస్తువులు సమకాలీన ఈతి బాధలు, ప్రకృతి ఆరాధన, వైపరీత్యాలు, ప్రపంచీకరణ నేపథ్యంలో ఛిద్రమౌతున్న పల్లెలు, వృత్తులు, ప్రజల జీవన విధానం, పేదరికం, కారణాలు, అవినీతి రాజకీయలు, కౌటిల్యాలు, కాపట్యాలు, ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం, కార్పోరేటు వ్యవస్థ, విద్య, రైతు, ఉద్యమకారుల ఆత్మహత్యలు, దళితుల ధర్మపోరాటం, ఉగ్రవాద వ్యతిరేక కవిత్వలు, వ్యక్తిత్వ వికాస సోపానాలు ఎన్నో వైవిధ్యమైన వస్తువులను ఈ ప్రక్రియలలో గ్రహిస్తున్నారు.

ఒక భావం పద్యంలో చెబితే దాన్ని ధ్వని గర్భితంగా చెప్పాలంటే చాలా కష్టపడాల్సి వస్తుంది. కానీ నానీలో సులభంగా చేప్పేయ్యొచ్చు

## నానీ పద్యం

వేమన, సుమతీ మొదలైన శతకాలలో పద్యాలు ముక్తకంగా ఉంటాయి. ఈ ముక్తకాలలో కొటేషన్స్ రూపంలో ధర్మసూక్ష్మాలను, నీతులు, సమాజ, సాంస్కృతిక, మనస్తత్వ, వ్యక్తిత్వ విషయాలు చెప్పబడ్డాయి. నానీల్లో కూడా ఇటువంటివే ఉంటాయి. తేడా ఏమిటంటే శతకాల్లో ఉండే పద్యాలు మకుట నియమం, యతులు, ప్రాసలు, సంఖ్యలు ఇలా ఎన్నో విషయాలు కట్టుదిట్టంగా ఉంటాయి. కాని నానీల్లో అటువంటి కట్టుదిట్టత ఏమిలేదు. ఒక భావం పద్యంలో చెబితే దాన్ని ధ్వని గర్భితంగా చెప్పాలంటే చాలా కష్టపడాల్సి వస్తుంది. కానీ నానీల్లో సులభంగా చేప్పేయ్యొచ్చు, పద్యానికుండే కట్టుబాట్లు దీనికి లేవు. పైగా వెసులుబాట్లు ఎక్కువగా ఉన్నాయి.

అలాగే ప్రాచీన సాహిత్యంలోని పద్యాల్లో కొన్ని జాతీయాలు, పలుకుబడులు, పదబంధాలతో చమత్కారాలతో ఉపమాన ఉపమేయాలతో కొటేషన్స్ నిర్మించేవారు.

ఉదా:– "గత కాలము మేలు వచ్చు కాలము కంటెన్"; "ముదితల్ నేర్వగలేని విద్యగలదే ముద్దార నేర్పించినన్"; "పేరలుకన్ జెందిన కాంతల్ ఉచిత వ్యాపారంబుల్ నేర్తురే" మొదలగునవి. ఆయా పద్యాలకే కావ్యాలకే మకుటాయమానంగా నిలుస్తాయి. కానీ ఆయా పద్యాల్లో చమత్కారంగా,

కొటేషన్‌లాగా ఉన్న పద్యాలు చాలా తక్కువ. ఆ పద్యంలోని ఏదో ఒక ముక్క మాత్రమే కొటేషన్‌సలానో, భావ చమత్కారంగానో, రస చమత్కారంగానో కనబడుతుంది. కానీ నానీల్లో ఒక నానీ మొత్తం కొటేషన్ అయితే కొటేషన్ రూపంగానే, రస చమత్కారం అయితే రస చమత్కారంగానే మనకు కనపడుతుంది. ఒక్క పదాన్ని, వాక్యాన్ని కూడా విడిచిపెట్టకుండా నానీని మొత్తం చదవాలనిపిస్తుంది. అలాగే నానీ కూడా గుర్తుంచుకోవడానికి కూడా వీలవుతుంది. మన ప్రాచీన సాహిత్యంలోని కొన్ని భావాలు మాత్రమే ఇలా రసచమత్కారంతో కనబడతాయి. మిగతావన్నీ మామూలుగా కథలో అంతర్భాగాలే. కవి ఆత్మాశ్రయంలో చెప్పే పద్యాలు కొన్నే ఉంటాయని మనకు దీన్నిబట్టి తెలుస్తుంది. కానీ ఇక్కడ నానీలన్ని ఆత్మాశ్రయ భావాల రూపంలోనే ఉంటాయి. పద్యాలను కంఠస్థం చేయడం కష్టం, నానీలు చాల తేలికగా గుర్తుండిపోతాయి, ఎందుకంటే నానీ మనిషి జీవిత సూత్రాన్నంతా నింపుకున్న చిన్ని కలశం. పాత పద్యం కంటే కొత్త నానీ మిన్న అనవచ్చు. ఆధునికత అంటే సౌలభ్యం అనే అర్థంలో వాడుకున్న తప్పులేదు. ఎందుకంటే ప్రాచీనతలో ఉండే సవరణే, నూతన మార్పే, కొత్త ప్రయోగమే, సులభతరమే ఆధునికత అవుతుంది.




## నానీ - ఛందస్సు

ఆటవెలది లాంటి ఉపజాతులు, కందాదులవంటి జాతి పద్యాలలో, ఉత్పలమాల లాంటి వృత్తాలలో ఛందో నియమాలుంటాయి. ఆ నియమాల ప్రకారమే మనం భావాన్ని కూర్చాలి కానీ, ఇక్కడ నానీ విషయంలో ఛందో నియమాలేమీ లేవు. ఒక్క అక్షర నియమం తప్ప. అది కూడా స్వతంత్రతతో కూడుకొన్న నియమం. ఈ నియమమే ఎంతో మందిని కవులుగా జేసింది. ఎంత ఛందోనియమాల ప్రకారం రాసినా, అది పద్యం అవుతుందే తప్ప హృద్యం కాదు. మరి పద్యం హృద్యం కావాలంటే, ప్రక్రియ ఏదైనా అందులో కవితాత్మ ఉండాలి. అదే విధంగా నానీ కూడా ఎంత సులభంగా రాసినా అందులో కవితాత్మ ఉండకపోతే అది హేళనకు గురి కాక తప్పదు.

## నానీ - అంతర్గత వివేచనం

నానీ ప్రక్రియను బాహ్యాంతర్గతంగా విడదీసి, అందులోని విషయ విశ్లేషణ చేయవచ్చు.




విషయ పర విశ్లేషణను తిరిగి రెండు రకాలుగా విభజించుకొనే వీలుంది. ఒకటి ఆత్మాశ్రయం, రెండవది వస్త్వాశ్రయం.

## నానీలు - రకాలు

నానీల్లో మనం విభాగాలు కూడా చేసుకోవచ్చు. అక్షరాల్ని బట్టి తీసుకొంటే ఆరు రకాల నానీలుంటాయి. 20, 21, 22, 23, 24, 25 అక్షరాలతో ఉండేవి. కొందరు 20 అక్షరాలకు ఎక్కువ రాయవచ్చు, కొందరు 25అక్షరాలకు ఎక్కువ రాయవచ్చు.

దేశీ కవితలో ఉండే వెసులుబాటు సౌకర్యం వంటిదే నానీలలో అక్షర సంఖ్య + పాదదైర్ఘ్యత వీలును బట్టి అక్షరాల సంఖ్యలో మార్పు చేసుకోవచ్చు. (20 నుంచి 25 మధ్యలో).

ఉదా: "మా ఊరంతా /నా కుటుంబమే /పట్నంలోనే /పక్కవాడు పరాయి"(20అక్షరాలు)

ఈ నానీలో కవి తన అభిప్రాయాన్ని ఇరవై అక్షరాలలో చెప్పాడు. ఈ కవితనే కవి ఇంకా గాఢాంగా, బలంగా కూడా చెప్పొచ్చు

ఉదా: "మా పల్లెపల్లెంతా /నా కుటుంబమే /పట్నంలోనే /నా వాళ్ళంతా పరాయి" (22అక్షరాలు)

పై నానీలో అక్షరాల సంఖ్య 25 మించలేదు కాబట్టి దీన్నీ కూడా నానీగా గుర్తించొచ్చు. ఇలాంటి వెసులుబాటు ఇతర ప్రక్రియల్లో లేదనే చెప్పొచ్చు. ఇంతకు ముందు నానీ 20 అక్షరాల కవితకు ఉదాహరణైతే ఈ నానీ మిగతా అక్షరాలకు ఉదాహరణ.

"పల్లె చెరువులో /తల్లి చేప /పట్నం ఎక్వేరియంలో /పిల్ల చేప"(21 అక్షరాలు)

"శబ్దాలన్నీ /విఫలమైన చోట /ఆదుకొనే అభివ్యక్తి /సంగీతం"(22 అక్షరాలు)

"కాలాన్ని /ఆపగలిగితే బాగుండు /అమ్మను /వెళ్ళనివ్వక పోదును"(23 అక్షరాలు)

"నేస్తం! /నువ్వే నాకు సమస్తం /గుండె గూట్లో /ఊపిరి గువ్వ ఉన్నంత వరకూ"(24 అక్షరాలు)

ఇలాంటి వెసులుబాటు సౌకర్యం కవితా రచనకు స్వేచ్ఛను ప్రసాదిస్తుంది, కాబట్టి కవి తన ఆలోచనాతరంగాలకు తన ఇష్టానుసారం రూపమివ్వగలడు. అభివ్యక్తికి ఎలాంటి ఇబ్బంది కలగదు. భావానికి తగిన రూపాన్ని కవి ప్రదర్శిస్తాడు. దీని వల్ల నానీ కవిత్వ రచన సుగమమౌతుంది కూడా. పాద దైర్ఘ్యత ఒక కొలమానంగా కచ్చితంగా ఉండదు. విభిన్నత, వైవిధ్యమూ చేకురే అవకాశం ఉంది.

నానీల్లో వ్యవహారిక భాషాపదాలు, మాండలికాలు ఎక్కువగా ప్రయోగించబడడం వల్ల కొంతమందికి అవి కొరుకుడు పడక నానీలను కవిత్వంగా ఒప్పుకోవడానికి వారికి మనస్కరించ లేదు. కవిత్వంలో ఉపయోగించే సాధారణ భాష ద్వారానే నానీ కవి కవిత్వాన్ని రాస్తాడు. కవిత్వాన్ని కవిత్వం చేయడానికి భాషేతర అంశాలు వేరే ఏవీ లేవు. వ్యావహారిక భాషే కవితీకరణ చెందాక కవిత్వం అవుతుంది. కవిత్వం రాసాక అది కవిత్వంగా పిలువబడుతుందే కానీ మళ్ళీ కొత్త భాషగా గుర్తింపబడదు. గుర్తింపు పొందినా అది కవిత్వం అనే గుర్తింపును కోల్పోదు. నానీల్లో ప్రయోగించబడిన పదాలు నానీలుగా రాయకముందు అవి సాధారణమైన పదాలు. ఆ పదాలను ఉపయోగించి నానీలను రాశాక, ఒక పదాన్ని పాదంగా రాసినా కూడా అది నానీలో ఒక పాద విభాగమే అవుతుంది.

## నానీల్లో సాంద్రత

నానీ కవితల్లో కవిత్వం పాలు తక్కువనే వాదన ఒకటుంది. ఒక పద్యప్రక్రియలోగానీ, ఒక వచన కవితా ప్రక్రియలోగానీ కవిత్వం పాలు ఎంతో

ఇంత ఉండాలనే నియమాలు కానీ, నిర్దిష్టమైన సూచనలు కానీ ఇంత వరకూ ఎవరూ చేయలేదు. అసలు కవిత్వమంటే నాలుగు పాదాల్లో ఛందోబద్ధంగా అక్షరాలు కూర్చడం కాదు, ఏవో నాలుగు పదాలను ఒకదాని కింద ఒకటి పేర్చడం కాదు, అట్లాగని రాసిన ప్రతి పాదంలో కవితాత్మ ఉట్టిపడితేనే అది కవిత్వం కాదు. అందుకే 'వాక్యం రసాత్మకం కావ్యం' అని చెప్పారు పెద్దలు. ఒక కవిత సహృదయుడి మానసాన్ని పెనవేసుకోవాలంటే ఆ కవి ఎంతో శ్రమించాల్సి ఉంటుంది. దీన్నే మనం ప్రసవవేదన అంటుంటాం. కవితలో అందమైన శిల్పం ఉండాలి. పదాల నడకలో ఒక మంచి లయ ఉండాలి. దృశ్యాన్ని కళ్లకి కట్టేలా అద్భుతమైన చిత్రణ ఉండాలి. వీటన్నిటినీ మించి మనసుని కదల్చగలిగిన భావస్ఫురణ ఉండాలి. భావ సాంద్రత ఉన్న కవిత ఇంకేవీ లేకపోయినా మనహృదయాల్లో కలకాలం ఉండిపోతుంది. సందర్భానుసారంగా అప్రయత్నంగానే గుర్తుకొస్తుంది అదే కవితాసాంద్రత.



**కవితలో అందమైన శిల్పం ఉండాలి. పదాల నడకలో ఒక మంచి లయ ఉండాలి. దృశ్యాన్ని కళ్లకి కట్టేలా అద్భుతమైన చిత్రణ ఉండాలి.**



అసలు 'సాంద్రత' అంటే చిక్కదనం. ఈ చిక్కదనం ఏ పాదంలో ఉంటుందో లేదా ఎన్ని పాదాల్లో ఉంటుందో ఆ కవిత్వమే సహృదయుడి మానసాన్ని తాకుతుంది. దాన్ని అతడు చదివినప్పుడల్లా గొప్ప అనుభూతికి లోనవుతాడు. ఆ అనుభూతిస్థాయి వ్యక్తికీ వ్యక్తికీ మధ్య మారవచ్చు.

వచన కవితా పితామహుడు కుందుర్తి ఆంజనేయులు రాసిన 'హంస ఎగిరిపోయింది' ఇది భార్యా స్మృతి కావ్యం. హంస ఎగిరిపోయింది అనడంలోనే తాత్త్వికత స్ఫురిస్తుంది. ఈ కావ్యం కుందుర్తి వ్యక్తిగత అనుభూతికి సంబంధించినదే అయినా స్మృతికావ్యాల్లో గొప్ప కావ్యం.

"చుక్కొకటి రాలిపోయింది

పక్షవాతం రాకుండానే నా రెక్కొకటి వాలిపోయింది"

చాలా సాదాసీదాగా కనిపిస్తున్న రెండవ పాదంలోని భావాంశంలో

అంతులేని వేదన ఉంది. పక్షవాతం రాకుండానే చేయి పడిపోవటమంటే సగదేహమై కష్టసుఖాల్లో తోడుగా ఉండే భార్య మధ్యలోనే అస్తమించడం ఏ వ్యక్తికైనా చేయికొట్టేసినంత పనే అవుతుంది. చుక్క రాలిపోవడంలోని పరమార్థం మధ్యలో జీవితాన్ని వదిలి మనిషి వెళ్లిపోవడమే. ఇలాంటివే కాదు ఇంకా ఎన్నో సాంద్రత కలిగిన కవితలు నానీల్లో దండిగానే ఉన్నాయి. అయితే అక్షర, పాద సంఖ్యా నియతి, రెండవ భావాంశంలో ఉండాలనే నియమం నానీని మినీ కవితకు భిన్నంగా నిలుపగలిగింది.



**అంతులేని కాలగమనంలో రవ్వంతగా సాగే ప్రయాణమే జీవితం. తాత్త్వికత యొక్క చిక్కదనానికి ఉదాహరణ ఈ నానీ.**



"కాలం ఒక దారం /చివరి కొస ఎక్కడ? /వెతుక్కుంటూ వెళ్లటమే / జీవితం"

అంతులేని కాలగమనంలో రవ్వంతగా సాగే ప్రయాణమే జీవితం. తాత్త్వికత యొక్క చిక్కదనానికి ఉదాహరణ ఈ నానీ. ఎన్ని పుట్టుకలు, ఎన్ని చావులు, ఎన్ని యుగాలు – మనిషి ప్రయత్నం మాత్రం ఆగడం లేదు. ఆతని ప్రయాణమూ ఆగడం లేదు. వారసుడి రూపంలో మళ్లీ జన్మిస్తూనే ఉన్నాడు. కానీ అంతుచిక్కని కాలసూత్రపు చివరి కొనను మాత్రం అందుకోలేకపోతున్నాడు, అన్వేషణ కూడా ఆగడం లేదు. జిజ్ఞాస చావడం లేదు. ప్రయత్నమే ఊపిరిగా ప్రయాణం సాగుతూనే ఉంటుంది. అదే జీవితమంటున్నాడు కవి. చావు, పుట్టుకల మధ్య ఈ జీవి జీవించే ఆ నాలుగు రోజులు కూడా తన ఉనికికై ఆరాటమే, సాంకేతిక వైజ్ఞానిక రంగాల్లో ఎంతో ఉన్నతి సాధిస్తున్నా, ఆ కాలం యొక్క ఆచూకీ మాత్రం దొరకడం లేదు.

"మాటలు నేర్చిన పక్షులు /వలసబోతున్నై /ఈ దేశం /వృద్ధాశ్రమం"

ప్రపంచీకరణ నేపథ్యంలో వలసలు, డాలరుపై ఆశతో యువతరం విదేశాలపై పెంచుకుంటున్న అంచనాలు వెరసి మనదేశం ఖాళీ అయిపోతున్న గూడు, ఈ గూటిలో పక్షులకు రెక్కలొచ్చాయి, దాంతో పాటే నాలుగు ముక్కలొచ్చాయి. అందుకే అవి గూడును వదిలి కొత్త గూడును వెతుక్కుంటూ వెళ్తున్నాయి. తల్లిదండ్రులు ఎగరలేనివాళ్లు ఎక్కడుంటే ఏమిటి? మొదటి

రెండు పాదాల్లో వలస గురించి చెప్పి మిగిలిన రెండు పంక్తుల్లో దాని ఫలితం చెప్పబడింది. ఈ కవితలో దేశాన్ని ఉపమేయంగా, వృద్ధాశ్రమాన్ని ఉపమానంగా చెప్పడం చాలా మందిని ఆకట్టుకుంది.

ఊహలో కొత్తదనానికి, పదాల మరిమళాలనద్ది మనల్ని ఆఘ్రాణించమని వదిలారు ఈ నానీని.

**బిడ్డ భూమ్మీద పడి పెద్దైన తరువాత కన్నవాళ్లను పట్టించుకోవడం మానేయడమంత నైచ్యం మరొకటి లేదు.**

"మల్లెపూవ్వులు /స్నానమాడుతున్నాయ్ /నీలికురుల /సెలయేటిలో"

కవయిత్రి భావనా పటిమకు నిదర్శనమీ నానీ. మల్లెపూలు సెలయేటితోపాటు ప్రవహించడంలేదు. అక్కడే స్నానమాడుతున్నాయి. కురులను వాహినులతో, పూవులను తరుణులతో పోల్చడం మన కవులకు అలవాటే కానీ, ఈ రెండింటినీ ఒక చోటుకు చేర్చి కొత్తగా ఆవిష్కరించడం రచయిత్రి భావకవితా దృక్కోణానికి మచ్చుతునక.

"కడుపులో ఉన్నప్పుడు తంతే /బాధలేదు /బయట ఉండి తంతేనే / నరకం"

సంతానం లేనప్పుడు ఆ దంపతులు పడే బాధ వర్ణనాతీతం. సంఘం నుండి సూటిపోటి మాటలు, గొడ్రాలు అనే మాట స్త్రీ మనస్సును రంపపు కోతై నిరంతరం కరుకుగా కోస్తుంటే, నాన్న అని పిలిపించుకోని మగవాడి జీవితం కెరటాలు లేని సంద్రమైపోతుంది. ప్రసవం స్త్రీకి మరో జన్మ; మృత్యు ఆస్యంలోకి వెళ్లి రాగల స్థైర్యం అమ్మది. ఎన్నో కష్టనష్టాల కోర్చి నవమాసాలు బిడ్డను మోస్తుంది. పిండస్థ రూపంలో ఉన్న శిశువులో ఐదవ నెలనుండే కదలికలు మొదలౌతాయి. ఈ క్రమంలో తన్నడం అనేది సహజం. ఆ చేష్ట అనిర్వచనీయమైన మధురానుభూతి. కానీ బిడ్డ భూమ్మీద పడి పెద్దైన తరువాత కన్నవాళ్లను పట్టించుకోవడం మానేయడమంత నైచ్యం మరొకటి లేదు. సంతానాన్ని కనక ముందు, కనిపెంచిన తరువాత ఉన్న బాధాకరమైన వ్యత్యాసం గుండెను కోస్తుంది.

కనకముందు కడుపులో ఉన్నప్పుడు శిశువు తన్నే తన్ను గర్భిణీకి తియ్యని

బాధే కానీ, రెండోది నరకం అంటున్నాడు కవి. పశుపక్ష్యాదులు కని పెంచిన తల్లిదండ్రులను ఒక సమయం తర్వాత విడిచి పెడతాయి. అది వాటి సహజ లక్షణం. మానవుడట్లా కాదు, తనను ప్రేమతో పెంచి పోషించిన తల్లిదండ్రులను తిరిగి ప్రేమిస్తాడు. ఇది మానవ లక్షణం. ఇట్లా ప్రేమించలేని పుత్రుడుగాని, పుత్రికగానీ, పశుపక్ష్యాదులతో సమానం. ఒక పుట్టలో పుట్టి గిడుతున్న చెదలకు వీరికి భేదం లేదు. ఇందువల్ల మనవత్వం పశుత్వానికి దిగజారినట్లౌతుంది. తల్లిదండ్రుల మీద దయలేని పుత్రులకు చెంపపెట్టు ఈ నానీ. కవితలోని చమత్కారం అంతా ‘తన్నడం’లోనే ఉంది. ఈ నానీ శబ్దార్థ భేదాలు లేకుండా ‘తంతే’ పదం తాత్పర్య భేదంలో ప్రయోగించబడినా, ఎడం ఎక్కువయ్యి లాటానుప్రాసాలంకార పరిధిలోంచి తప్పుకొన్నది.



**సిపాయి భుజస్కంధం పై తుపాకి దాని బరువు దేశమంత చూడ్డానికి తుపాకే కానీ దాని బరువు మాత్రం ఈ దేశమంత.**



“సిపాయి భుజస్కంధం పై /తుపాకి /దాని బరువు /దేశమంత”

చూడ్డానికి తుపాకే కానీ దాని బరువు మాత్రం ఈ దేశమంత. ఈ కవితలో సాంద్రత అంతా ‘దేశమంత బరువు’లోనే ఉంది. సరిహద్దుల్లో సైనికుడు మోసేది కేవలం తూపాకే కాదు. అది ఒక దేశం పరువు. ఆ సైనికుడే ఈ భారం నాకెందుకులే అనుకుంటే దేశం గతి ఏమౌతుందో ప్రతీ ఒక్కరూ ఒక్కసారి ఆలోచించాలి. సైనికుడు ఉండబట్టే మనం గుండెల మీద చేయి వేసుకొని ఉండగల్గుతున్నాం. ఎండనకా, వాననకా ఇంటికి దూరంగా, అన్నింటికీ దూరంగా కొండల్లో ఎముకల కొరికే చలిలో దేశభారాన్ని తన భుజస్కంధాలపై మోసే వీరపుత్రులకు దేశం ఒక బరువన్న భావన ఏ కోశానా రాదు, రాకూడదు.

“నిండా మునిగిన రాతికి /చలి తెలియదు /చిత్రంగా /ఎండా తెలియదు”

నిండా మునిగితే చలి తెలియదు అనే సామెత ఈ నానీకి మూలం. ఆ సరస్సులోకి పూర్తిగా దిగితే దేహంలోని అణువుఅణువు శీతల బాధను అనుభవిస్తుంది. మరింత చలిని అనుభవించాల్సి వస్తుందేమోనన్న భయం తొలగిపోతుంది. ఈ భయం తొలగిపోవడాన్నే చలి తెలియకపోవడం

నానీలలో పదాలకు, వాక్య నిర్మాణాలకు కవి చెప్పే భావాలకు బాహ్య, భౌతిక సంబంధం మరోలా ఉంటుంది.

అంటున్నాం. ఈ సామెతలోని ప్రతి పదమూ ప్రతీకే. ఒకటి, రెండు కష్టనష్టాలు ఎదురైనప్పుడు బాధ పడతాం. మరిన్ని కష్టాలు ఎదురవుతాయేమోననే ఉద్విగ్నత కలుగుతుంది. ఎడతెరపి లేకుండా కష్టాలు వచ్చినప్పుడు మనిషి బాధను అనుభవించడానికి అలవాటు పడతాడు, మానసిక వేదన తగ్గిపోతుంది. దుఃఖాలకు అలవాటు పడితే దుఃఖం నశించిపోతుంది. అధికంగా వచ్చిన కష్టాలు మన మనస్సుపై వ్యతిరేక ప్రభావాన్ని చూపించలేవు.

'నిండా మునిగిన రాతికి' అనడం ఈ నానీలోని వైచిత్రి. బాధలు పెరిగిపోయినప్పుడు క్రమంగా మనిషిలో స్పందనాశీలత కూడా తరిగిపోతుంది. ఈ స్థితి శిలా సదృశమైంది 'ఎండా తెలియదు' అనేది ఈ నానీకి మూలమైన సామెతకు అర్థవంతమైన పొడిగింపు. 'ఎండ' స్వల్ప సంతోషానికి, స్వాంతనకు ప్రతీకగా చెప్పుకోవచ్చు. బాధలలో నిండుగా కూరుకుపోయిన వ్యక్తిని ఏదీ స్వాంతన పరచలేదని తాత్పర్యం. ఇలాంటి నానీలు బహుళార్థ బోధకమైనవి. కనుక వీటిని ఇంకా అనేక రకాలుగా అన్వయించుకోవచ్చు.

## నానీలు-కవిత్వాంశ

నానీలలో పదాలకు, వాక్య నిర్మాణాలకు కవి చెప్పే భావాలకు బాహ్య, భౌతిక సంబంధం మరోలా ఉంటుంది. కానీ అంతర్గతంగా ఏదో అద్భుతమైన భావన స్ఫురిస్తుంది. అదే 'నానీ' ప్రత్యేకత. ఉదాహరణ

"కుండ ముక్కలైందా /కుమిలిపోకు /మట్టి మరో రూపం కోసం / సిద్ధమౌతుంది"

ఈ నానీలో కుండ ముక్కలైన సన్నివేశాన్ని ఒక తాత్త్విక దృక్పథంలో సమర్థిస్తున్నాడు కవి. ఈ కవితలోని భావాంశాన్ని నానీ మొత్తంగా కాకుండా విడివిడిగా రెండేసి పాదాలలో చెప్పారు. నానీలను చదివేటప్పుడు కవి రాసిన భావంతోనే వాక్యనిర్మాణాన్ని దృష్టిలో పెట్టుకుని చదివితే తేలికగా అర్థమవుతాయి.

నానీలలో ముఖ్యంగా డైలాగ్స్, ఉద్యమ రూప నినాదాలు, కొటేషన్స్, చరుపులు, సాంఘిక వ్యంగ్యత, ధ్వని గర్భితం, నిగూఢత, సూటిదనం మొదలైన అంశాలు కన్పిస్తాయి. రామాయణాన్నో, మహాభారతాన్నో కవ్యరూపంగా నానీల్లో రాయలేం కానీ 'కట్టే, కొట్టే, తెచ్చే' అన్న విధంగా ఆ ఇతిహాసాల సారాంశాన్ని చూపవచ్చు.

నానీలలో వాస్తవికత, సందేశం, విశ్వశ్రేయస్సు, ప్రకృతి ఆరాధన ప్రాధానంగా కనబడతాయి.

ఒక గొప్ప నానీ రాయాలంటే మనసులో నుండి బయటకు వచ్చే సమయంలో వేనవేల భావాలకు కత్తెరలు వేస్తూ, 25 అక్షరాలలో పరిపూర్ణత సిద్ధింపజేయాలి. అంటే గొంగళిపురుగు సీతాకోకచిలుకగా మారే ఓపిక కావాలి. లేకపోతే పేలవమైన నానీలే వస్తాయి. పేలవమైన నానీలు, మనస్సు పైపొరల్లో ఊపిరిపోసుకొనే భావాలకు ప్రతీకలు, ఇవి తటిల్లతలు. ఇలాంటి వంద నానీలకు సహనంతో నిరీక్షించి, సరైన భావప్రకటనతో రాసే ఒక్క నానీయే గొప్పదని వేరే చెప్పనక్కరలేదు. వస్తువు ఎలాంటిదైనా కవిత్వీకరణ ఉంటేనే అది మనస్సును రంజింపజేస్తుంది.

ఇక నానీలలో వాస్తవికత, సందేశం, విశ్వశ్రేయస్సు, ప్రకృతి ఆరాధన ప్రాధానంగా కనబడతాయి. ప్రబంధకాలంనాటి రొమాంటిక్ వర్ణనలు, పురాణకాలం నాటి నీతి, ధర్మ సందేశాలు అంతగా కనబడవు.

ఎంత గొప్ప కవియైనా 100 నానీలు రాయాలంటే కనీసం 1000 నానీలైనా అతని మనసులో గింగిర్లు కొట్టాలి. అప్పుడే అందులోంచి కాలానికెదురీదగల 100 నానీలను అతడు ఎన్నుకోగలుగుతాడు.

వాస్తవానికి నానీల్లోని మొదటి రెండు పాదాలకు, తరువాతి రెండు పాదాల్లోని అంశాల్లో ఒకదానికి మరొకటి అంతఃసంబంధాన్ని కలిగి ఉంటాయి. కేవలం రెండు పాదాలనే నియమమేమీ లేదు. ఒకే పదానికి లేదా పాదానికి మిగతావాటితో కలసి అంతఃసంబంధం కూడా ఉండవచ్చు. అలాగే ఒక నానీల సంపుటంలో ఉండే అన్ని నానీల్లో కూడా ఒక అంతః సూత్రత ఉంటుంది. అది వస్తుపరంగా కావచ్చు, భావపరంగా కావచ్చు, రసపరంగా కావచ్చు. నానీల్లోనే

కాదు, సంపుటాలలోనూ కూడా పరస్పర సంబంధం సాక్షికంగా మనం గమనించవచ్చు. అదే కవిత్వాంశ.

> రెండు భావాంశాల మధ్య అర్థవంతమైన, అందమైన సమన్వయమే నానీని కవితాత్మకం చేసే ప్రధానాంశం.

కొన్నిసార్లు కొన్ని నానీల్లో అంతర్లీనంగా ఉన్న భావమేదో బయటపడకుండా ఇబ్బంది పెడుతుంది. అయితే మిగతా ప్రక్రియల్లో అర్థం చేసుకోవడానికి కొంత మేర వెసులుబాటు ఉంటుంది. కానీ నానీలలో నిడివి తక్కువ కాబట్టి పాఠకుని ఊహా నైపుణ్యానికే పెద్దపీట వేయాలి. అంతేకాక కవి అత్యంత ప్రతిభాపూర్వకంగా రాయాలి అంటే అందులో కవిత్వాంశ అంత ప్రభావవంతంగా అభివ్యక్తీకరించబడాలన్న మాట.

కవి ఆలోచనకు, పాఠకుని ఆలోచనకు మధ్యలో భాషా ప్రయోగం ఉంటుంది. రెండు భావాంశాల మధ్య అర్థవంతమైన, అందమైన సమన్వయమే నానీని కవితాత్మకం చేసే ప్రధానాంశం. రెండు భావాంశాల మధ్య సమన్వయం సాధించడంలో కవులు రకరకాల పద్ధతులను అనుసరించారు. ఉపమేయం–ఉపమానం, ఉపమానం–ఉపమేయం, బింబం–ప్రతిబింబం, ప్రతిబింబం–బింబం, ప్రశ్న–జవాబు, ప్రతిపాదన–సవరణ, ప్రతిపాదన–నిరూపణ, రెండు భావాంశాలలో ఒకే వస్తువుకున్న రెండు విభిన్న లేదా వ్యతిరేక లక్షణాలను చెప్పడం. భావ వైరుధ్యమున్న వాక్యాన్ని మొదట చెప్పి, రెండవ భావాంశంలో ఆ వైరుధ్యాన్ని పరిష్కరించడం మొదలైనవి నానీ కవులు అనుసరించిన కొన్ని పద్ధతులు.

"ఒట్టుగట్టున పెట్టి /బొట్టెళ్ళిపోయింది /అప్పులూ తిప్పలూ / ఆమెకొదిలేసి"

మొదటి భావాంశం, సందేహజనకంగా, భావవైరుధ్యముండేటట్లుగా నిర్మించబడింది. నిజానికి 3,4 పదాలను మొదట చెబితే వాక్య నిర్మాణం సహజంగా ఉంటుంది. కానీ ఈ చమత్కారం కలుగదు. 'ఒట్టు తీసి గట్టున పెట్టడం' అనే జాతీయాన్ని కవి ఇక్కడ సమర్థంగా ఉపయోగించుకున్నాడు. వెళ్ళిపోయింది అనే మాటను యౌగికార్థంలో బొట్టుకు, చనిపోవడం అనే నుడికారాంగా భర్తకు ఏకకాలంలో అన్వయించడాన్ని గమనించాలి. బొట్టు

తొలగిపోవడం వల్ల కేవలం ఐదవతనాన్ని కోల్పోయానన్నది మాత్రమే ఆమె బాధ కాదు జీవితాంతం తోడుంటానన్న పెళ్ళి నాటి ప్రమాణాన్ని నిర్లక్ష్యం చేయడమే ఈ ఒట్టుగట్టున పెట్టడం. ఇన్ని నష్టాలతోపాటు అప్పులనూ తిప్పలనూ ఆమెకొదిలేయడం ఆమె కష్టాలకు పరాకాష్ట. భర్తది ఆత్మహత్య అయినా, సహజమరణమైనా ఆమెకు మిగిలింది మాత్రం వేదనే. ఖండగతి ఈ నానీని గేయచరణంగా భాసింపజేయడమే గాక, నానీలో నివేదనకు పోషకమైందేమో!

**రెండు భావాంశాల మధ్య అర్థవంతమైన, అందమైన సమన్వయమే నానీని కవితాత్మకం చేసే ప్రధానాంశం.**

నానీలలో సాంద్రమైన కవిత్వాన్ని కవులు ఎలా నిక్షేపించారో ఈ కింద చూడచ్చు.

"గడ్డిపోచది /ఎంత త్యాగమో /తొక్కుతున్న పాదాన్ని /మెత్తగా నిమురుతుంది"

గడ్డి మెత్తదనానికి ప్రతీక. తనను అమాంతం తొక్కుతున్న, ఆ కాలి కిందపడి తన అణువుఅణువు విరిగిపోతున్నా తిరిగి లేచి ఆ పాదాన్నే ముద్దాడుతోంది. ఎంత చక్కని భావం. అపకారికి ఉపకారం చేసే గడ్డిపోచలాంటి ఉపకారుల వల్లే ధర్మం ఇంకా మనగలుగుతుంది.

"అడవిని కాచే వెన్నెల /వృథా కాదేమో /అడవికే అది /అందం కదా!"

అడవిలో కూడా ఆనందించే ప్రాణులున్నాయి. మరచిపోకు నాగరిక సోదరా అనే చురక. ఏ కవిత్వానికైనా వస్తువెంత ముఖ్యమో కవితాత్మకంగా చెప్పడం అంతే ముఖ్యం.

"పల్లె చెరువులో /తల్లి చేప /పట్నం ఎక్వేరియంలో /పిల్ల చేప"

ఈ నానీలో భావవిస్తృతి ఉంది. పల్లె నుంచి పట్నాలకు వెళ్ళి తల్లిదండ్రులను, పుట్టిన ఊరిని మరచి ప్రవర్తించే షోకిల్లాలు గుర్తుకువస్తారు.

"మల్లెల మెతుకులు /మామిడికాయ పచ్చడి /మరోజన్మ /ఎందుకంట"

'మల్లెల మెతుకులు' ఎంత కవితాత్మకంగా అన్నాడో! ఆకలైనప్పుడు తెలుస్తుంది అన్నం మెతుకుల అందం. రోజుకు రెండు పూటలో, మూడు పూటలో అన్నం తింటాం గదా! అయినా విసుగు రాదు. ఎందుకంటే అన్నం పాతదే కానీ ఆకలి కొత్తది. ఆకలి సమయంలో తెలుస్తుంది అన్నం విలువ. ఇటువంటి అవసర చైతన్యమే లేకపోతే జీవితం ఇంత సుందరంగా ఉండదు.



రాత్రంటేనే ఎన్నో వింతల సమాహారం. సాధారణంగా పల్లెల్లో రాత్రి కాగానే కీచురాళ్ళు చేసే సందడి అంతాఇంతా కాదు.



"మందార పూసింది /ఆకాశానికి / ఆకుపచ్చ రంగేసి /బొట్టు పెట్టినట్లు"

మందారమంటే ఉదయసూర్యబింబం. మరి ఆకుపచ్చరంగేమిటి? ఇక్కడే ఉంది స్వారస్యం. కవి చూస్తున్నది నేలపైనుంచి. పచ్చనిచెట్ల గుండా. ఆకాశం క్యాన్వాసుకు పచ్చనిరంగు అమరింది.

కవిత్వం అంటే పదాండంబరమే కాదు కదా! నానీల్లో చమత్కృతి కలిగిన కవితలు కూడా ఉన్నాయి.

"కీచురాళ్ళ సందడి /రాత్రి ప్రయాణం /ఒంటరితనానికి/కొండంత బలం"

రాత్రంటేనే ఎన్నో వింతల సమాహారం. సాధారణంగా పల్లెల్లో రాత్రి కాగానే కీచురాళ్ళు చేసే సందడి అంతాఇంతా కాదు. ఏదైనా ఊరికి వెళ్తూ రాత్రి పూట బస్సుదిగి ఊళ్ళోకి నడవాల్సి వస్తే ఇక అంతే. పైనంతా పరుచుకున్న చిక్కటి చీకట్లో, మిణుకు మిణుకుమనే నక్షత్రాల మధ్య ప్రయాణంలో. కీచురాళ్ళ శబ్దాలు ఒకింత వెన్నులో చలి పుట్టిస్తాయి. కానీ తుమ్మిడి నాగభూషణం మాత్రం అదే కొండంత బలం అనడంలో చమత్కారం చోటుచేసుకుంది. మరో చమత్కృతి

"నీట్లో చందమామ /గిలగిలా కొట్టుకుంటుంది /అలలపై /ఈతరాక!"

సమర్థవంతమైన నానీకి ఉండవలసిన ఈ చమత్కారం – పాఠకుడి చిత్తపు విత్తుని పల్లవింపజేస్తుంది.

"విసురుకుంటే /విజ్ఞాన పరిమళం /పుస్తకం /అక్షర కుక్షి కదా!"

ఈ నానీతో కవిత్వం నలుదెసలా వెదజల్లబడుతోంది. ఎందుకంటే పుస్తకాన్ని అటూఇటూ ఊపుతుంటే అందులోని విజ్ఞాన పరిమళం మానసాలను ఉల్లాసపరచడమే కాదు, ఆలోచనల అమృతాన్ని రంగరిస్తుంది.

నానీ ప్రక్రియలో ఉన్న ప్రధానాంశం చరుపు. ఈ చరుపు అదును చూసి ప్రయోగిస్తారు కవులు. సమకాలీన స్ఫూర్తితో, ఆర్తితో, ఊహా శాలీత్వంతో సాగిన రమేశ్ నానీని ఇక్కడ చూడచ్చు.

పంచ్ కొట్టడమంటే ఇదే. ప్రభుత్వాలు మారినప్పుడల్లా జరుగుతున్నదేమిటి? నిన్నమొన్న అసెంబ్లీని అదరగొట్టిన మద్యమే.

"మద్య నిషేధం అంటే /మధ్యమధ్యలో / నిషేధం /అన్నమాట....అంతే"

పంచ్ కొట్టడమంటే ఇదే. ప్రభుత్వాలు మారినప్పుడల్లా జరుగుతున్నదేమిటి? నిన్నమొన్న అసెంబ్లీని అదరగొట్టిన మద్యమే.

"రవి /పగటిదొంగ /పొద్దున్నే ఆకులు పేర్చుకున్న /ముత్యాన్ని లాక్కుపోతాడు"

గొప్ప భావచిత్రం. ఎండపొడ నేలను తాకుతూ వస్తున్నప్పుడు, మైదానాల్లో, చేలల్లోని, గరికపచ్చల కొసలపైన సుమించిన హిమమౌక్తికాల అందమే అందం. కానీ సూరీడి రాకతో, క్షణాల్లో అవి మన కళ్ళెదుట నుండి మాయమవుతాయి. ప్రకృతి తానే గీసుకొన్న చిత్రాన్ని ఎండతో తానే తుడిచేయడాన్ని కవిత్వీకరించాడు కవి. లాక్కుపోతాడు బదులుగా ఎత్తుకుపోతాడని అంటే బాగుండేదేమో కానీ అక్షరనియమం తప్పుతుంది.

"అక్క ముక్కుపుల్ల మీద /మెరుపులేని సూర్యుడు /బొంబాయి బస్సులో /బావ!"

ఒక చిత్రం, ఒక ఇమేజరీలోంచి వ్యథాభరిత వలసల్ని లాగి చూపించాడు అశోక్. తెలంగాణ పల్లెల్లోని బొంబాయి వలస బ్రతుకుల ముఖచిత్రం ఈ నానీ. గుండె గూడుపట్టుల్ని లాగిపడేసే విధివైపరీత్యం వలసపోవడం. కవిత్వాంశ అనేది నానీలలో ఒక ప్రధానమైన గుణమని పై కవితల ద్వారా గోచరమౌతుంది.

ఈ గుణాలతో వెలువడిన నానీలలో ఇవి మచ్చుకు మాత్రమే. నానీ కవులెందరో తమ రచనా విన్యాసాల ద్వారా సాంద్రమైన నానీ కవిత్వలను అందించారు.



**ప్రక్రియ లక్ష్యం కవిత్వమే కావాలి తప్ప, కవి తనకు తానుగా గుర్తింపు కోసం ఉబలాట పడకూడదు.**



ప్రపంచ సాహిత్యరంగంలో తెలుగు సాహిత్యం అనేక ప్రక్రియలతో విభిన్న రూపాలతో శాఖోపశాఖలుగా విస్తరించి తన ప్రాధాన్యతను, ప్రాబల్యాన్ని నిలుపుకుంటూనే ఉంది. ఆ దిశలో భాగంగా నేడు 'నానీ' ఒక ప్రక్రియగా అవతరించి తెలుగు కవితారంగంలో ఒక మణిపూసగా నిలిచింది. అనుభవజ్ఞుడైన కవి చేతిలో పురుడుపోసుకున్న నానీ ప్రక్రియ ఒక పటిష్ఠమైన పునాదిని కలిగి ఉంది. దానికి తోడు నిపుణత కలిగిన కవుల చేత నానీలు రాయబడ్డాయి కాబట్టి వారివారి రచనా విన్యాసాలతో నానీ ప్రక్రియలో గట్టిగింజలే ఎక్కువగా వచ్చాయి.

స్వతహాగా ఎవరైనా కవిత్వ పరిమాణాన్ని కుదించడానికో లేక దాని పరిమాణాన్ని పెంచడానికి పునుకోకూడదు. ఈ రెండింటిలో ఏది చేసినా, కవిత్వం తన సహజత్వాన్ని కోల్పోతుంది. అసలైన కవిత్వానికి కొలతల కన్నా అనుభూతి ప్రధానం. ఏ ప్రక్రియ అయినా, 'ప్రక్రియ సృష్టి' కోసం కాకుండా కవిత్వం కోసం పుట్టాలి. ఎప్పుడైతే కవిత కోసం మనోసంఘర్షణ జరిగి, మెదడు ప్రసవవేదనలోంచి పుట్టే రెండే రెండు వాక్యాలైనా సరే అవి అజరామరమైన అక్షరాలై కాలఫలకంపై నిలిచిపోతాయి. అప్పుడే అందులోని కవిత్వమైనా, ఆ ప్రక్రియ అయినా గుర్తించబడుతుంది. ప్రక్రియ లక్ష్యం కవిత్వమే కావాలి తప్ప, కవి తనకు తానుగా గుర్తింపు కోసం ఉబలాట పడకూడదు. కవిత్వం కోసం పుట్టే కవిత్వం ప్రక్రియగా మారవచ్చు లేదా ప్రక్రియగా గుర్తించబడవచ్చు. కానీ ప్రక్రియ కోసం మాత్రమే పుట్టే కవిత్వం, ప్రక్రియగా కాదుకదా, చివరకు కవిత్వం కూడా కాకుండా పోతుంది.

## ఉపయుక్త రచనలు


1. వి.త్రివేణి. తూనీగలు.
2. నన్నయ (వ్యాసం), ద్వా.నా.శాస్త్రి. తెలుగు సాహిత్య చరిత్ర.
3. చేమకూర వెంకటకవి. ప్రసిద్ధ పద్యం. సుభద్ర పరిణయం.
4. నంది తిమ్మన. ప్రసిద్ధ పద్యం. పారిజాతాపహరణం.
5. ఎన్.గోపి. గోపి నానీలు.
6. సంగనభట్ల నర్సయ్య, తెలుగులో దేశీ ఛందస్సు ప్రారంభ వికాస దశలు.
7. నాంపల్లి సుజాత. నెమలీకలు.
8. సోమేపల్లి వేంకట సుబ్బయ్య, తొలకరి చినుకులు.
9. ఎస్.రఘు. జీవనలిపి.
10. ఎస్.ఆర్.భల్లం. గూడు వదిలిన గువ్వలు.
11. పసనకర్ల ప్రకాశ్. గోదారికెరటాలు.
12. బూర్ల వేంకటేశ్వర్లు. రంగుల విల్లు.
13. దేవరకొండ బాలగంగాధర తిలక్ (వ్యాసం), ద్వా.నా.శాస్త్రి. తెలుగు సాహిత్య చరిత్ర.
14. గుంటూరు శేషేంద్ర శర్మ. శేషేంద్ర సాహిత్యం–1.
15. కుందుర్తి ఆంజనేయులు. తెలుగు సాహిత్య చరిత్ర, ద్వా.నా.శాస్త్రి.
16. నూటెంకి రవీంద్ర, అడవి కూనలు.
17. బి.బాలకృష్ణ, భావ చిత్రాలు.
18. అనిశెట్టి రజిత, గోరంత దీపాలు.
19. వల్సపైడి, కాలంతో కలం.
20. జిందం అశోక్, మానేరు నానీలు.
21. షెహనాజ్ ఫాతిమా, మౌన శబ్దాలు.
22. సురేశ్ తన్నీరు, ఆధునిక తెలుగు లఘుకవితలు – నిర్మాణం, వస్తువు.




# విజయ్ కుమార్ నానీలు



✆ 95055 20097

అమ్మమ్మ
బంధువై ఇంటికి వస్తే
చేతి సంచిలో వెతుక్కున్నాను
నా బాల్యం

అలలు తీరాన్ని
ముద్దాడుతూ
ప్రేమ గీతాలు
వ్రాసుకున్నాయి

ఎందరూ చదివినా
పుస్తకానికి
అహంకారం లేదు
చరిత్రలో నిల్చింది

నాన్నది
చీకటితో చెలిమి
కన్నీళ్ల
ఆనవాళ్లు దాచేసాయి

మట్టి గుండె పిండి
మెతుకులు రాల్చును
అన్నదాత
మరో మేజీసియన్

వర్షం
కురిసింది
కాగిత పడవలు
కబురు మోసుకుపోయాయి

కోడి, సూర్యుడిది
భలే చెలిమి
కూత వింటే చాలు
వచ్చేస్తాడు

నింగి, నేలల
వర్షపు యుద్ధంలో
బలైపోయాడు
బలహీనపు రైతు

మేఘానికి
హరివిల్లు అడ్డంగా
నిలిచింది
వడగండ్లు
వేయవద్దని

చిలుక
ఆకు, వక్కా వేసుకుంది!
నోటితో పాటు
పెదవులు పండాయి

నింగి
నడుముకు అందమైన
వడ్డాణం
ఏడు రంగుల హరివిల్లు



# ప్రాదేశిక నానీలు

డాక్టర్ తలతోటి పృథ్విరాజ్
8074004711

ప్రముఖ కవి డాక్టర్ ఎన్. గోపి గారి కలం నుండి ఓ తాత్విక నేపథ్యంతో 1997లో పురుడు పోసుకున్న కవితా ప్రక్రియ నానీ. రాను రాను అనేకమంది కవులు నానీలలో వస్తు వైవిధ్యాన్ని అనుసరిస్తూ రాశారు. అనేకులచేత నానీ ప్రక్రియ ఆదరింపబడుతున్న క్రమంలో నానీలలో తాత్వికత కంటే సామాజిక అంశాలతో... భావకతతోకూడిన అనేక నానీ సంపుటాలు వచ్చాయి. 2001లో ద్వానా శాస్త్రి గారు "సాహిత్య నానీలు" పేరుతో నానీ సంపుటి తీసుకు వచ్చారు.

"తెలుగుకి
'గజ్జెల్' కట్టిన
కాలం వెంట కవి
మన సాహితీ విశ్వంభరుడు!" అని డాక్టర్ సి. నారాయణరెడ్డి గూర్చి, "ఎబికె / ఆధునిక మాంత్రికుడు/ఎన్ని పత్రికలకి / పురుడు పోశాడో!" అని పాత్రికేయ రంగంలో తనదైన విలక్షణ శైలిని ఏర్పరచుకొన్న ప్రయోగశీలియైన శ్రీ ఎ.బి.కె. ప్రసాద్ గూర్చి వ్రాశారు. "పాకుడు రాళ్ళ / భరద్వాజ / గడ్డంతో / కరుణామయుడు!" అని జ్ఞాన్ పీఠ్ అవార్డు గ్రహీత డాక్టర్ రావూరి భరద్వాజ గూర్చి, "స్త్రీ వాదానికి / టీకా తాత్పర్యాలా? / నడిచే గాయాల / నిర్మలని చదువు".అని కొండేపూడి నిర్మలగారి గూర్చి రాయడం జరిగింది. ఒక నానీ సంపుటిలో వివిధ అంశాలను, వివిధ వస్తువులను అనుసరించి కవులు నానీలు రాసే విధానంనుండి, ఒక సాహిత్య అంశానికి పరిమితమై ప్రత్యేకమైన నానీ కవితావస్తువుగా తీసుకొని ద్వా.నా. శాస్త్రిగారు అనుసరించిన ఈ విధానం తదనంతర కవులకు ప్రేరణగా నిలిచింది. ఇలా వచ్చినవే ప్రాదేశిక నానీలు.

యాత్రా సాహిత్యం ఒక ప్రాంతాన్ని సందర్శించిన రచయిత తాను

పరిశీలించి, గ్రహించి, తెలుసుకున్న, అనుభూతి చెందిన విషయాలను రాస్తే, ప్రాదేశిక నానీలు రాసే కవులు వారి ప్రాంతంతో, వారి పరిసరాలతో వారికి ఉన్న అనుబంధాన్ని ఇలా ప్రాదేశిక నానీలుగా వ్యక్తీకరిస్తారు. ఒక ప్రాంత విశిష్టత, విశేషాలు, చారిత్రిక నేపథ్యాన్ని, ఆ ప్రాంతంలోని ప్రముఖ వ్యక్తుల, ప్రముఖ నిర్మాణాల, సాంస్కృతిక-చారిత్రిక, రాజకీయ, సాంఘిక అంశాలు, జీవన శైలి, సాదక బాధలను కవులు ఈ ప్రాదేశిక నానీల సంపుటిలో నానీలుగా పేర్కొంటారు. ఇలా 2001లో అంబల్ల జనార్ధన్ చే రాయబడి ప్రచురింపబడిన మొట్టమొదటి ప్రాదేశిన నానీ సంపుటే "ముంబై నానీలు "



ఒక ప్రాంతానికి, నగరానికి సంబంధించిన పేరుతో వచ్చిన నానీ సంపుటిలోని నానీలు



ఒక ప్రదేశానికి, నగరానికి సంబంధించి వచ్చిన ప్రాదేశిక నానీ సంపుటాలలో చోటుచేసుకున్న నానీలు ఇలా ఉన్నాయి.

1. ఒక ప్రాంతానికి, నగరానికి సంబంధించిన పేరుతో వచ్చిన నానీ సంపుటిలోని నానీలు అన్నీ ఆ ప్రాంతానికి చెందిన నానీలుగా రాయబడిన ప్రాదేశిక నానీ సంపుటాలు కొన్ని

2. ఒక ప్రాంతానికి, నగరానికి సంబంధించిన పేరును నానీ సంపుటికి శీర్షికగా పెట్టినప్పటికీ అందులో ప్రాదేశిక నానీలు నామమాత్రంగా మూడు నాలుగు మాత్రమే ఉండి మిగతావన్నీ అందరు రాసే సామాజిక వస్తు వైవిధ్య నానీలు ఉన్న సంపుటాలు మరికొన్ని.

3. ప్రాదేశిక నానీలుగా నానీ సంపుటికి శీర్షికగా పేరు పెట్టక పోయినప్పటికీ కొందరి నానీ కవుల నానీ సంపుటాలలో అక్కడక్కడ కొన్ని ప్రాదేశిక నానీలు దర్శనమిస్తాయి.

బొంబాయి నగరంతో ముడిపడి ఉన్న తన జీవితం గూర్చి అంబల్ల జనార్ధన్ మొదటిసారిగా 'బొంబాయి కథలు' పేరుతో కథల సంపుటిని ప్రచురించారు. నానీల సృష్టికర్త డా॥ఎన్.గోపి గారి ప్రోత్సాహంతో, హైదరాబాద్ - ముంబాయిల మధ్య జనార్ధన్ తరచూ చేసే ప్రయాణాల్లో ఈ

'బొంబాయి నానీలు' జీవం పోసుకున్నాయట. 2001లో ఈ సంపుటి ప్రచురింపబడింది. ప్రాదేశిక నానీల్లోని గొప్పతనం ఏమిటంటే తను శ్వాసిస్తున్నఊరుగూర్చి, దాని ప్రత్యేకతను గూర్చి విశిష్టతను గూర్చి గొప్పగా చెప్పవచ్చు. ప్రాదేశిక నానీలోని లోపం కూడా లేకపోలేదు. ఆ ప్రదేశానికి సంబంధించి అవగాహన ఉన్నవారిని మాత్రమే, ఆ ప్రదేశీయుల్ని మాత్రమే మెప్పించగలుగుతాయి ఈ తరహా నానీలు. ఎందుచేతనంటే విస్తృత పరిధిని పరిమితం చేయడమే ఒక ప్రదేశానికి సంబంధించిన విషయాలను నానీలుగా చెప్పే ప్రయత్నం. అంబల్ల జనార్ధన్ బొంబాయి నానీలలోని కొన్నిటిని పరిశీలిద్దాం:

**మామూలు జనం, మాఫియా గ్యాంగులు, పీల్చే గాలి మాత్రం ఒకటే**

"అంటారుగానీ
బొంబాయి పీటముడి కాదు
శ్రమ శక్తికి
అమ్మఒడి!" అని శ్రమను నమ్ముకుని ఎక్కడెక్కడినుండో నగరానికి వలస వచ్చిన శ్రమజీవుల గూర్చి రాయబడిన నానీ. "చలించే మర్రిచెట్టు / బొంబాయి / వలస పక్షులు / కొమ్మలు మారుతుంటాయి!" అని వలస జీవితలగూర్చి రాశాడు. "రాళ్ళను శిల్పాలుగా / మలిచే ప్రవాహం / మాయానగరం / ముంబాయి" అని ముంబాయి ఎలాంటిదో చెప్తూ కొన్ని నానీలు రాసారు జనార్ధన్. బొంబాయి నగరం అనగానే గుర్తుకువచ్చేది మాఫియా గ్యాంగ్. దాన్ని గూర్చి "మామూలు జనం / మాఫియా గ్యాంగులు / పీల్చే గాలి మాత్రం / ఒకటే" అని రాశారు. "మాఫియా చీకట్లో / బాలివుడ్ తళుకులు / చిత్రాలలో / విచిత్రాలు" అని మాఫియా డాన్లకు , బాలీవుడ్ సినిమా నటులకు ఉన్న సంబంధాలను నానీగా రాశాడు. "ఇది నిజం! కూటికి యుద్ధమైతే, / ఇక్కడ గూటికి / మహా సమరం" అని జనార్దన్ ముంబై నగర జీవితాన్ని, సంస్కృతిని కళ్ళకు కట్టేలా నానీలలో ప్రదర్శించారు. ఈ ఒక్క సంపుటితో సంతృప్తి చెందకుండా–

"ఆకాశానికి చిల్లులు
సముద్రపు ఎల్లలు
జల దిగ్బంధంలో




ముంబయి!" అని తన రెండవ నానీల సంపుటి అయిన 'ముంబయి మువ్వలు' (2007) అనే నానీ సంపుటిలో అంబల్ల జనార్ధన్ అంటారు. మొదటి సంపుటైనటువంటి 'బొంబాయి నానీలు' అనేదానిలో అన్ని ప్రాదేశికమైనటువంటి నానీలు రాసినప్పటికీ దానితో పోలిస్తే 'ముంబయి ముత్యాలు' లు సంపుటిలో అక్కడక్కడ మాత్రమే ప్రాదేశిక నానీలు కనిపిస్తాయి. అంతేకాదు– "జంట నగరాన్ని కలిపింది /హుసేన్ సాగరం /ట్యాంక్ బండ్ /వజ్రాల హారం" అని "ముంబయి మువ్వలు" పేరుతో రాసినప్పటికీ తాను తెలంగాణ ప్రాంత వాసిగా ట్యాంక్ బండ్ గూర్చి ప్రాదేశిక నానీగా వర్ణించాడు. ఈ సంపుటిలో ప్రాదేశికేతర నానీలు అనేకం రాయబడ్డాయి.

అంబల్ల జనార్ధన్ 'బొంబాయి నానీలు' తర్వాత ప్రాదేశిక నానీలుగా వచ్చిన రెండవ నానీ సంపుటి నూరు 'తెలంగాణ నానీలు'. తెలంగాణకు జరిగిన, జరుగుతున్న అన్యాయాన్ని కవి కోట్ల వెంకటేశ్వర రెడ్డి ఇందులో గొంతెత్తి ప్రశ్నించాడు, నిరసించాడు. రాజధానికి వెళ్లి ఉద్యోగాల్లో, వ్యాపారాల్లో స్థిరపడిన వారిని ఉద్దేశించి, ఏ విధంగా వారు తమ పొట్టకూటికోసం కోస్తా ప్రాంతం నుంచి ఇతర ప్రాంతాల నుంచి తెలంగాణాలోని రాష్ట్ర ఎదుగుదలకు అవరోధం అవుతూ దోపిడి చేస్తున్నారనే నిరసన వారి నానీల్లో కనిపిస్తుంది. తెలంగాణను ఆశ్రయించిన తెలంగాణేతరులు ఎలాంటి వారంటే–

"రూపంలేని
అమీబావి
అబ్బా!
ఎన్ని అవతారాలురా నీవి!" అని ఒక నానీలో అంటాడు. "పచ్చగున్న కాడ / పక్షివైవాలివి / నన్ను నా పొలాన్ని / నాక్కాకుండ మేస్తివి" అని తెలంగాణేతరుల దోపిడీని వర్ణించాడు. "పట్నమొస్తే / అమ్మక్కను చూసినట్లుండేది / వాడొచ్చిండు / వరుస దప్పింది!" అని మారిన సంస్కృతి గూర్చి రాసాడు కవి. "దొర / తిట్టినా బుక్కెడు / బువ్వెట్టెటోడు / వీడు తిట్టదు కడుపు గొడ్తాడు!" అని ఇలా ఎన్నో రాసాడు కవి. కోస్తా ప్రాంత వాసులే ఎక్కువగా నివసించే వనస్థలి పురాన్ని ఉద్దేశించి– "వనస్థలి పూరానికి / మనిషి భాషరాదు / ఛీ! / అంతా

పత్రిక భాష!".అని తమ అస్తిత్వంలో ఒకటైన భాషకూడా ఎలా ప్రభావితం చేయబడిందో కవి వర్ణించాడు. " తెలంగాణ / తంగేడు పూవు / మల్లెలా / మరులెలా గొలుపుతుంది?" అని ఇటువంటి అనేక ప్రాదేశిన నానీలను నూరు తెలంగాణ నానీలు అనే తన సంపుటిలో కవి కోట్ల వెంకటేశ్వర రెడ్డి రాశారు

**ఉయ్యాలవాడ! తెల్లోడి గుండెల్లో నీ దడ అందుకే కోట గుమ్మంపై నీ తల**

పై వరుసలో 2006లో వెలువడిన ప్రాదేశిక నానీ సంపుటి 'సీమ నానీలు'. ప్రముఖ సాహితీ విమర్శకులు, కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత, విశ్రాంత తెలుగు ఆచార్యులు రాచపాళెం చంద్రశేఖర రెడ్డి గారు ఈ సంపుటి రాశారు.

"రాయలసీమ
అనగానేమి?
నీళ్లకు బదులుగా
కన్నీళ్లు కురియును" అని సీమ ప్రాంత వాసిగా అక్కడి నీటి ఎద్దడి, తత్ఫలితంగా ఏర్పడే కరువు గూర్చి తన ప్రాదేశిక నానీ సంపుటిలో కవి వర్ణించాడు. "ఉయ్యాలవాడ! / తెల్లోడి గుండెల్లో నీ దడ /అందుకే కోట గుమ్మంపై / నీ తల" అని రాయలసీమ ప్రాంతానికి చెందిన ఉయ్యాలవాడ నరసింహారెడ్డి కర్నూలు జిల్లా కోయికుంట్ల ప్రాంతంలో బ్రిటిష్ వాళ్ళ రెవెన్యూ విధానం మీద తిరుగుబాటు చేసి హత్యకు గురైనటువంటి ఉదంతాన్ని కూడా ఈ విధంగా ప్రాదేశిక నానీగా రాశారు. ఆ ప్రాంతంతో ముడిపడినటువంటి అనేక విశిష్ట వ్యక్తుల మీద కూడా కొన్ని నానీలను రాయడం జరిగింది. ఈ సంపుటిలో ఈ ప్రాంతానికి చెందిన చారిత్రక పురుషుల్నే గాక, ప్రముఖ రచయితల యొక్క రచనల్ని పరోక్షంగా ప్రస్తావిస్తూ అనేక నానీలు రాశారు. "అదేదే / జమ్మలమడుగు / ఇవాళది / అమ్ముల పడుగు"అని జమ్మలమడుగు గురించి రాశారు. అలాగే – "వెంకన్న హుండీలో / కాసుల గలగల / ఎంపన్నకు / ఆకలి విలవిల" అని ఆ ప్రాంతంలోని కొన్ని దేవాలయాలు గూర్చి కూడ రాశారు. చక్కని ప్రామాణిక ప్రాదేశిక నానీలు వినూత్న శైలితో రాశారు.

ఆ తర్వాత 2006లో ముంబాయిలో నివసించే నడిమెట్ల యెల్లప్ప

"ముంబయి ముత్యాలు" పేరుతో ప్రాదేశిన నానీ సంపుటిని తీసుకువచ్చారు. అంబల్ల జనార్ధన్ స్ఫూర్తితో నానీ ప్రక్రియలో ఈ తరహా సంపుటిని తీసుకురావడం జరిగింది.

గజల్స్ వినలేదా మా ఓల్డ్ సిటీకి రా పాత గోడల్లో యింకా ముషాయిరాలే

"వింత సహజీవనం
ముంబయిలో
భాయి బాంబూ
పక్కపక్కనే" అని ముంబై లో అకస్మాత్తుగా పేలే బాంబు పేలుళ్ల గురించి, అటువంటి పరిస్థితుల్లో జీవించాల్సిన సామాన్యుల గురించి జీవన స్థితిని కవి ఈ నానీలో వ్యక్తికరించాడు. అంతేకాదు – "అదిగో / పరిగెత్తుతున్న ప్యాసింజర్ / వలస జీవుల / కదిలే గూడు" అని ముంబై కు వలసపోయిన వారిని ఒక చోట నుంచి ఒక చోటికి తీసుకెళ్ళే కిక్కిరిసిన మెట్రో రైళ్ళు గూర్చి కవి నడిమెట్ల యెల్లప్ప తన నానీ సంపుటిలో ఇలా రాశారు.

ఈ పరంపరలో ప్రాదేశిక శీర్షికతో 2006లో వచ్చిన మరో నానీ సంపుటి కన్నోజు లక్ష్మీకాంతం రాసిన "చార్మినార్ నానీలు".

"ప్రేమకు ప్రతీక
తాజ్ మహలే కాదు
భాగ్యనగరం
కూడాను" అని భాగ్యనగరం నిర్మాణ చారిత్రిక నేపథ్యాన్ని నానీగా రాశారు "చార్మినార్ నానీలు" రాసిన కన్నోజు లక్ష్మీకాంతం. "చార్మినార్ కు / నాలుగు వందలేండ్లు / మతకలహాలు / మౌనసాక్షి" అని చార్మినార్ ఉండేటువంటి పాతబస్తీలో ఏ విధంగా రాజకీయ వ్యూహాలతో మత కల్లోలాలు, మత కలహాలు, రక్తపాతాలు జరుగుతాయో... వీటికి సాక్షిగా మౌనంగా నిలుచున్న చార్మినార్ గురించి కవి వర్ణించారు. "మిత్రమా../ హైదరాబాదొస్తున్నావా! / బొట్టూ, కాటుక చూడు / బిర్లామందిర్, చార్మినార్" అని హిందూ ముస్లింల మతసామరస్యానికి గుర్తుగా ప్రసిద్ధ కట్టడాలు ఆదరించబడేటువంటి హైదరాబాదులోని బిర్లా మందిరం, చార్మినార్ గూర్చి కవి వర్ణించారు. "గజల్స్ వినలేదా / మా ఓల్డ్ సిటీకి రా / పాత గోడల్లో / యింకా ముషాయిరాలే" అని ఒకప్పుడు గజల్ సంస్కృతితో శోభిల్లిన పాతబస్తీ ప్రాంతాన్ని తలపుకు తెచ్చుకుని

కవి వర్ణిస్తాడు. "చార్మినార్ నానీలు" అనే శీర్షికగా నానీ సంపుటానికి పేరు పెట్టినప్పటికీ ఇందులో ఇతరేతరమైనటువంటి అనేక నానీలు ఉన్నాయి. హైదరాబాద్ నగరానికి సంబంధించి చార్మినార్ కేంద్రంగా రాయబడిన నానీలు చాలా తక్కువగా ఉన్నాయని నా వ్యక్తిగత అభిప్రాయం.




పై సంపుటి తర్వాత 2006లోనే ప్రాదేశిక శీర్షికతో వచ్చిన మరో నానీ సంపుటి జిందం అశోక్ రచించిన "మానేరు నానీలు".

"ఏకశిలపై
త్యాగాల గుర్తు
కాకతీయ తోరణం
తెలంగాణ మొలదారం" అని తెలంగాణకు ముఖ్య నగరమైన , చారిత్రిక ప్రాధాన్యత గల ఒకప్పటి ఓరుగల్లు అయిన నేటి వరంగల్లు ను తన మానేరు నానీలలో జిందం అశోక్ ఇలా వర్ణించడమే గాక , "నల్ల సూర్యుల / త్యాగఫలం / తెలంగాణ సిగపువ్వు / సింగరేణి" అని వర్ణిస్తాడు. ఇందులో ప్రధానంగా మానేరు ప్రాంతానికి సంబంధించినటువంటి వాటి మీద నానీలు లేవు. తెలంగాణ వెతలు, తెలంగాణ ప్రాంతాలకు సంబంధించినటువంటి వాటి మీద రాయడం జరిగింది.

పై సంపుటి తర్వాత 2007లో సంపత్ కుమార్ – మాధవీలత చే సంయుక్తంగా రచింపబడి వెలువడిన ప్రాదేశిక నానీ సంపుటే "ఢిల్లీ నానీలు".

"ఇండియా గేటు వద్ద
చిరుతిండ్లు
మృతుల పేర్ల ముందు
తద్దినం భోజనాలు " అని దేశంకోసం అమరులైనవారిని గౌరవించుకుంటూ స్మరించుకునే పవిత్ర స్మారక చిహ్నమైన ప్రదేశ గౌరవాన్ని కొందరు దిగజార్చేలా వ్యవహరించడాన్ని దుయ్యబడుతూ ఈ నానీని రాశారు. "ఢిల్లీకి / ఎన్ని బైపాస్ సర్జరీలో ? / ఫ్లైఓవర్లు / కొత్త ధమనులు – సిరలు" అని ఢిల్లీలో ఉపయోగపడే ఫ్లై ఓవర్లు గూర్చి వర్ణించారు. "దివంగత ప్రధానులకు

/ ఇంతచోటా? / పేదలకు ఎన్నో / బస్తీలు కట్టొచ్చు!" అని దివంగతులైన స్వార్థ రాజకీయ నాయకుల సమాధులకు ప్రభుత్వం కేటాయించే పదుల ఎకరాల స్థలం గూర్చి... నిలువ నీడలేని పేదలగూర్చి ఈ నానీలో పేర్కొన్నారు. "సప్దర్ జంగ్ ఆస్పత్రి / బర్నింగ్ వార్డ్ / వరకట్న జ్వాలల్లో / ఎగిరిపోయింది బర్డ్" అని సప్దర్ జంగ్ ఆస్పత్రి బర్నింగ్ వార్డ్ లో వరకట్న వేధింపులకు ఆహుతై మరణించే మహిళల గూర్చి ఢిల్లీ నానీలు అనే వారి నానీల సంపుటిలో సంపత్ కుమార్ – మాధవీలత చక్కని నానీలు రాశారు. వీరు ఈ ఢిల్లీ నానీలు అనే సంపుటిలో ఢిల్లీలోని ప్రముఖ ప్రదేశాల గురించి, చారిత్రక నేపథ్యంతో ఉన్న కట్టడాల గురించి, అక్కడి జీవన శైలి గురించి, ప్రజల వెతల గురించి ఇలా అనేకమైన వాటిని స్పృశించారు. సంపుటి శీర్షికకు తగినట్లే ఇవి ఢిల్లీ నానీలు. 2005లో టి. సంపత్ కుమార్ గారు సునామీ నానీలు రాశారు.



చూద్దాం రండి
అదిగో ఫణి గిరి
బౌద్ధారామాల
తలలో విరి



2007లో మరికంటి పాలమూరు నానీలు రాశారు , 2007లోనే పున్నమి "నల్లగొండ నానీలు" రాశారు.

"పక్కనే కృష్ణమ్మ
పరవళ్లు
నల్లగొండ పల్లెల్లో
ఫ్లోరైడ్ కడగండ్లు" అని నల్గొండ ఫ్లోరైడ్ సమస్యను వర్ణించాడు కవి. "తెలంగాణా వ్యధల / గట్టికోట / ప్రజల మనిషి / వట్టికోట" అని సాహిత్య ప్రముఖులు వట్టికోట అళ్వారు దాసు గూర్చి రాయడం జరిగింది. ఈ సంపుటిలో నల్లగొండకు సంబంధించిన రాజకీయ, సాహిత్య, ఉద్యమ ప్రముఖులపై కూడా అనేక నానీలు రాసాడు. "చూద్దాం రండి / అదిగో ఫణి గిరి / బౌద్ధారామాల / తలలో విరి" అని ప్రసిద్ధ బౌద్ధ పుణ్యక్షేత్రాన్ని వర్ణించారు కవి. ప్రాదేశిక నానీ కవితా సంపుటిగా శీర్షికకు కట్టుబడి కవి ఇందులో ప్రాదేశిక నానీలను రచించారు. ఆ తర్వాత –

2007లో చిల్లర భవానీ దేవి "హైద్రాబాద్ నానీలు" రాశారు.

"సచివాలయం
ప్రవేశ ద్వారం మారింది

చాపకూటితో
సమానం కోరే
బ్రహ్మన్న సంస్కరణ
అంటే ఇదేనమ్మా

మరి పాలన తీరు
మారిందా?" అని ఈ ప్రాదేశిక నానీ ద్వారా కవిత్రి డాక్టర్ సి భవానీ దేవి ప్రశ్నించారు. వాస్తు , మరే ఇతర కారణాలను బట్టి ప్రవేశ ద్వారాలు మార్చి ఉండవచ్చు గానీ... అదే రీతిగా పరిపాలన తీరులో కూడా మార్పురావాలి అంటూ కోరుతూ సున్నిత విమర్శనతో ఈ నానీని రాశారు. "రామదాసు కీర్తన / వినిపిస్తున్నది / వచ్చేశామా / అనే గోల్కొండ ఖిల్లా" అని చారిత్రక కట్టడమైన గోల్కొండ, దానితో అనుబంధం ఉన్న రామదాసు గూర్చి చక్కని నానీ. "చూడీ బజార్ ను / ఆల్బంలో దాచా / ప్రతి పుటలో / గాజుల హరివిల్లులు" అని చార్మినార్ పక్కన ఉన్నటువంటి చూడీ బజార్ యొక్క ప్రత్యేకత... ఆ బజారులో లభించే రంగురంగుల ఆకర్షణీయమైనటువంటి వన్నెలు చిన్నె గాజుల ప్రత్యేకత గురించి రాసిన నానీ ఇది. "టాంక్ బండ్ బెంచి మీద / పాపాయి ఏడుపు / ఇప్పుడే దూకిన

చెల్లాయి తీర్పు" అంటూ జీవితంలో ఓడిపోయిన ఒక మహిళ తన పిల్లని వదిలి ఆత్మహత్యగావించుకున్న ఘటనను నానీగా రాసింది కవయిత్రి. డాక్టర్ సి. భవానీ దేవి గారు తన" హైదరాబాద్ నానీలు" శీర్షికతో రాసిన ఈ ప్రాదేశిక నానీల సంపుటిలో హైదరాబాదు నగర జీవిత విధానాన్ని, అక్కడి కట్టడాలను, అస్తవ్యస్తతను, వ్యవస్థలను వస్తువులుగా తీసుకుని రాశారు. ఈ సంపుటి శీర్షికకు తగినట్లుగా ఈ సంపుటిని ప్రాదేశిక నానీ సంపుటిగా మనం చెప్పుకోవచ్చు.

అటు తర్వాత బొంబాయి నానీలు రచించిన అంబల్ల జనార్ధన్ 2007లో ముంబాయి ముత్యాలు పేరుతో తన రెండవ నానీ సంపుటిని తీసుకు వచ్చాడు. ఈ సంపుటిగూర్చి ఈ వ్యాసం ప్రారంభంలో ఉదాహరించాను . ఆ తర్వాత 2007లో కె.జె. రమేష్ "గుంటూరు నానీలు" అనే పేరుతో ప్రాదేశిక నానీల సంపుటిని తీసుకువచ్చాడు.

"అబ్బా
ఎంత ఘాటుగా వుందో
భలేవాడివే
గుంటూరు మిర్చి కదా!" అని గుంటూరు జిల్లాకు ప్రత్యేకతను

ఆపాదించిపెట్టిన ఘాటైన గుంటూరు మిరపకాయలను గూర్చి నానీగా వర్ణించాడు. "చాపకూటితో / సమానం కోరే బ్రహ్మన్న / సంస్కరణ అంటే / ఇదేనమ్మా" అని చారిత్రిక వీరుడు, సహపంక్తి భోజనం ద్వారా సమానతను చాటే ప్రయత్నం చేసిన పల్నాటి బ్రహ్మనాయుడు గూర్చి వర్ణించాడు. "హరిశ్చంద్రునితో / జాషువా హృదయ జ్వాల / బండారుది / నటనహేల..." అని పౌరాణిక పద్య నాటకమైన




హరిశ్చంద్ర పాత్రధారి బండారు రామారావు ప్రాముఖ్యతను నానీగా కొనియాడారు కవి. "ఈ దారి హఠాత్తుగా / చల్లబడిందేమిటి? / అదిగో / ఎ.సి. కాలేజి..." అని గుంటూరులో ప్రసిద్ధ ప్రాచీన కళాశాల అయిన ఆంధ్రా క్రిస్టియన్ కళాశాల గూర్చి చమత్కారంగా వర్ణించారు కవి. "కొండవీటి కోట / శిథిలాల్లో లకుమ / పాదముద్రలు / దొరుకుతాయేమో..." అని చారిత్రక కట్టడమైనటువంటి కొండవీటి చారిత్రిక నేపథ్యంతో రాసినటువంటి నానీ ఇది. సి నారాయణరెడ్డి రాసిన కర్పూర వసంత రాయలు కావ్యంలోని కథ నాయిక లకుమ. ఇలా ఈ సంపుటిలో ప్రత్యేకమైనటువంటి ప్రదేశాల గురించే కాకుండా గుంటూరు జిల్లాతో అనుబంధం కలిగినటువంటి సాహితీ – సాంస్కృతిక రంగాల్లోని ప్రసిద్ధులైనటువంటి వారి గురించి కూడా నానీలు రాయబడ్డాయి. "గుంటూరు నానీలు" కవి కె.జె. రమేష్ ఇలా ఎన్నో ప్రత్యేకతలు ఉన్నటువంటి గుంటూరు జిల్లా, గుంటూరు ప్రాంతాల వ్యక్తులు, ప్రదేశాలపై ఎన్నో విశిష్టమైనటువంటి నానీలను రాశారు. ఈ సంపుటి శీర్షికకు తగినట్లుగానే ప్రాదేశిక నానీల సంపుటిగా మనం చెప్పుకోవాలి!

2007లోనే కార్టూనిస్ట్ కవి సీతారాం "విశాఖ నానీలు" పేరుతో ప్రాదేశిక నానీల సంపుటిని తీసుకువచ్చారు. ఇందులో –

"ప్రత్యక్ష సరస్వతి
ఆంధ్రా యూనివర్సిటీ
జ్ఞాన యజ్ఞంలో
సదా నిమగ్నం..." అని ఎందరికో విద్య విద్యని ప్రసాదించినటువంటి ఆంధ్ర విశ్వవిద్యాలయం ప్రశస్తిని ఈ నానీలో కొనియాడారు. "సింహాచలం




/ శ్రీ వరాహా స్వామీ / భక్తుల కోర్కెలను / కడ తేర్చవేమీ?" అని విశాఖపట్నం సమీపంలోని ప్రసిద్ధమైనటువంటి సింహాచల క్షేత్రం గురించి, విశాఖలోని కనక మహాలక్ష్మి, వినాయక్ టెంపుల్ మరికొన్ని దేవాలయాల గూర్చి నానీలు రాశారు. అంతేకాదు – "కడలి అలల్లో / మహాప్రస్థానం అలజడి / వైజాగ్ 'బీచ్ ' / దానికి తొలి బడి" అని అభ్యుదయ కవి, మహాప్రస్థానం సృష్టికర్త శ్రీశ్రీ గురించి, 'మహాప్రస్థానం' విశిష్టత గురించి నానీగా రాసారు. ఇలా విశాఖతో అనుబంధం కలిగిన బలివాడ కాంతారావు, రావిశాస్త్రి, కారా మాస్టారు వంటి సాహితీ వేత్తలు గూర్చి కవుల గురించి రచయితల గురించి మరికొన్ని నానీలు రాశారు. "వేదాంతం పుట్టుకొచ్చే / జబ్బుల కేంద్రం / 'కింగ్ జార్జి' ఆస్పత్రి / రోగుల సత్రం" అని కె.జి.హెచ్. గా పిలవబడే కింగ్ జార్జి హాస్పిటల్ గూర్చి ఈ నానీ రాశారు. ఇలా విశాఖ కేంద్రంగా చుట్టుపక్కల ప్రాంతమైన భీమిలి గూర్చి కూడా ప్రాదేశిక నానీలు రచించాడు కవి సీతారాం.

అటుతర్వాత 2007లో అబ్బిగారి రాజేంద్ర ప్రసాద్ చే "కడప నానీలు" పేరుతో ప్రాదేశిక నానీ సంపుటి వచ్చింది. 2008లో ఎం.ఏ. గఫర్ "నల్లమల్ల నానీలు" పేరుతో ప్రాదేశిన నానీల సంపుటిని ప్రచురించాడు. 2009లో పాతూరి అన్నపూర్ణ "పెన్నా తీరాన " పేరుతో ప్రాదేశిన నానీ సంపుటిని ప్రచురించారు. ఇందులో–

"పెన్నా నీరు
ఇంత తీయ్యగా ఉందేం?
తిక్కన
భారతాన్ని ఒంపుకుంది మరి!" అని మరో నానీలో పెన్నా నీటికి అబ్బిన తియ్యదనం తిక్కన కవిత మాధుర్యమే అనే వర్ణిస్తారు. "పెన్నా గాలి / జోల పాటలా / కోవెలలో రంగనాథుడు / తల్ప శాయిలా" అని కవయిత్రి అన్నపూర్ణ గారు అక్కడి ప్రసిద్ధ దేవాలయాన్ని వర్ణించారు. పేరుకి ప్రాదేశిక నానీ సంపుటి

శీర్షిక పెట్టినప్పటికీ ఇందులో రెండు మూడు మినహా ప్రాదేశిక నానీలు లేవు. బహుశా ఆ ప్రాంతవాసిగా తన నానీ సంపుటికి ఆ శీర్షిక పెట్టి ఉంటారు. 2010లో పనసకార్ల ప్రకాష్ "గోదారి నానీలు "పేరుతో ప్రాదేశిక నానీ సంపుటిని ప్రచురించాడు. సాఫ్ట్ వేర్ ఉద్యోగిగా సౌత్ ఆఫ్రికాలో ఉండే హైద్రాబాద్ వాసి రాపోలు సీతారామరాజు 2019లో "దక్షిణాఫ్రికా నానీలు" పేరుతో ప్రాదేశిక నానీ సంపుటాన్ని ప్రచురించాడు. ఇందులోని ఓకే నానీ –




"వజ్రాలు దొరికే
నేల ఇది
ఓ నల్ల వజ్రమూ పుట్టింది
పేరు 'మండేలా'!" అని మహోన్నతమైన మండేలా జననం గూర్చి రాశాడు. "ఆఫ్రికా / చీకటి ఖండం కాదు / ఆదిమానవుడు / అగ్గి వెలిగించిందిక్కడే!!" అని ఓ చారిత్రిక సత్యాన్ని చాటినటువంటి నానీ రాశారు కవి. "దక్షిణాఫ్రికా నానీలు" అనే శీర్షికతో కవి రాపోలు సీతారామరాజు సంపుటిని తీసుకువచ్చినా అందులో దక్షిణాఫ్రికా కేంద్రంగా అక్కడి విశిష్ట ప్రదేశాలు, కట్టడాలు, జీవన శైలి, సంస్కృతి, విశిష్ట వ్యక్తులు కవిత వస్తువులుగా తీసుకుని రాసినటువంటి నానీలు ఈ సంపుటిలో రెండు మూడు మాత్రమే చోటు చేసుకున్నాయి. మిగతా నానీలన్నీ వివిధ వస్తువులకు సంబంధించి... మరి ముఖ్యంగా కవి తెలంగాణ ప్రాంతానికి సంబంధించిన వాడిగా తెలంగాణ నేపథ్యంతో రాసినవి ఉన్నాయి. కవి ఉద్యోగ రీత్యా దక్షిణాఫ్రికాలో ఉంటున్న కారణం అక్కడినుంచి వెలువడిన నానీలు గనుక ఈ సంపుటికి ఈ శీర్షిక పెట్టి ఉంటారని భావించవచ్చు!

ఈ వ్యాసం మొదటిలో నేను ప్రస్తావించినట్లు నానీ సంపుటికి ప్రాదేశిక శీర్షిక పెట్టక పోయినప్పటికీ కొందరి నానీల సంపుటిలో అక్కడక్కడ కొన్ని ప్రాదేశిక నానీలు చోటుచేసుకున్నాయి.

ఉదా:

“శ్రీనాధుని
పాదముద్రలు ఎక్కడ?
నాపరాళ్లపై
ఆనవాళ్లు లేవా?” అని “మనిషి కోసం” అనే తన నానీ సంపుటిలో నాగిశెట్టి తాతయ్య నాయుడు పలనాడు ప్రాంతాన్ని శ్రీనాధుడు తన ప్రబంధాల్లో వర్ణించిన విధానాన్ని గుర్తు చేస్తూ ఈ నానీని రాశారు. అలాగే ‘నెమలీకలు’ అనే పేరుతో నానీ సంపుటిని వెలువరించిన కవయిత్రి నాంపల్లి సుజాత –

“కరీంనగర్ రోడ్లా
కడిగిన ముత్యాలే
ఇంటింటి చెట్లు
పర్యావరణ మెట్లు” అని రాశారు. కరీంనగర్ రోడ్ల శుభ్రతను కవయిత్రి ఈ నానీలో వర్ణించారు. వివిధ కవుల నానీ సంపుటాలను పరిశీలిస్తే ప్రాదేశిక శీర్షిక పెట్టకపోయినా ఇటువంటి ప్రాదేశిక నానీలు మనకు మరికొన్ని దర్శనమిస్తాయి.

సామజిక నానీలు , తాత్త్విక నానీలు, ఉపదేశాత్మక నానీలు, కవితాత్మక నానీలు నిర్వచనాత్మక నానీలు, వ్యంగ్య నానీలు, చమత్కార నానీలు, సాహిత్య నానీలు,.. ఇలా వస్తు వైవిధ్యాన్ని ఒకే సంపుటిలో ప్రదర్శిస్తూ రాసే సాధారణ నానీల సంపుటిలా కాకుండా ఒక ప్రాంతం, ఊరు, నగరంకు సంబంధించిన అనేక విషయాలను, విశేషాలను వర్ణిస్తూ రాయబడి, ప్రచురింపబడిన సంపుటిలోని ప్రాదేశిక నానీలు పాఠకులకు ఆసక్తిని కలిగించడమేగాక వ్యక్తులకు గౌరవాన్ని, ప్రదేశాలకు గుర్తింపును తీసుకు వస్తాయి.

ఆచార్య రాచపాళెం చంద్రశేఖర రెడ్డి గారి ప్రాదేశిక నానీ సంపుటి అయిన “సీమ నానీలు “ లో ప్రాదేశికతలో వస్తువైవిధ్యతనేకాదు, అభివ్యక్తి, రచనా శైలిలోనూ ప్రతిభను ప్రదర్శించారు. ఫుట్ నోట్స్ ఇచ్చి అనేక విషయాలను పాఠకుడు అర్థం చేసుకునేలా రచించారు. కవితా ప్రక్రియలలో నానీ ప్రకియ ప్రత్యేకమైతే నానీ ప్రక్రియలో ఈ ప్రాదేశిక నానీలు ప్రత్యేకం.





# నానీలు – చేతివృత్తుల చిత్రణ

డాక్టర్ వి. వింధ్యవాసినీ దేవి
✆ 97053 83422

సాహిత్యం సహృదయ పాఠకుల హృదయరంజితం. సాహితీవేత్తల హృదయదర్శిత భావనా చైతన్యం పాఠకుల మనోఫలకాలపై ఆవిష్కృతమవడానికి సాహిత్యం ఒక మాధ్యమం. వేయి సంవత్సరాలుగా నిర్విరామంగా ప్రవహిస్తున్న సాహిత్య సుధాంబుధిలో విరామమెరుగక ఉవ్వెత్తున ఎగిసిపడుతున్న తరంగమే కవిత్వం. తెలుగు సాహిత్యంలో ప్రాచీన, ఆధునిక సాహిత్య ప్రక్రియలన్నింటిలోనూ కవిత్వానికి పెద్ద పీఠ వేయడం గమనించవచ్చు. పద్య కవిత్వమైన, గేయకవిత్వమైన, వచనకవిత్వమైన సృజనశీలుర హృదయ స్పర్శను ఆలంబనగా చేసుకొని వ్యక్తమవుతునే ఉంది. మహా కావ్యాలు మొదలు దీర్ఘ కవితల వరకు,శతకం నుండి మినీ కవిత్వం వరకు రూపమేదైనా కవిత్వం పాఠకులను అలరిస్తూనే ఉంది.

వాక్యం రసాత్మకం కావ్యం అని ఆలంకారికులు చెప్పినట్టు, అల్పాక్షరాల్లో అనల్పర్థాన్ని గర్భీకరించుకున్న చిట్టికవితలే నానీలు. రస స్ఫూర్తితో వెలువరించిన ఏకవాక్యమైనా కావ్యమై విలసిల్లుతుంది. అందుకు నిదర్శనమే నానీలు కవితారూపం. మూడు దశబ్దాల క్రితం ప్రముఖ కవి ఆచార్య ఎన్. గోపీగారు సృజించిన ఈ కవితారూపం అనతికాలంలోనే అశేష పాఠక లోకానికి చేరువై బలమైన కవితాభివ్యక్తి రూపంగా స్థిరపడింది. రసాత్మకమై, భావాత్మకమై, కవితాత్మకమై సామాజిక స్పృహను నిండుగా నింపుకొని, తాత్త్విక చింతన, చమత్కారభరిత రచనాకౌశలంతో ఎన్నో నానీల సంపుటాలు వెలువడ్డాయి. ఎందరో మేటి కవుల నుండి నేటి బాల కవుల వరకు నానీలను రచించారు.

నిర్మాణ రీత్యా 'నానీ' సరళమే అనిపిస్తుంది. కానీ నిగూఢ భావాంశాలను

పొదిగి నానీలను సృజించడం అంత సులభమేమి కాదు. భావ గాంభీర్యం, సముచిత వ్యంగ్యం, సౌందర్య దృష్టి, అధిక్షేపం, దార్శనికత, సామాజిక వాస్తవికత వంటి అనేక అంశాలను నాలుగు పాదాల్లో, అక్షర నియమాన్ని పాటిస్తూ శిల్పీకరించడం ఒకింత సాధనతోనే అలవడుతుంది. నానీల లక్షణాల్లో ముక్తకత్వం ఒకటి. ఈ లక్షణమే నానీల్లో అనంతమైన వస్తు వైవిధ్యానికి కారణమైంది. మానవ జీవన గమనంలోని అన్ని అంశాలు నానీలుగా రూపొందాయి అని చెప్పడం అత్యుక్తి కాదు. సమస్త ప్రాకృతిక విషయాలు, మానవ సంబంధాలు, అనుబంధాలు, సామాజిక, రాజకీయ, ఆర్థిక, నైతిక, భౌగోళిక, సాంకేతిక అంశాలు అన్ని నానీ కవితా వస్తువులయ్యాయి. జీవితానుభవలే వస్తువుగా చేసుకొని కవులు నానీలను రాస్తున్నారు. ఈ కోణంలో నానీల్లో వ్యక్తమైన విభిన్న కులవృత్తులను పరిశీలించడమే ఈ వ్యాస ఉద్దేశం.



**ప్రపంచీకరణ చాప కింద నీరులా ప్రవహిస్తూ పల్లె, పట్నం అన్న తేడా లేకుండా అంతటా, అన్నింటా వ్యాపించి, భారతీయ గ్రామీణ జీవనాన్ని చిన్నాభిన్నం చేసింది.**



నానీలు – కులవృత్తుల చిత్రణ : భారతదేశం భిన్న వృత్తులకు నిలయం. వివిధ కులవృత్తులు, చేతి వృత్తులే ఉపాధిగా జనజీవనం కొనసాగుతుంది. ఒకనాడు చేతివృత్తుల మీద ఆధారపడి జీవిస్తూ సమాజమంతా సుఖసంతోషాలతో గడిపిన మాటను మరిపిస్తూ ఆధునికీకరణలో భాగంగా యంత్రీకరణ వ్యాపించింది. చేతి వృత్తులతో తయారయ్యే సమస్త వస్తుజాలం నేడు యంత్రాలతో తయారవుతూ యంత్ర శక్తి ముందు మానవ శక్తి క్రమంగా సన్నగిల్లుతూ చేతి వృత్తులు క్షీణించడం గమనిస్తూనే ఉన్నాము. ప్రపంచీకరణ చాప కింద నీరులా ప్రవహిస్తూ పల్లె, పట్నం అన్న తేడా లేకుండా అంతటా, అన్నింటా వ్యాపించి, భారతీయ గ్రామీణ జీవనాన్ని చిన్నాభిన్నం చేసింది. భారతీయ సంస్కృతి, కళలు, చేతి వృత్తులు, కుల వృత్తులు అన్నీ ప్రపంచీకరణ ధాటికి నిలబడలేక కుదేలయిన వైనం గమనించవచ్చు. నాణానికి రెండు ముఖాల్లా ప్రపంచీకరణ కూడా మంచి చెడుల సంగమంగా కనిపిస్తుంది. ఒకవైపు పట్టణ ప్రాంత ప్రజలకు ఆధునిక ఉపాధి అవకాశాలు మెరుగు పడినా,

మరో వైపు పల్లెప్రజల వృత్తులు దెబ్బతిన్నాయి. ఎందరెందరో కవులు, రచయితలు ఈ సామాజిక పరిణామాలను సాహిత్యం ద్వారా రికార్డు చేశారు. ప్రపంచకరణ పర్యవసనాలను, వృత్తి జీవనంలో తలెత్తిన మార్పులను, ఒకనాటి చేతివృత్తి కళాకారుల కళానైపుణ్యాన్ని, ప్రశ్నార్థకంగా మారిన వృత్తుల ఉనికిని 'నానీ' కవులు ఎంతో సమర్థవంతంగా చిత్రించారు.

**చెదిరిన చేతి వృత్తులు ప్రపంచీకరణ దూసిన చురకత్తులు**

"చేతివృత్తులు /మాయం !!/ ప్రపంచీకరణం /మనిషిని యంత్రం చేయడం" (నిశ్శబ్ద పర్జన్యాలు) అంటారు సుభాషిణి పట్టిపాటి. నిజమే ఈనాటి మనిషి యంత్రాల్లో యంత్రంగా కాలం గడుపుతున్న మాట వాస్తవమే.

"కులవృత్తులన్నీ మాయం /మిగిలింది /రాజకీయం / సినీరంగం" – అని ఆవేదన వ్యక్తం చేశారు నెల్లుట్ల రమాదేవి 'చినుకులు' నానీ సంపుటిలో. " వృత్తులు పోతున్నాయి /బాధే !/మరి మన పిల్లలకు /వీటిని రుద్దుదామా?" (జొన్నకంకులు) అని ప్రశ్నిస్తారు డా. బండారు సుజాతా శేఖర్. ప్రపంచీకరణ, ఆర్థిక సరళీకరణల నేపథ్యంలో ప్రపంచమంతా కుగ్రామంగా మారిన తరుణంలో, ఎల్లెడల విస్తరించిన యంత్ర సంస్కృతి చేతి వృత్తుల అంతర్ధానానికి కారణమంటారు కూకట్ల తిరుపతి "చెదిరిన / చేతి వృత్తులు/ప్రపంచీకరణ దూసిన / చురకత్తులు" (పెద్దగడియారం –కరీంనగర్ నానీలు). " వృత్తుల మీద / కత్తులు దూయకు /యంత్రాలకు /చింతకాయలు రాలవు" (చెన్నప్ప నానీలు) అంటూ వ్యంగ్యాస్త్రాన్ని సంధించారు ఆచార్య మసన చెన్నప్ప.

ప్రపంచవ్యాప్తంగా పేర్గాంచినది భారతీయ చేనేత వస్త్ర పరిశ్రమ. ఇక్కడి నేత కళాకారుల కళా నైపుణ్యం అద్భుతమైనది. ఆరు గజాల చీరను అగ్గిపెట్టెలో పట్టేంత పరిమాణంలో నేయగలిగిన నేర్పు చేనేత కళాకారులది. అబ్బురపరిచే కళాకృతులతో, ఆశ్చర్య చకితులను చేసే నైపుణ్యంతో వస్త్రాలను కళా ఖండాలుగా మలుస్తూ నేయగలిగిన నేర్పరులు ఇక్కడి నేతకారులు. ఇంతటి ప్రాశస్త్యం ఉన్న చేనేత రంగం ఎన్నో కారణాలతో అనేక ఒడిదుడుకులను ఎదుర్కొంటూ, పూర్వవైభవాన్ని కోల్పోయింది. చేనేత వృత్తికారుల పనితనాన్ని

కొనియాడుతూ "అగ్గిపెట్టెలో /చీర సోయగం/ పరంధాములూ !/నీవు శాశ్వతం" (చెలిమి చెలిమెలు) అంటారు మాడిశెట్టి గోపాల్ "అంత చీరతో /అగ్గిపెట్టె నింపావు /నీ పొట్టే /నింపుకోలేకపోయావు" (వెలుగుపూలు) – అంటూ చిమ్మపూడి శ్రీరామమూర్తి నేతకారుల వృత్తి నేర్పును, స్థితిగతులను ఈ నానీలో దర్శింపజేశారు. "పట్టపగలు /ఇంద్ర ధనస్సు / నేతగాండ్లు /సరి చేస్తున్నారా ! "–(బొంబాయి ముచ్చట్లు – పెద్ద గడియారం –కరీంనగర్ నానీలు ) అని నడిమెట్ల యెల్లప్ప నేతన్నల కళా కౌశలాన్ని అభివర్ణించారు. డా. పత్తిపాక మోహన్ 'చేనేత నానీలు' సంపుటిలో "సిరిసిల్ల /చేనేతకు ముఖ చిత్రం /ఇవాళ /ఆకలి చావుల కరపత్రం" అని సిరిసిల్ల సామాజిక చిత్ర పటాన్ని చూపారు. తెలంగాణా వస్త్ర పరిశ్రమకు కేంద్రబిందువు సిరిసిల్ల ప్రాంతం. చేనేతకు పెట్టింది పేరు సిరిసిల్ల. అటువంటి సిరిసిల్ల ప్రాంత ప్రస్తుత వాస్తవ పరిస్థితిని రూపుకట్టిస్తూ మాడిశెట్టి గోపాల్ "సిరిసిల్ల ఒకనాడు /సిరిశాలే /నేడదీ నేతన్నల /ఉరిశాల" (చెలిమి చెలిమెలు) అంటారు. డా. అడువాల సుజాత "'సిరి' సిల్లలో/నీటి గుంటలా అవి /నేతన్న కన్నీటి చెలిమలు" (మట్టిమల్లెలు) – అని సిరులను కోల్పోయి విలపిస్తున్న సిరిసిల్ల నేతన్నల దైన్య స్థితిని పాఠకుల ముందుంచారు.




ఒకవైపు మరమగ్గాలపై పనిచేసే నైపుణ్యం లేని కారణంగా, మరోవైపు మరమగ్గాలతో పోటీ పడి ఉత్పాదకతను పెంచలేక, చేనేత వస్త్రాలకు తగిన ఆదరణ లేక చేనేత వృత్తి కళాకారుల జీవితాలు అగమ్యమయ్యాయి. మగ్గాన్నే నమ్ముకున్న కొన్ని వేల కుటుంబాలు పేదరికం బాట పట్టాయి.

"అర్థాంతరంగా/మిల్లుల మూత /మిగిల్చింది ఎందరికో /గుండె కోత" (చెలిమి చెలిమెలు) మాడిశెట్టి గోపాల్ పై నానీలో నేతన్నల గుండె కోతను చూపుతారు. "పోచంపల్లి చీర/ఎంత బావుందో!/ మరి /దానిని నేసినవాడు?" (జొన్నకంకులు) అంటూ నేతకారుల జీవితాల్లోని చీకట్లను డా. బండారు సుజాతా శేఖర్ పై నానీలో వ్యక్తం చేశారు. ఏ వృత్తి అయినా ప్రభుత్వ ప్రోత్సాహంతోనే అభివృద్ధి చెందగలదు. అదరణ కరువైన వృత్తులపై ఆధారపడి

బతికే కుటుంబాలను ఆదుకోవాల్సిన బాధ్యత ప్రభుత్వాలదే. ఈ విషయాన్ని విస్మరించిన పాలకులపై వ్యంగ్యాస్త్రాన్ని సంధించే కన్నోజు లక్ష్మీకాంతం నానీ – "నేతల బట్టలు /చేనేతవే / అయినా /చేనేతలకు చేయుతలేదు" (చార్మినార్ నానీలు). " దొరసాని / కట్టిన కాటన్ చీరలో / పడుగు అవ్వ /పేక నాయిన " (పెద్ద గడియారం – కరీంనగర్ నానీలు) అంటారు వెల్దండి శ్రీధర్.




ఆదరణ తగ్గిన చేనేతవృత్తి, నేత కార్మికుల జీవితాల్లో నింపిన విషాదాన్ని ఎందరో నానీ కవులు హృద్యంగా అక్షరికరించారు. నేతపని మాత్రమే తెలిసిన నేత కార్మికులు ఇతర వృత్తులను నేర్వలేక,తమ నేర్పుకు సరైన విలువలేక, జీవనసాగరాన్ని ఈదలేక అర్థాంతరంగా బతుకు పుస్తకాలను మూసేస్తున్న విషయాన్ని నానీలలో మనసుకు హత్తుకునేల వ్యక్తపరిచారు కవులు. "మా నేత జీవితాలకు /ఊపిరి పోసేది /ఊపిరి తీసేది /పొగులే " (సిరిసిల్ల నానీలు) ఆడెపు లక్ష్మణ్. " వెలిసింది /చేనేత చీరలు కాదు /వాటిని నేసిన /బతుకులు" (ఆలకించే అక్షరం) జయప్రద. " వాడిపోతున్న /జరీ పువ్వు /ఇప్పుడు మగ్గం గుంట /ఒక సమాధి" (మానేరు నానీలు) జింధమ్ అశోక్ " మగ్గం గుంట / సమాధిలా లేదు !/ నేసే గుడ్డ /కప్పడానికేనా !"(అక్షర క్షణాలు) జీసనారా. " మానేరు /పొంగి పొర్లుతోంది /నీటితో కాదు/నేతగాళ్ల శవాలతో (పెద్ద గడియారం –కరీంనగర్ నానీలు ) వెల్దండి శ్రీధర్. "మగ్గం గుంటలో /జారిన పోగు /నేతగాని /కడుపు చితికిన పేగు" (పెద్ద గడియారం – కరీంనగర్ నానీలు) ఇలాసాగరం కనకయ్య . " కండలు కండె లైనై /రక్తం రంగైంది / మొగ్గం గుంట /సజీవ సమాధి" , "నేత నేసుడంటే /ఏం లేదు /ఊపిరితిత్తులు /ఎగశ్వాస .. దిగ శ్వాస" (చేనేత నానీలు)డా పత్తిపాక మోహన్. " విరిగిన రాట్నం /కూలిన మొగ్గం /అగ్గిపెట్టెలో /చీర సాక్ష్యం" (మానేరు నానీలు) జింధమ్ అశోక్. " కండెలు చుట్టిన /చేతులు /మగ్గం కొట్టిన రెక్కలు /బతుకు వెయ్యి వక్కలు" (సిరిసిల్ల నానీలు ) ఆడెపు లక్ష్మణ్ – " ఈ వస్త్రం /ఇంత చలువా !/ అవును మరి /ఎంత శ్రమను అద్దాడో " (దీపంతలు ) వై . సత్యనారాయణ . " బతుకంతా /పట్టుబట్టల మధ్యనే /కట్టింది లేదు /మురిసింది లేదు" (చేనేత నానీలు ) డా పత్తిపాక మోహన్. ఈ నానీలన్నీ నేతన్నల బతుకు చిత్రాన్ని కళ్ళకు

కట్టిస్తాయి. చేనేత వృత్తిని నమ్ముకొని మగ్గం గుంటలోనే సమాధి అవుతున్న నేతన్న పరిస్థితిని చూపుతాయి.

చేనేత వృత్తి మాత్రమే కాదు ఇతర వృత్తులు సైతం నేటి అత్యాధునిక కాలంలో వెలవెలబోతున్న విషయాన్ని నానీలలో కవుల వాస్తవిక దృష్టితో చిత్రించారు.



**కుమ్మరి సారె తిరగడం లేదిప్పుడు స్టీల్, ప్లాస్టిక్ ల కొత్త చప్పుడు**



బంగారు ఆభరణాలను తయారుచేయడం అతి సూక్ష్మ కళ. ఈ కళే వృత్తిగా జీవనం సాగించేవారు స్వర్ణకారులు. స్వర్ణకారులను గురించి జీవన లిపి నానీ సంపుటిలో డా .ఎస్ . రఘు ఇలా అంటారు – " స్వర్ణం / తుప్పు పట్టదు నిజమే !/ మన / స్వర్ణకారుడి బతుకు? ". పేరులో ఉన్న స్వర్ణం దగదగలే తప్ప జీవితంలో వెలుగులు చూడని స్వర్ణకారుల జీవితాలకు అద్దం పట్టే నానీ ఇది.

కుమ్మరిసారెపై ఎంతో ఒడుపుగా, మట్టి పాత్రలను, కుండలను తయారుచేసే కుమ్మరివృత్తికారుల నైపుణ్యాన్ని, ప్రస్తుత సమాజంలో కుమ్మరి కులవృత్తి స్థితిగతులను నానీలు సమర్థవంతంగా ప్రతిబింబించాయని చెప్పొచ్చు. ప్లాస్టిక్ పెనుభూతం ఆవిర్భవించిన తర్వాత సమాజం కుమ్మరి వృత్తిని కోల్పోయింది. కుండల అవసరం సమాజానికి లేకుండా పోయింది. తరాలుగా తిరిగిన కుమ్మరి సారె కూలబడిపోయింది. ఈ పరిణామాలను నానీ కవులు నానీల్లో స్పష్టంగా ప్రస్తావించారు. "కుమ్మరి సారె /తిరగడం లేదిప్పుడు/స్టీల్, ప్లాస్టిక్ ల /కొత్త చప్పుడు" (పెద్ద గడియారం – కరీంనగర్ నానీలు) కూకట్ల తిరుపతి. " కాలచక్రం /కుట్ర చేసింది /అందుకే కుమ్మరి సారె /కూలబడింది" (అడవికూనలు) నూటెంకి రవీంద్ర."స్టీరింగుతిప్పుతావని/బడాయినీకు/కుమ్మరి సారె / తిప్పు చూద్దాం", "కారు చీకట్లను / తరిమే చిరుదీపం / కుమ్మరింట/వెలుగునింపదెందుకో", "మట్టినిమాణిక్యాలుగా/మార్చడం చూశారా?/పదండి / కుమ్మరి వాడకు", (మట్టినానీలు ) నాంపల్లి సుజాత "సల్ప దెబ్బ /సక్కని కుండకు రూపం /వెక్కిరిస్తూ షాపులో /ప్లాస్టిక్ స్వరూపం" (పెద్ద గడియారం–కరీంనగర్ నానీలు ) ఇలాసాగరం కనకయ్య తదితరులు కుమ్మరి వృత్తి సంబంధ అంశాలను నానీల్లో చిత్రీకరించారు.

ఇంటి నిర్మాణం దగ్గర నుండి ఇంటికి కావలసిన అనేక వస్తువుల నిర్మాణంలో వడ్రంగి వృత్తికారుల పాత్ర అతి ముఖ్యమైనది. ఒకప్పుడు ఈ వృత్తికి మంచి ఆదరణ ఉన్నప్పటికీ ప్రస్తుత కాలంలో కార్పొరేట్ శక్తుల ప్రభావానికి లోనై వడ్రంగి వృత్తి కూడా కనుమారుగయ్యే దశలో ఉంది. ఈ వృత్తిని నమ్ముకొని

జీవనం సాగించే వారి జీవితాలను పరిచయం చేస్తూ కన్నోజు లక్ష్మీకాంతం రాసిన నానీ – "ఫర్నీచరుకు /ప్రాణం పోస్తున్నాడా !/ ఊరి వడ్రంగి / ఊసురుమంటూనే వున్నాడు" (చార్మినార్ నానీలు).

శిలను శిల్పంగా మలిచే శిల్పుల జీవితాలలోని కన్నీటి చారికాలను చూపుతూ, "శిలల్లో నుండి /చెట్లు మొలిచాయా ?/వేళ్లు నిజంగా / శిల్పి వేళ్ళే సుమా !" (పూలు పిలుస్తున్నాయి) – అంటూ కోసూరి గాంధీ, "కఠిన శిల / శిల్పమయ్యిందా !/ ఎముకల గూడు చేతిలో /సుత్తి ,ఉలి " (చార్మినార్ నానీలు) – అంటూ కన్నోజు లక్ష్మీకాంతం హృద్యమైన నానీలు రచించారు.

సమకాలీన సమాజంలో రెడీమేడ్ వస్త్ర పరిశ్రమలు విస్తరిస్తున్న కొద్దీ దర్జీ వృత్తికి ఆదరణ తగ్గడం గమనించవచ్చు. దర్జీ వృత్తికారుల జీవితం లోని ఒడిదుడుకులను గురించి చెలిమి చెలిమెలు నానీల సంపుటిలో మాడిశెట్టి గోపాల్ – "చిరిగిన వస్త్రాన్ని/ కుట్టే దర్జీ /జీవితపు చిరుగులు /ఎవరు కుడతారు ?" అని ప్రశ్నిస్తారు .

రజకులు తమ కులవృత్తిలో భాగంగా బట్టలు ఉతకడం, ఇస్త్రీ చేయడం వంటి శుభ్రతకు సంబంధించిన పనులను చేస్తూ సమాజీయుల శుద్ధికి కృషిచేస్తే, మరి వారి జీవితంలోని సమస్యలనే ముడుతలను ఎవరు తొలగిస్తారు అని ప్రశ్నించారు మాడిశెట్టి గోపాల్ చెలిమి చెలిమెలు నానీ సంపుటిలో

" బట్ట ముడుతలు /తొలగిస్తూ ఇస్త్రీ వాడు /బ్రతుకు ముడుతలు /సరిచేసే మేస్త్రీ ఏడి "

"కంసాలి /నాగిషీలు దిద్దుతున్నాడా /అయినా, /ఆకలి చావులు తప్పవే!", " అయ్యో /కొలిమి ఆరిపోతుంది./ అందుకే మరి /బలిమి చావులు", " పాత్రలన్నీ /స్టీలు, ప్లాస్టి క్కులే /పాపం ! /కంచరి ఆచారి ఏమయ్యాడో " (చార్మినార్ నానీలు) – కన్నోజు లక్ష్మీకాంతం. ఈ నానీలు కాలక్రమం లో కంసాలి వృత్తి పని మాయమవుతున్న విషయాన్ని తెలుపుతాయి.

ముగింపు – వేగంగా విస్తరించిన ఆధునిక సంస్కృతిలో భాగంగా, ఒకనాటి చేతివృత్తులు కనుమరుగవుతూ, ఆ స్థానంలో యంత్ర సౌకర్యాలు విరివిగా అందుబాటులోకి రావడం .యంత్ర పరిజ్ఞానం లేని వివిధ వృత్తికారుల జీవితాలను కొండను అద్దంలో చూపినట్లు, ఈ నానీలు నాలుగు పాదాల కవితలో చూపుతూ, ఆలోచింపజేస్తాయి. వివిధ వృత్తుల పట్ల, వృత్తి కళాకారుల జీవితాలను గురించిన అవగాహన కల్పిస్తాయి భవిష్యత్తులో వృత్తుల ఉనికి పట్ల ఆలోచనలను రేకెత్తిస్తాయి . తరతరాలుగా ఒక తరం నుండి మరొక తరానికి

సంక్రమించిన  చేతి వృత్తుల నైపుణ్యాన్ని కాపాడుకోవాలన్న సూచనను చేస్తారు నానీ  కవులు .

## ఆధార గ్రంథాలు :


* నానీలు – ఆచార్య ఎన్ ఆచార్య ఎన్. గోపి – చైతన్య ప్రచురణలు, హైదరాబాద్, 2001
* పెద్ద గడియారం –కరీంనగర్ నానీలు –  సంపాదకులు : జింద అశోక్ –మానేరు రచయితల సంఘం, సిరి సిల్ల, 2007
* జీవనలిపి – డా. ఎస్. రఘు –మనస్వి ప్రచురణలు, ఖమ్మం,2004
* జొన్న కంకులు – డా.బండారు సుజాతా శేఖర్, దాచేపల్లి మాధురి & మనోజ్ పబ్లికేషన్స్, దేవరకొండ –2006
* మానేరు నానీలు – జిందం అశోక్ మానేరు రచయితల సంఘం, సిరిసిల్ల, 2006
* మట్టి మల్లెలు –డా. అడువాల సుజాత – శ్రీ షిరిడి సాయి ప్రచురణలు – 2008
* చినుకులు – నెల్లుట్ల రమాదేవి –అపూర్వ పబ్లికేషన్స్, హైదరాబాద్,2021
* చెన్నప్ప నానీలు –డా. మసన చెన్నప్ప – ప్రమీల ప్రచురణలు, హైదరాబాద్, 2005
* పూలు పిలుస్తున్నాయి – కోసూరి గాంధీ, ప్రజాపత్రిక ప్రచురణలు –2004
* అక్షర క్షణాలు – జీసనార –ఆంధ్ర సరస్వత సమితి –2006
* ఆలకించే అక్షరం – జయప్రద వంశీ పబ్లికేషన్స్, నెల్లూరు –2007
* దీపంతలు –వై. సత్యనారాయణ, రమ్య ప్రచురణలు, వరంగల్ –2007
* చార్మినార్ నానీలు – కన్నోజు  లక్ష్మీకాంతం –విశ్వ కళా భారతి సాహితీ సాంస్కృతిక సంస్థ – హైదరాబాద్, 2006
* చెలిమి చెలిమెలు – మాడిశెట్టి గోపాల్, సమైక్య సాహితీ ప్రచురణలు, కరీంనగర్, 2007






# మదిలో రగిలే భావాలకు అక్షర రూపమే నానీలు

డాక్టర్ బట్టు విజయ్ కుమార్
95055 20097

ఉత్తమ కవిత్వానికి ఆకర్షించే గుణం ఉన్నది. చదివిన వారి మనసులను రంజింపజేస్తుంది. కవిత్వం ఆహ్లాదాన్ని కలిగిస్తుంది. ఎలాంటి వారినైన కట్టి పడేస్తుంది. అందుకే ఎన్నో ఏళ్ళుగా సహృదయుల నీరాజనాలందుకుంటుంది. కొత్త కొత్త పుంతలు తొక్కుతూ అలరిస్తుంది. సాంకేతిక ప్రసారం పెరిగేకొద్ది కవిత్వం చదివే పాఠకులు పెరిగారు. వ్రాసేవారి సంఖ్యా పెరిగింది. కవిత్వం చదివేటప్పుడు అందులో ఏదో ఒక వాక్యం గుండెకు హత్తుకుంటుంది. అక్కడే తిష్ఠ వేసుకుని కూర్చుండిపోతుంది. అందుకే "వాక్యం రసాత్మకం కావ్యం" అన్నారు పెద్దలు. ఆ వాక్యం గుండెను మాటిమాటికి తడుముతూ ప్రసంగంలోనో, మాటల్లోనో, తిరిగి తొంగిచూస్తుంటుంది. అది ఎప్పుడో మరో కవితకు స్ఫూర్తిదాయకమూ కావచ్చు. ఆ శక్తి ఒక్క కవిత్వానికే ఉన్నది.

ఆధునిక సాహిత్యంలో భావాన్ని వ్యక్తీకరించడానికి అనేక లఘుప్రక్రియలు పుట్టుకొచ్చాయి. అవి పండితుల నుంచి పామరుల దాకా ఎందరినో అలరించాయి. కొందరు పద్యానికి పెద్దపీట వేస్తే, కొందరు వచనం వైపునకు అడుగులు వేశారు. వారితోపాటు ఎందరినో ఆ దారిలోకి ఆహ్వానించారు. గేయ కవిత, వచన కవిత, గజళ్ళు, రుబాయిలు , హైకూలు, మినీ కవిత, వ్యంజకాలు సృష్టించుకున్నారు. ఇదే పరంపరలో నానీలు కూడా ఒక ప్రక్రియగా అవతరించాయి.

లఘు కవితా ప్రక్రియల్లో నానీలు వర్తమాన కాలంలో సంచలనం సృష్టించి, ఆధునిక వచన ప్రక్రియలో సుస్థిర స్థానాన్ని సంపాదించుకుందని చెప్పవచ్చు. ఉద్వేగభరితమైన స్థితిలో నుంచి, నిరంతర వేదనలో నుంచి ఉద్భవించిందే ఈ నానీల సృజనాత్మకత. అతికొద్ది కాలంలోనే పెరిగి పెద్దదై తనదైన ముద్రను సొంతం చేసుకుంది. ఇదొక భావాల గాలి దుమారంలా లేచిందని చెప్పవచ్చు.

తెలుగు సాహిత్యరంగంలో అత్యాధునిక దేశి ప్రక్రియ 'నానీ' 1997లో ఆచార్య ఎన్. గోపిగారి కలం నుండి కవితారూపంగా పురుడుపోసుకున్నది. 'నానీ' అనే మాట ఉర్దూ నుంచి వచ్చింది. లతామంగేష్కర్ పాడిన పాట "మేరే ఘర్ అయే ఎక్ నన్హేపరి" నన్హేపరి అంటే చిన్నారి అని అర్థం. నానీలు అంటే చిన్న పద్యాలు, చిన్న కవితలు. కాలంతో ప్రవహిస్తూ తనదైన భావశైలితో, వస్తు నిర్మాణంతో, ధారయుక్తితో, గాఢతతో, సాంద్రతతో ఒక కెరటంలా ఎగిసిపడే ఉదాత్తగుణంతో 'నానీ' సూటిగా పాఠకుని హృదయాన్ని తాకుతోంది. "అల్పాక్షరముల ననల్పార్థ రచన కల్పించుటయు కాదె కవి వివేకంబు" అని అంటారు పాల్కురికి సోమనాథుడు. ఇదే విధంగా చిన్న నానీలో గాఢమైన భావవైశాల్యాన్ని చొప్పించి చెప్పవచ్చు. 'వార్త' పత్రిక సంపాదకులు ఎబికె ప్రసాదుగారు ఆ పత్రికలో 20 వారాలపాటు నానీలు ప్రచురించారు. 30 వారాలపాటు 'సుప్రభాతం' పత్రికలో సీరియల్‌గా ఈ నానీలు వచ్చాయి. అప్పటి నుంచి చిట్టి నానీలు, గట్టి నానీలుగా పేరుమోశాయి. సూక్ష్మంలో మోక్షం అన్నట్లు పరిణమించాయి. అనేకులు ఈ నానీలకు ఆకర్షితులై కలాలు కదిలిస్తున్నారు.



**వస్తువైవిధ్యంతో ఇప్పటి వరకూ వేలాది నానీల సంపుటాలు ప్రచురించబడ్డాయి.**



ఈ నేపథ్యంలో వస్తువైవిధ్యంతో ఇప్పటి వరకూ వేలాది నానీల సంపుటాలు ప్రచురించబడ్డాయి. వీటిలో సమకాలీనత కనిపిస్తుంది.

"అరక్షణంలో తటిల్లతలా అలా మెరిసి సూక్ష్మంలో మోక్షం చూపించే సంక్షిప్త దేహ సంచరిత ప్రసూనం. తన ప్రయాణంలో ఫాలోవర్స్ ఉంటే కవిదారి సరైందే! బ్రివిటి కవిత్వ లక్షణం అయినప్పుడు నానీ అసలైన కవిత్వం" అని నానీల గురించి నాగభైరవ కోటేశ్వరరావుగారు నిర్వచించారు.

ఈ నానీ ప్రక్రియ ఎన్నో భాషల సాహిత్యంలో చోటు సంపాదించుకుంది. ఒక్కొక్క చోట ఒక్కొక్క పేరుతో పిలవబడింది. మంచి సాహిత్యం ఎక్కడ ఉన్న అది తర్జుమా అవుతుందని చెప్పవచ్చు. మన దేశంలో బెంగాల్, తమిళం, కన్నడ, మరాఠి, హిందీ, సంస్కృత భాషల్లోని సాహిత్యం చాలా వరకు తెలుగులోకి అనువదింపబడింది. తెలుగులో ఒక భాగంగా మారింది. ఇవే కాకుండా ఇతర

దేశాలనుంచి వచ్చిన రష్యా భాషల్లోని కథలు, ఆంగ్లంలోని రచనలు తెలుగులో అనువాదమైనవి.

ఈ నానీ ప్రక్రియ కూడా అదే తరహాలో కొనసాగి, అనేక భాషల్లోకి అనువదించబడింది.

అవి :

| | | |
|---|---|---|
| హిందీ | – | నన్హేముక్తక్, గోపీకే నన్హేముక్తక్ |
| మరాఠీ | – | 'నానీలు' ముక్తక్ మణికా |
| సంస్కృతం | – | నవమౌక్తికాః |
| తమిళం | – | నానీగళ్ |
| కన్నడ | – | నానీగళ్ |
| గుజరాతి | – | నానీలు |
| ఉర్దూ | – | నన్హీ నజ్మే |
| మలయాళం | – | నానీ కవితాకళ్ |
| పంజాబి | – | నన్హేముక్తక్ |

తెలుగులో విదేశీ ప్రక్రియలు కొన్ని వచ్చి చేరాయి. అవి పారశీక ప్రక్రియలైన రుబాయి, గజళ్ళు. జపనీ ప్రక్రియ అయిన హైకూ. తెలుగు సాహిత్యం ఇతర భాషల్లోని రచనలను, ప్రక్రియలను తనలోకి సాదారంగా ఆహ్వానించింది. ఇతర ప్రక్రియలు తెలుగు సాహిత్యంలోకి ఎలా వచ్చాయో తెలుగు సాహిత్యంలో ఉన్న నానీ ప్రక్రియ కూడా విదేశీ సాహిత్యంలోకి అలాగే ప్రవేశించి, పాఠకుల మనసులను ఆకర్షించి, ఆమోదించబడి, ఆదరించబడింది.

నానీలు అనువదించబడిన విదేశీ భాషలు

| | | |
|---|---|---|
| ఇంగ్లీష్ | – | నానీలు ది లిటిల్ వన్స్ |
| రష్యన్ | – | చికత్ వోర్జియేమినియాచూరి |

నానీలకు కొన్ని నియమాలున్నాయి. అవి

1. నాలుగు పాదాలు ఉండాలి.
2. మొదటి రెండు పాదాలు ఒక భావాంశంగా చివరి రెండు పాదాలు ఒక భావాంశంగా ఉంటాయి.

3. చివరి యూనిట్‌లో కవి చెప్పదలుచుకున్న 'పంచ్' ఉండాలి.

4. 20 అక్షరాలు తగ్గకుండా 25 అక్షరాలు మించకుండా ఉండాలి.

5. నానీలో కొసమెరుపు ఉండాలి.

6. ఇవి ముక్తకాలు.

చెరువులో
బంగళాలు
మొలిచాయి
నీటి తల్లికి
ఇన్ని సమాధులా?

సంక్షిప్తత, ధారణానుకూలత, శబ్దార్థాలంకారత, ధ్వన్యాత్మక, వ్యంగ్య, హాస్య లోకోక్తుల వినియోగం, భావుకత, ప్రాంతీయ సాంస్కృతిక విశేషాల స్పర్శ ఇవన్నీ నానీలో స్పష్టంగా కనబడతాయి. సందర్భానుసారంగా, భావానుకూలంగా మెటాఫర్‌లను వాడితే అందమైన నానీ పుడుతుంది.

గోపిగారి మాటల్లో "నేనెప్పుడు చెప్తుంటాను. దేనికైనా కవితాశక్తి ముఖ్యం. నాలుగులైన్లు రాసి పారేసి అవి నానీలంటే నేనొప్పుకోను. వస్తురూపాలకు తగు ప్రాధాన్యత లభించి, కవి సంవేదనలో, ఆర్తిలో, శిల్పసౌష్టవంలో తడిసి వెలువడితే ఆ కవిత్వం సార్థకమవుతుంది". చూపుకు చిన్న ప్రక్రియ అయినా ఇందులో తాత్త్వికత, ప్రేమ, విరహం, విషాదం స్పష్టంగా పలికించవచ్చు.

ఎన్. గోపిగారు చెప్పిన నానీ చూద్దాం`

దహనంలో
కుడి చేయి కాలలేదు
కారణం
అది కలం పట్టుకున్న చెయ్యి

కవికి ఎప్పటికి మరణం ఉండదనే మాటని ఈ చిన్న ప్రక్రియలో చెప్పేశారు. ఇలా దీనిని ఎలాగైన విశ్లేషించుకోవచ్చు.

చెరువులో
బంగళాలు మొలిచాయి
నీటి తల్లికి
ఇన్ని సమాధులా?

మానవుడి ఆకలి ఇప్పటికీ ఎప్పటికీ తీరదు. ఎందుకంటే తను ఎదిగే క్రమంలో ఎన్నో అకృత్యాలకు పాటుబడుతున్నాడు. అడవులను కొట్టేయడం. చెరువులను ఆక్రమించుకోవడం. కొండలు కూలగొట్టడం. మనిషి స్వార్థపూరిత ఆలోచనలను, భావోద్వేగాలను కూడా వ్యక్తికరించడానికి అనువైన అభివ్యక్తిని అందిస్తుంది నానీ.

**మట్టిని నమ్ముకున్నవాడు ఎప్పుడు ఓడిపోడు. ఆ మట్టినే బంగారంగా మార్చి బతుకీడుస్తున్న వారున్నారు.**

కుండ ముక్కలైందా
కుమిలిపోకు
మట్టి మరోరూపం కోసం
సిద్ధమౌతుంది

మట్టిని నమ్ముకున్నవాడు ఎప్పుడు ఓడిపోడు. ఆ మట్టినే బంగారంగా మార్చి బతుకీడుస్తున్నవారున్నారు. ఆ మట్టి ఎన్నో రూపాలను సంతరించుకుంటుంది. అదే విధంగా జీవితంలో ఏదో బాధ కలిగిందని ఏడుస్తు కూర్చోవడం కంటే దానికి పరిష్కార మార్గాలు వెతకడం మంచిదని ఈ నానీ ప్రబోధిస్తుంది. మనోధైర్యాన్ని నింపుతుంది.

గోపిగారు సృజించిన నానీ ప్రక్రియ ఎందరో నానీ కవులను సృష్టించుకుంది. గోపీగారే ఎందరో నవకవులకు, యువకవులకు నానీల అక్షరాభ్యాసం చేయించారు. అది ఒక ఉద్యమంగా సాగిందనే చెప్పాలి. ఏ ఇతర ప్రక్రియకి అతికొద్దికాలంలో ఇంతటి ప్రచారం జరుగలేదు. ఎందరినో తన వైపు చూసేంతగా, ప్రతి ఒక్కరు స్పృశించేంతగా మారిందంటే అది ఆ ప్రక్రియలో ఉండే గొప్పతనం.

ఈ పరంపరలో అనేకమంది నానీ కవులు వచ్చారు. బొంబాయి నానీలు, ఢిల్లీ నానీలు, గుంటూరు నానీలు, మానేరు నానీలు, విశాఖనానీలు, హైదరాబాద్ నానీలు, చార్మినార్ నానీలు, నల్లగొండ నానీలు, నల్లమల రత్నాలు నానీలు, నూరు తెలంగాణ నానీలు, పల్లె నానీలు, బతుకమ్మ పూలు నానీలు, వ్యవసాయ నానీలు, సంగీతగీత నానీలు, జొన్న కంకులు నానీలు, మనసు నానీలు, నేతన్న నానీలు, దళిత నానీలు, బంజారా నానీలు, సాహిత్య నానీలు, పెన్నా

తీరాన నానీలు, గులకరాళ్ళ నానీలు ఇలా వైవిధ్యభరితమైన నానీలు వచ్చాయి. ''నా`నీ ప్రపంచం'' నానీల సంకలనంలో కొంత మందిని పరిచయం చేసే ప్రయత్నం చేస్తాను.

**చిటికెడు కుంకుమ**
**ఎంత ప్రియం**
**ఆమె ఎన్నేళ్ళు**
**జీతం చేసినా**
**తీరలేదు**

పుస్తకం
గుండె తెరిచింది
హృదయం
కొంత పురులు విప్పింది

ఈ నానీ ఎంతో గాఢంగా ఉంది. పుస్తకాన్ని తలదించి చదివితే అది తలఎత్తుకునేలా చేస్తుంది. పుస్తకాలు బాగా చదవడం వల్ల ఆలోచనలో విశాలత పెరుగుతుంది. హృదయం విశాలంగా మారుతుందని కవి తెలియజేశారు.

ఆమె తెచ్చి ఇచ్చేదాకా
గుర్తేలేదు!
ప్రేమసంచీ
మరచిపోయానని!!

ఇది గొప్ప ఊహ. ఊహాలోకంలో కవిని మించిన చక్రవర్తి లేడు. మారుతున్న యాంత్రిక జీవనంలో మరిచిపోయిన అనురాగాన్ని, ఆప్యాయతను ప్రేయసి తట్టి లేపిన విధానాన్ని ఎన్.సిహెచ్ చక్రవర్తిగారు పైరెండు నానీలలో అందంగా అభివ్యక్తికరించారు.

చిటికెడు కుంకుమ
ఎంత ప్రియం
ఆమె ఎన్నేళ్ళు
జీతం చేసినా తీరలేదు

ఒక కుటుంబంలో స్త్రీ చేసే శారీరక పరిశ్రమకు దర్పణం పట్టిన భావం ఇది. పొద్దున లేచినప్పటినుంచి రాత్రి పడుకునే దాకా ఎంతో శ్రమిస్తుంది. వంటపని, ఇంటిపని తానే చూసుకుంటుంది. అందుకే ''కార్యేషు దాసి, కరణేషు మంత్రి, భోజ్యేషు మాతా'' అన్నారు. ఈ భావాన్ని ఈ చిన్ని నానీలో పాలపర్తి హవీలాగారు పలికించారు.

ఏ రైతు వేసిన
విత్తనమో
ఆకాశంలో
మొలకెత్తింది జాబిల్లి

ఎంత చక్కని ఊహాశక్తి ఇది. ఆకాశం అనే పొలంలో జాబిల్లిని విత్తనంగా నాటిన రైతు గురించి ఈ నానీలో చెప్పాడు వ్యాసకర్త (బట్టు విజయ్‌కుమార్).

ఉన్నన్నాళ్ళూ
మనిషికి ముద్దలేదు
పోయాక
కాకులకి పిండాలు

ఇందులో ఎంతో తాత్త్వికత దాగి ఉంది. పెద్దవారు బతికుండగా వారికి పిడికెడు ముద్దపెట్టలేక వారు చనిపోయాకా పిండాలు పెట్టి కాకులను పిలుస్తుంటారు. బతికుండగా వారిని గుర్తించకుండా కాలం దాటేస్తారనే సత్యాన్ని ఈ నానీలో విట్టుబాబుగారు ప్రస్తావించారు.

మదిలో రగిలే భావాలకు కవితా రూపానిచ్చి దానిని నిలబెట్టిన సృజనాత్మక ప్రక్రియ నానీ. ఈ ప్రక్రియ స్పర్శ వల్ల అనేక కొత్త కోకిలలు తెలుగు కవితావనంలో గళాలు సవరించుకున్నాయి. సవరించుకుంటున్నాయి. ఎప్పుడూ నాలుగు అక్షరాలు రాసే సాహసం చేయనివారు కూడా నానీ నీడలో కలాన్ని ఝుళిపిస్తున్నారు. సాహిత్య లోకంలో కలాల దివిటి పట్టుకుని వెలుతురు వైపు అడుగులేస్తున్నారు. "కాదేది కవిత్వానికి అనర్హం" అన్నట్టు "కాదేది నానీకి అనర్హం"గా మారింది. ఈ నానీల తోటలో పూట పూటకు అనేక రకాల నానీలు పూస్తున్నాయి. ఈ నానీల అంశలు సహృదయ సమీరాలతో దశదిశలకు వ్యాపించి నాణ్యమైన నానీలను మొలకలెత్తిస్తున్నాయి.





# ధన్యోస్మి



జనవరి -మార్చ్ 2025 సంచికలో ప్రచురణ కోసం మంచి వ్యాసాలు రాసి పంపిన వ్యాసకర్తలకి శతకోటి నమస్సులు. ఈ సంచిక వెలువరించడంలో ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ సహకరించిన వారెందరో, వారందరికీ వందనములు.

ఈ సంచికతో 'ప్రకాశిక' 5వ సంవత్సంలోకి అడుగుపెట్టింది. ఎందరో అభిమానుల, సంపాదక వర్గ సభ్యుల సహాయ సహకారాలతో గత నాలుగు సంవత్సరాలు 'ప్రకాశిక' తెలుగు పత్రికా రంగంలో విశిష్టమైన స్థానం సంపాదించుకుందని పలువురి ప్రశంసల ద్వారా విని ఆనందం కలిగింది.

ఐదవ సంవత్సంలోకి అడుగుపెట్టిన ప్రకాశికకి కొత్త ఆలోచనలు, యువ శక్తి అవసరం. గత కొన్ని సంవత్సరాలుగా 'ప్రకాశిక' సంపాదక మండలి సభ్యులుగా సేవలు అందించిన శ్రీ విహారి గారికి, శ్రీ మండలి బుద్ధ ప్రసాద్ గారికీ, డా. సుంకర గోపాలయ్య గారికి ఈ సందర్భంగా కృతజ్ఞతలు తెలియచేస్తున్నాను.

కొత్త సంపాదక మండలి సభ్యులుగా చేరినవారందరికీ పేరుపేరునా ధన్యవాదాలు తెలియచేస్తున్నాను. విశ్వవిద్యాలయాలలో జరిగే పరిశోధనల ఫలితాలను ప్రచురించే ప్రయత్నంలో భాగంగా విద్యాసంబంధిత ప్రచురణ విభాగాన్ని ఏర్పాటు చేయడం జరిగింది. దానికి ఆచార్య దార్ల వెంకటేశ్వరరావు గారు కార్యనిర్వాహక సంపాదకులుగా వ్యవహరించడానికి అంగీకరించారు. ఆయనకి ప్రత్యేక ధన్యవాదాలు. సంపాదక మండలి సహకారంతో ప్రకాశిక ని మరింత ఉన్నతమైన పత్రికగా నడిపే ప్రయత్నం చేస్తాను.

ప్రచురణ కోసం కథలు, కవితలు, పరిశోధనా వ్యాసాలు పంపమని రచయితలను కోరుతున్నాము.

ఎప్పటిలాగే పాఠకులు ఈ సంచిక ను కూడా చదివి ఆనందిస్తారని ఆశిస్తాను.

చదవండి, చదివించండి

భవదీయుడు

**ఆచార్య కొవ్వలి గోపాలకృష్ణ**

ప్రధాన సంపాదకులు

